# భక్తనారదీయము



గ్రంథకర్త:

పర్థపు రామకృష్ణశాస్త్రి

సంగీత సాహిత్య కళానిధి

శ్రీ సీతామనోవల్లభాయ నమః

# భక్తనారదీయము

(నారద మునీంద్రుని దివ్యచరిత్రము)




గ్రంథకర్త:

హరికథా రచనావిశారద, హరికథా సుధాకర,,

సంగీతసాహిత్య కళానిధి

## కేతవరపు రామకృష్ణశాస్త్రి,





పబ్లిషర్సు:

## వేంకట్రామ అండ్ కో.,

హెడ్డాఫీసు:- విజయవాడ.

నవంబరు, 1951.




[వెల రు. 2—8—0.

ఓమ్ నమః పరమాత్మనే.

ధర్మస్య జయోఽస్తు

అధర్మస్య నాశోఽస్తు

ప్రాణిషు సద్భావనాఽస్తు

విశ్వస్య కల్యాణ మస్తు.

హరహర మహాదేవ !

శ్రీరామ జయరామ జయ జయ రామ.

# తొలి పలుకు

## "కవిసమ్రాట్" విశ్వనాథ సత్యనారాయణగారు

ఈ భక్తనారదీయ గ్రంథకర్త శ్రీ కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారు. వీరు మచిలీపట్టణ వాస్తవ్యులు. నా చదువు, నా కొన్ని వ్యాగాలు బందరులోనే జరిగినవి. నాకు నలుబదివేండ్లు వచ్చువఱకు ను బందరు వాస్తవ్యుఁడను. కనుక శ్రీ శాస్త్రిగారికి నాకు మిక్కిలి పరిచయమును స్నేహము ప్రేమయుఁగలవు. వీరి వంశము సంగీతసాహిత్య ముల రెంటియందును ప్రసిద్ధమైనది. వీరికిని రెండింటియందును సామర్థ్య కలదు. సాహిత్యము శాస్త్రబద్ధమైనను మాదృశుల కొందరియందు గీతము శాస్త్రబద్ధముకాదు. కాని శ్రీ శాస్త్రిగారియం దదియును స్త్రబద్ధమే. ఇంక వీరి కవితారచన ధారాశుద్ధి కలది. వీరు సహజముగా క్తి భావము కలవారు. ఆ భక్తి భావము పక్వమై చివరకీ 'భక్త రదీయము'గా వెలువడినది. నారదుఁడు మహాభక్తుఁడు. ఆయనకు సంబంధించిన కథ లేరి యీ కావ్యముగా నిర్మించిరి. నారదుఁడుకూడ మాయకు లోఁబడినవాఁడే యన్నర్థము ప్రవచించు కథలున్నవి. వానికి బ్రహ్మయొక్క శాపము మూలహేతువుగా నిందున్నది. బ్రహ్మ శాపమునకును మూలప్రకృతికిని అభేదప్రతిపత్తిగాఁ గల్పనము. నిజమున ంతియేఁ కావచ్చును. ఇది వ్యాఖ్యానతో విశేష ప్రతిపత్తివిషయము. ఈ గ్రంథమునందలి శైలి యొడుదుడుకులు లేనిది. కథాస్వరూపము ప్రధానముగాఁ బాఠకునకు నందిచ్చురచనయిట్లుండును.సామాన్య భాషా జ్ఞానముకలవారికైననుదీనియందలిరసాదులుసువ్యక్తములు. ఈగ్రంథము శ్రీరామచంద్రాంకితము. ఇట్టి భక్తిభావ పరిపూర్ణమైన గ్రంథము పరి యింకెవరి కంకితము కాఁగలదు? నేల యెంత యెడ్డగెడ్డమైనను భక్తియు సనాతనభావములు సృష్టియందుమాసిపోవు. కల్యావసానమందే గాని యీ సనాతనభావము అయిదువేలు పైచిలుకు నాటికే మాసి పోవునా? శ్రీ శాస్త్రిగారివంటి విద్వత్కవులు పై చెప్పిన భావమునకుఁ గారాకాణలు. శ్రీ శాస్త్రిగారికిఁ బరమేశ్వరుఁడు చిరాయురారోగ్యై శ్వర్యములు ప్రసాదించుగాక,

— విశ్వనాథ సత్యనారాయణ.

శ్రీ భాష్యాయ నమః  శ్రీ గురుభ్యో నమః

# సమీక్ష

కవితిలక, కవితా విశారద, విద్వాన్,

శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు.

భక్త నారదీయ మను గ్రంథమును రచియించినవారు "హరికథా రచనా విశారద, హరికథా సుధాకర, సంగీత సాహిత్య కళానిధి" అను బిరుదులు వహించిన బ్రహ్మశ్రీ కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారు. వీరిది పండిత వంశము. వీరి తండ్రిగారైన శ్రీ లక్ష్మీనరసింహ శాస్త్రి గారు మహాపండితులు, బ్రహ్మజ్ఞాన సంపన్నులని వినికిడి. శ్రీ శాస్త్రి గారు భక్తనారదీయములో నుదహరించిన కొన్ని పద్యములు వచనముల లోని వేదాంత భావములను జదువగా వీరికి సంస్కారము వంశపారం పర్య క్రమముగ వచ్చినదేగాని క్రొత్తగఁ దెచ్చుకొన్నదికాదు, అను భావము స్ఫురింపక మానదు.

లోకములో కవిత్వమందే ప్రఖ్యాతిఁగాంచినవారు కొందరు. పాండిత్య కవిత్వముల యందు పేరుగడించినవారు కొందరు. సంగీత కవిత్వములు రెండింటియం దీయనకుఁ బ్రజ్ఞ గలిగియుండుట విశేషము. ఆంధ్ర సంస్కృతములందేగాక హిందీ, బెంగాలి భాషలయందుఁగూడ వీరికి మంచి పరిచయము కలదు.

వీరినవలలు, నాటకములు, కథలు, చరిత్రములు, హరికథలు, సంస్కృతాంధ్ర హిందీభాషలలోని వస్తువు నాధారముగఁ దీసికొనిరచియింపఁ బడినవి. నిరంజనోపాఖ్యాన మను హరికథ వీరి హరికథలయొక్క సారమని చెప్పవచ్చును. వీరినవలలలో 'కోహినూరు' నవలారచనయొక్క సారము. వీరు రచియించిన ప్రహ్లాద, మార్కండేయ, మీరాబాయి మున్నగు నాటకము లన్నియును సుప్రసిద్ధ నటులద్వారా రంగస్థలముల యందుఁ బ్రదర్శింపఁబడి జనానుమోదములకుఁ బాత్రములైనవి. కావ్యములలో భక్త నారదీయము మంచి పాకమునఁ బడినదని చెప్పవచ్చును.

కథానాయకుఁడైన నారదుఁడు తపస్వికావున నైమిశారణ్య వర్ణనతో కథారంభము. శౌనకాదిమునులు సౌతిని నారదచరిత్ర యడుగుదురు. అతఁ డారంభించి చెప్పును. బ్రహ్మకు మానసపుత్త్రుఁడుగా నారదుఁడు సనకాదిమునులతో వసిష్ఠాదులతో జన్మించును.

గీ॥ ప్రజ లనావృష్టిచే బాధ ♦ పడెడువేళ
నితఁడు జన్మింప సంపూర్ణ ♦ వృష్టి కలిగెఁ
గాన జలమొసంగినయట్టి ♦ కారణమున
నారదుఁడని బాలకునకు ♦ నామమిడిరి.

గీ॥ అనుదినంబును దనతోడ ♦ నాడుకొనెడి
బాలులకు హరినామ త ♦ త్త్వంబుఁ దెలిపి
జ్ఞానవృద్ధి నొసంగఁగఁ ♦ జాలియుంట
నారదుఁడని బాలకునకు ♦ నామమిడిరి.

ఆ॥ వె॥ నలువ గళమునుండి ♦ నరులు జన్మించుట
వలన బ్రహ్మ కంఠ ♦ భాగమునకు
నరదమను విచిత్ర ♦ నామంబుకలిగెను
నరద భవుఁడుకాన ♦ నారదుండు.

(తృతీ— 74, 75, 79 ప)

ఈ పై రీతుల నారద నామము కలిగినట్లు కవి వర్ణించిరి. సనకాదులు నల్వురును ముక్త సంగులైరి. పులస్త్య, వసిష్ఠ, నారదాదులం గాంచి బ్రహ్మ వారిచే సృష్టిచేయింప సంకల్పించి వారిని గేస్తులఁ గమ్మని పలుక నారదుఁడు మాత్రము స్త్రీగేహాదులపై దుర్వ్యామోహమును జెంది నరకమునఁ బడఁజాలననియును, దపము నొనర్ప సెల విమ్మని వేడ బ్రహ్మ యలిగి గేస్తువగుట కేవగించిన నీవు గంధర్వకులమునఁ బుట్టి పెక్కు రూపవతులకు భర్తవు కమ్మని శపించెను. నారదుఁడు కవచమాలికా స్తోత్ర మంత్రాదులు నీకుర్విని గలుగకుండుఁగాక యని ప్రతిశాపమిచ్చెను. బ్రహ్మశాపమున నారదుఁ డుపబర్హణుఁడై

జన్మించి బాల్యమాది హరిభక్తి కలవాఁడై వసిష్ఠుని దగ్గర సాంగ వేదములను అరువదినాల్గు కళలను ధనుర్వేదమును శాస్త్రములను నేర్చెను.

బ్రహ్మ యొకనాఁడు దేవసభకు నుపబర్హణుని గానము వినుటకై పిలువఁబంచి పాడించెను. ఉపబర్హణుని గాన ప్రదర్శన నెపమున గ్రంథకర్త తనకుఁగల సంగీత పాండిత్యమును ఈ క్రింది పద్యములలోఁ జక్కగ వర్ణించెను. ఉ॥ వీణనుమీఁటి తంత్రులను ... ... ... ... ... ...

సీ॥ రహీనిముప్పదియాఱు•రాగము ల్మధ్యమ ... ...

ద్వితీ - 86-87 పద్యములు.

సభ్యులు గాయకుఁడుగూడ హరిగుణకీర్తనామృత లహరిలోఁ మునిఁగి తన్మయులైరి. గోపికావిరహ గీత గానముచేయు సమయమున నుపబర్హణునకుఁ దాళగతి దప్పగా బ్రహ్మ యుపబర్హణుని గంధర్వ శరీరమును ద్యాగమొనర్చి దాసీపుత్త్రుఁడవు కమ్మని మఱల శాపమిచ్చెను. ఉపబర్హణుఁడు సమాధినిష్ఠుఁడై ప్రాణములఁ బాయఁగా ప్రథమ భార్యయగు మాలావతి దుఃఖార్తయై పతిమరణమునకుఁ గారణులైన దేవతలపై యలిగి పతివ్రత గావున బ్రహ్మనుద్దేశించి "పద్మభవ! వినుమిదె పుత్త్రశాప కారణమునఁ బుడమిలోఁ బూజ్యతం గోలుపోతివి. నేను నీ యధికారంబు నేలఁగూల్తు" నని శపింప నిశ్చయించెను. ఆమె యింకేమి శపించునో యను భయమున బ్రహ్మ విష్ణు మహేశ్వరులామెయున్న కడకేగి యుపబర్హణునికి మఱికొంత కాల మాయువు నొసంగిరి.

బ్రహ్మ శాపప్రకారము మూఁడవ జన్మమున వృషలీ గర్భమున జనించి బాల్యమాది విష్ణుభక్తుల సాంగత్యమున హరిభక్తి కలిగి సాధుసేవఁ జేయుచుండెను. వారు నతనినను గ్రహించి సదుపదేశము చేసిరి. భక్తిపరవశుఁడగు నారదుని వర్ణించిన పద్యములను జదివినచోఁ కవియొక్క హృదయగతభక్తి భావము వెల్లడియగును.

సీ॥ శ్రీనాథనామ జపానందమాధురీ పరవశుఁడై మేనుమఱచువాని

(తృతీ. 95 ప.)

సీ॥ నిజదేహ సుందర నిష్ఠాగరిష్ఠుఁడై ... ... (తృతీ. 103 ప.)

సీ॥ నా కృష్ణ దేవుఁడు నను బోవ రాడేల ... ... (తృతీ. 104 ప.)

బాలకుఁడు తరువాత తపస్సుఁజేసి తనువుఁ బోఁగొట్టి తిరిగి బ్రహ్మకు నందనుఁడై జన్మించెను. మరల బ్రహ్మ నారదుని సృష్టికార్యమునకై ప్రోత్సహించెను గాని యీ తడవ నారదుఁడు ఆత్మసంకల్పమును బితామహునకు నివేదించి యతని నంగీకరింపఁజేసి కృష్ణమంత్రము నర్థించెఁగాని బ్రహ్మ యతనిని కైలాసమున కనిపి శివునిచే నుపదేశము చేయించెను.

శివుఁడు నారదునకు భక్తితత్త్వము, భక్తలక్షణము, ప్రేమ స్వరూపము, గురుమహిమ మొదలగువానిని దెలియఁజెప్పెను. గిరిశేశుఁడు తనకు బోధించిన భక్తివిధముల ధరలో వ్యాప్తమగుటకై నారదుఁడు సూత్రముల రచియించెను. వానినే నారద భక్తిసూత్రము లందురు. చివరసూత్రముగు " య ఇదం నారదప్రోక్తం శివానుశాసితం సప్రేష్టం లభతే " అనునదియే యీ యభిప్రాయమునకుఁ బరమ ప్రమాణము. మఱియు ద్వితీయాధ్యాయము 105 వ సంఖ్యగల వచనమున యోగ సంప్రదాయము వివరింపఁ బడినది.

షష్ఠాశ్వాసమున బాలభక్తుల ముగ్వుర చరిత్రలు కలవు. ప్రహ్లాద ధ్రువ, మార్కండేయులు. ఈ షష్ఠాశ్వాసము మాత్రము విడిగా ముద్రించిన కళాశాలా విద్యార్థులకుఁ బఠనీయ గ్రంథముగా నుండఁదగు నని నా యభిప్రాయము. 280 పద్యములు మాత్రమే కలవు. శైలి సరళము, ద్రాక్షాపాక మగుటచే సులభగ్రాహ్యము. ఆ యా సంద ర్భానుసారముగ రసములు చక్కఁగఁ బొందింపఁబడినవి. దిక్ప్రదర్శనముగ నుదహరించెదను.

కరుణరసమునకు

సీ॥ నిడుదపెన్నుఁజడవేణి ♦ ముడి వీడి వ్రేలాడ
జడగట్టుచున్న కే ♦ శములదాని

ద్వితీయ— 146 పద్యము

శా॥ ఓనాథా । రసికాగ్రగణ్య ... ... ద్వితీ – 110 ప. చూ.

ఉ॥ నీదు మనోహరాకృతిని ... ... ద్వితీ – 112 ప. చూ.

శృంగారరసమునకు

సీ॥ చారు చందన వన ♦ స్థలములలో ... ద్వితీ - 78 ప- చూ.

గంగాప్రవాహ వర్ణనము

చ॥ అటఁజని కాంచెనారదుఁ డనంత ... తృతీ - 113 ప- చూ.

తపోవన వర్ణనము

చ॥ కనులను గాంచెనారదుఁడు. గండక భల్లుక ... తృతీ-111ప-చూ.

నవవిధ భక్తులు

క॥ స్మరణము కీర్తన శ్రవణము ... ... షష్ఠ - 54 ప- చూ.

దుర్గా స్తవము

శా॥ శ్రీ సంధానములై మహామహిమచే ... షష్ఠ - 192 ప- చూ.

అంత్యానుప్రాస

ఉ॥ బాలక ! భక్తిమార్గపరి ♦ పాలక ... తృతీ - 96 ప- చూ.

ఉ॥ ధాతవు సర్వనిర్ణయ వి ♦ ధాతవు ... ప్రథ - 92 ప- చూ.

ఈవిధముగ శైలి యంతయు ధారాశుద్ధి వహమై యలరారు చున్నది. కొన్నిఘట్టములయందు స్తోత్ర సందర్భములలో,

సీ॥ మార్తండకోటిస ♦ మప్రభాభాసిత ... ద్వితీ - 188 ప- చూ.

సీ॥ దేవ నీవేకాక ♦ తిన్వెలుచును భవ ... షష్ఠ - 139 -ప, చూ.

మొదలగు పద్యములు చదివినప్పుడు పోతన్నగారి భాగవతము లోని ఘట్టములు జ్ఞప్తికి వచ్చును. శ్రీరామోపాసకుఁడై కృతికన్యను రామార్పణ మొనర్చిన యీకవి శ్రీరామపాద సేవాధురంధరుఁడై సహజపాండితీ మండితుండగు బమ్మెర పోతరాజుగారి మూర్తిని రచనను లక్ష్యమం దిడుకొనుట చాల సహజమే.

చివర కొకమాట. కవి యీ కావ్యమును మార్కండేయోపాఖ్యానముతో ముగించుచు

గీ॥ తరణి చంద్రాదు లున్నంతవరకు ... ... షష్ఠ - 271 ప- చూ.

క॥ తల్లులు ధాత్రి న్దమతమ ... ... షష్ఠ - 272 ప- చూ.

అను పద్యములను వ్రాయుటవలన నీకావ్యముగూడ మార్కండేయుని వలెనే శ్రీరామానుగ్రహమువలన నాచంద్రతారార్కముగ నుండఁగలదను భావము స్ఫురింపుచున్నది.

ఇట్టి భక్తి రసపూరితమైన కావ్యరచన మొనర్చి లోకులకు పరమార్థఫలము నందిచ్చిన కవియైన శ్రీ కేతవరపు రామకృష్ణ శాస్త్రిగారు శ్రీనివాసుని యనుగ్రహమునకుఁ బాత్రులై యాయురారోగ్యైశ్వర్యాదులు కలిగి విలసిల్లుచు నితోఽధికముగ నిట్టి భక్తికావ్యములను నిర్మించి తాము కృతార్థులై జనులను గృతార్థులనుగా నొనర్తురని నానమ్మకము.

ఆశీస్సు

ఆర్యావృత్తము – శ్రీమత్త్రిలింగవిద్యా,పీఠకృపాదత్తపత్రికాశుభదా
శ్రీరామకృష్ణసుధయే నిధయే జ్ఞానస్య గానవైఖర్యాః॥

క॥ సంగీతము సాహిత్యం, బంగీకృతగతినె సంగి ♦ యలరుట నిన్నున్
సంగీత సాహితీనిధి, వింగానగు రామకృష్ణ! ♦ పృథ్విన్ బలుకన్.

ధ్రువకోకిల॥ సరసిజాత దళాక్షపాద ల♦ సద్విశేష సుభక్తియుక్
సరసులెన్నఁగనైన పాండితిఁ ♦ జక్కనైన కవిత్వముక్
కరమొసంగెడి గానమాధురి ♦ గల్గి శౌరిని దెల్పుటల్
హరికథా రచనావిశారదుఁ ♦ డన్న పేర్తగు నీ కిలక్.

శా॥ రామాఖ్యన్ హరిశౌరి సామ్యమును దె♦ల్పన్ కృష్ణనామంబు లీ
లా మాధుర్యము గానవైఖరియు హేలన్ గేళికా నృత్య ము
ద్దామ ప్రక్రియఁ జూపు శ్రీహరికథా ♦ ధన్యత్వముక్ జెందు నీ
కోమాన్యా! తగు రామకృష్ణ శుభ సం ♦ జ్ఞోదార భావంబిలన్.

క॥ ధన్యుఁడవు నారదీయ మ
నన్యంబుగవ్రాసి పోత ♦ నాఖ్యుని వలె స
న్మాన్యులు మెచ్చఁగ నీ కృతి
కన్యన్ రఘువరున కొసఁగి ♦ కంటివి ఖ్యాతిక్.

విజయవాడ,
27–10–1951.

కాంచనపల్లి కనకాంబ.
శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగ మహావిద్యాపీఠము.

శ్రీ దుర్గామల్లేశ్వరాభ్యామ్ నమః.

# ప్రశంస.

సంగీతసాహిత్య కళానిధి,

## శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు

వీరినిరమారమినాలుగుసంవత్సరములనుండియు నేనెఱుంగుదును. వీరు విద్వత్కవి గురువరేణ్యులు. వీరు రచియించిన కొన్ని గ్రంథములు నేను చూచినాను. అన్నింటిలోను శ్రీ భక్తనారదీయము మిక్కిలి రసవత్తరమగు గ్రంథము. ఇది నే నామూలాగ్రము చదివి రసమనుభవించి యెంతయును సమ్మోదము నొందినాను. నారదుఁడు మహామహుండును మహాత్ముండును నగు గురుశిరోమణి. ఇంతటి గురుశిరోమణి "నభూతో నభవిష్యతి" అనుటలో సంశయ మించుకయు నుండదు. ఛందస్సులోని మచ్చరీతిని వీనియందును "కలహాకారుఁడను" నొక మచ్చ నాపాదనమును జేసియున్నది లోకము. ఆ లోపమును నివారణమును జేయుటకే "శ్రీ భక్తనారదీయము" వెలువడినది యని నాయొక్క యభిప్రాయము. నారదుఁడు చేయు ప్రబోధము నిర్వాచనీయము. గర్భములోని శిశువునకు శ్రీ ప్రహ్లాదునకును, పసిబాలుఁడగు శ్రీ ధ్రువునకును నారదప్రబోధము మిక్కిలి మహోదయము కలిగించిన సంగతియును జగమంతయును దెలిసికొనిన విషయమే.

ఈ కవి గురువరుఁడు మిక్కిలి సమర్థుఁడు. వీరి రచన మిక్కిలి సామరస్యము కలది. పండితపామరుల నెల్లరను మహానందమున నోలలాడించును. సామాన్యముగాఁ బండితులయందుఁ గల యుత్తమ గుణములు వీరియందు మూర్తీభవించినవి. సరస్వతీకుచములు అగు సంగీతసాహిత్యముల రెంటియందలి చనుఁబ్రాలు సమముగాఁ ద్రావి సరస్వతీతాదాత్మ్యము నందియున్న జాణ. వీరు మిక్కిలి ప్రశంసనీయులు. ప్రతి క్షణమును వీరు వీరి సదుద్దేశములను పండిత పామరలోకమునకు అందిచ్చుటకే ప్రయత్నించుచుందురు. "ద్విపహస్తము ద్విజహస్తము ఊరకయుండదను" నట్లు వీరి చేయి యేదియో సత్కవిత్వమును వ్రాయుచునే యుండును. ఈభక్తనారదము నందు స్వభావసిద్ధముగా వ్రాయఁబడిన రచనయే యంతటను గోచ

రించుచుండును. మొత్తముమీాద ఆలోచనచేసి కల్పించి వ్రాసినపద్యమే వీరి యీా గ్రంథమునందుఁ గానరాదు. వెదచల్లిన రసములు కరుణము అద్భుతమును. వీరు వ్రాసిన దీనియందలి పద్యములు నిరూపించి చూపుటకు నన్నియును నించుమించు నొకేవిధముగా రసమును విస్ఫురింపఁ జేయుచున్నయవియేయై యున్నయవి. కావున ఈవిషయము తెలిసికొనుటకై పాఠకలోకమునే కోరుచుంటిని.

సాధారణముగా నామములనుబట్టియే స్వాభావిక ముండుననుట సమంజసము. శ్రీరామకృష్ణ నామము మిక్కిలి ప్రశంసనీయము. లీలలును మాయలును గుర్తెఱుంగుటయందు వన్నెగాంచినది. వీరారితేఱిన గురువరేణ్యులు గనుకనే ప్రపంచమునకుఁ దెల్లమగు రీతిని మిక్కిలి రసవంతముగాఁ బ్రబోధించియున్నారు. ఇది చూచి వీరిని లోకము గౌరవించుటకు మిక్కిలి ప్రార్థించు చున్నాను.

ఈ గ్రంథమును శ్రీ శ్రీ వేంకట్రామ అండ్ కో వారు ముద్రించి "తమ విశ్వవిద్యాప్రదాత, విశ్వమహాదాత" మొదలగు బిరుదములను సార్థకపరచుకొనిరి.

సీ॥ సంగీత సాహిత్య సత్కథానిధియంచుఁ
బ్రఖ్యాతి నెంతయుఁ బడసియుంట
పసిబాలురకుఁ బెద్దవారల కనువుగా
బోధించుఁ గురుతను బొందియుంట
సర్వజనానంద సత్కవితాధిక్య
బుధు లను విఖ్యాతిఁ బూనియుంట
ప్రభులకుఁ బ్రజలకు బరితోషమొనరించు
రచనలు బొనరించి ప్రబలియుంట

గీ॥ శ్రీశ కేతవరపు రామకృష్ణశాస్త్రి
సద్గురుఁడు తారకంబయి జగమునందుఁ
బేరుగాంచుత సత్కవి ధీరుఁడనుచు
సర్వసంపదల్ వీనిని సాకుఁ గాక.

విజయవాడ
6-11-1951

విద్వాన్, శతావధాని;
భమిడిపాటి అయ్యప్ప శాస్త్రి.

# పండితాభిప్రాయములు

జగద్విఖ్యాత యశులు, ఆంధ్రులకు చిరపరిచితులు, కింకవీంద్ర ఘటాపంచాననాది బిరుదాంకితులు కీర్తిశేషులైన
శతావధాని చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, దయతో వ్రాసి యొసంగినది.

శ్రీమత్పరదేవతాయై నమః

## భక్తనారదీయము

దీనిని శ్రీ కేతవరపు రామకృష్ణశాస్త్రిగారు సంస్కృతములో నున్న నారద చరిత్రమునకును, నారద భక్తిసూత్రములకును దెలుఁగుగా రచియించిరి. ధారా ధారాళమైన శైలిలో శ్రోత్రపేయముగ హృద్యముగా ననవద్యముగా నడచినది.

అనువాదమైనను స్వతంత్రరచనవలె నుండుటయేగాక సర్వ సులభమగు కదళీపాకముగను ద్రాక్షాపాకముగను నడచినది.

ఈయనది పండిత వంశము, తండ్రి తాతలే కాదు, సోదరులు కూడ నెల్లరును పండితులు. ఆ యీ రచన సర్వదా శ్లాఘ్యమై యున్నది. గ్రంథకర్త ముఖతః నేను దీనిని విని పరమానంద భరితుఁడ నైతిని. భక్తజనుల కుపయోగించు నిట్టి యుత్కృష్ట గ్రంథమును రచియించినయీగ్రంథకర్తకు శ్రీమహావిష్ణువుసర్వశ్రేయములొసంగుఁగాక.

విజయవాడ,
18–11–46.

శతావధాని వేంకటశాస్త్రి,
క్షీరసాగర.

---

సంగీత సాహిత్య, వేదాంత, భాష్య, భావనాపరాయణ, వాగ్గేయకార రత్న
బ్రహ్మశ్రీ హరి నాగభూషణముగారు
కరుణతో నొసంగిన

## ఆశీస్సు

శ్లో॥ శ్రీవత్స లక్ష్మాంకిత చారువక్షః ।
సీతాంగ నాధిష్ఠిత వామభాగః ।
చిన్ముద్రయాభాత కరాంగుళీయః ।
త్వాం రామకృష్ణం పరిపాలయే చ్చిరమ్ ॥

తే॥ గీ॥ కేతవరపు వంశాంబుధి ♦ శీతభాను !
రామకృష్ణాఖ్య ! నిర్మల ♦ రామభక్తి
పూరితాత్మత వ్రాసి త ♦ పూర్వ మద్ది
భక్తనారద చరితంబు ♦ పావనంబు.

తే॥ గీ॥ సంస్కృతాంధ్రాది సాహితీ ♦ శస్త్రమతివి
గీతవాదిత్రగాన ని ♦ ష్ణాతుఁడగుదు
గద్య పద్యాది కవితాన ♦ వద్యకావ్య
రచయితవు రామకృష్ణాఖ్య ! ♦ రమ్యచరిత !

ఉ॥ నీ జనకుండు పండితుఁ డ♦ నీచుఁడు లక్ష్మీనృసింహశాస్త్రి, య
వ్యాజ మనస్వి భూసురకు♦లాగ్రణి మాని వరిష్ఠ కల్పుఁ డా
భూజనమాన్య గర్భమునఁ ♦ బుట్టి తదర్హ చరిత్రఁ జూచు నీ
యోజ నదభ్ర సత్కృతి న♦నూన పరిష్కృతిఁ బొందితీ ! కృతీ !

ఉ॥ చిన్నతనంపు నా సఖులు ♦ చేబ్రోలు పాపయగాయ నోత్తముం
డన్నలినార్భ కాన్వయుని ♦ యన్నగు వేంకటరత్న పండితుం
డన్నరసింహులుం దవర ♦ జాంశుపదంబులువట్టి గాన మం
దెన్నికఁ గన్న శిష్యవరుఁ ♦ డీవు సుసత్కృతిఁ బొందు టర్హమా.

తే॥ గీ॥ కోహినూరన్న నవల నీ ♦ సాహితీప్ర
మేయశ్శైలిచే మాతృక ♦ న్నిర్మించి వెలుఁగు
పార్వతీపరిణయ ముఖ ♦ పద్యగద్య
గేయకృతులు నీ ఖ్యాతిచిర ♦ స్థాయి సేయు.

తే॥ గీ॥ రామకృష్ణాఖ్య నీకౌట ♦ రామపగము
సేసినాఁడవు కబ్బంబు ♦ చిత్తమలరఁ
గృతినొసంగుచుఁ గృష్ణ భ♦క్తి ప్రధాన
మైన నారద చరితంబు ♦ యశము గనుము.

తే॥ గీ॥ నారదీయంబు చదివి యు♦న్నాఁడ దోష
లక్ష్మినై యేను స్థాలీపు♦లాకమునను
గాని దోషంబు లెందును ♦ గానరావు
పూర్వకవు లేగు తెర్వులఁ ♦ బోవుకతన.

తే॥ గీ॥ యతులు ప్రాసలు సుగమంబు • లై తనర్చఁ
జేతముప్పొంగఁ జేయు సం•గీతి పోల్కి
ధారయున్ శైలి సహజో క్త్యు•దారవృత్తి
రీతులంబొంది యో రామకృష్ణ • సుకవి!

తే॥ గీ॥ గానకవితాది సంస్కృతుల్ • గడిఁదివెలుఁగ
హరికథలు వ్రాసి కబ్బంబు • లరిది వ్రాసి
యశము ధనమును బిరుదంబు • లందికొనుచు
జయముఁ గాంచెదు రామకృ•ష్ణా ! సుశీల !.

చ॥ వయసునఁ బాండితీగరిమ • భావమున న్గురువు లున్నధార్మికుల్
స్వయముగ దైవమంచుఁ దల•వంచి నమస్కృతి పూర్వనమ్రతా
నియతిఁ జరించి దీవనలు • నిస్తులమున్ గ్రహియించి రామకృ
ష్ణ ! యశము స్వాయురున్నతులు•శాశ్వతకీర్తి గడించుమా భువిన్.

ఆ॥ వె॥ రామభక్తి గదుర • వ్రాసితి వీకావ్య
మరరె ! యంచు సూరి•వరులు పొగడ
దాన రాముఁ డెపుడ•నూన వాత్సల్యంబు
తో నొసంగు నీ క•తుల యశంబు.

తే॥ గీ॥ భక్తనారదీయాఖ్య ప్ర•బంధ మద్ది
పండితాఢ్యులు గూడ శ•భాష్ణలులను
జదివి మెప్పొందువాఁడ వా • చంద్రతార
మై వెలయుఁగాత మభిలషి•తార్థగతుల.

తే॥ గీ॥ రామకృష్ణులు తత్ప్రతి • నామధేయు
వౌట గిరిజామహేశు ల•త్యంత భక్తి
భావ్యులౌట నీ కిత్తురు • భాగ్యభోగ
సంపదల్ ప్రియ మధికంబు • శతముమించి.

ఓమ్ తత్సత్. సన్మంగళాని భవంతు

ఇట్లు, వయోవృద్ధ
హరినాగభూషణము.

బ్రహ్మశ్రీ వేదమూర్తులైన నాదెళ్ల మేధా దక్షిణామూర్తిశాస్త్రిగారు
పంపిన పద్యత్రియము

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# ఆశీస్సు

మ॥ అదనా? కాదిది. యాగమోక్తవిధిఁ జే • యన్ గర్మ సంతాన మొ
ప్పదు. వైరాగ్యము జ్ఞానమబ్బమిఁ దరిం • పందోఁప మున్నల్ల నా
రద సూత్రోదిత భక్తిదర్శన చరి • త్రజ్ఞానమున్ గూర్పఁ గీ
ర్తిద మాంధ్రంబు, శివానుశాసన, మొన • ర్చెన్ రామకృష్ణుం డిలన్

చ॥ అవిరళకీర్తి మద్గురుని • యాశ్రిత వర్గమునందుఁజేరు కే
తవరపు వంశదీపకుఁ డి • తండు రచించిన నారదీయముల్
జవిగొని మోదమంది చ్యుత • సంస్కృతి ముఖ్య మడంప సర్వమున్
జెవినిడి పోత నార్యునకుఁ • జేరిక తీరిక లెత్తఁ గాంచితిన్.

ఉ॥ ఏ మిహిరాన్వయోద్భవుని • యేలుబడి న్జగ మల్లసిల్లె, నే
తామరసాక్షు పాదమున • ధన్యతఁగాంచె నహల్య, యట్టి పృ
థ్వీ మహిళాత్మజాపతి వి • భీషణునిన్ హనుమంతుఁ బ్రోచు శ్రీ
రాముఁడు నారదీయకృతి • రంజిల నేలుత సుస్థిరంబుగన్.

బందరు,
20–12–46.

ఇట్లు,
నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రి.

---

మచిలీపట్టణంహిందూకాలేజీ హైస్కూలుసహోపాధ్యాయులును తెలుఁగుపండితులు నగు
బ్ర. శ్రీ. అద్దేపల్లి లక్ష్మణస్వామిగారు వ్రాసిపంపినవి.

శా॥ అబ్రాహ్మణ్యము హెచ్చి, భవ్యకవితా • వ్యాసక్తి క్షీణించి, యే
దో బ్రద్మల్లడుపంగ నేరిచిన యీ • దుర్భాగ్యుల న్సత్కవి
త్వా బాశిన్ స్నపనించి నారద రహ • స్యంబుల్ ప్రసాదించినా
రబ్రింబౌనటు రామకృష్ణ కవి చం • ద్రా! మీకివే మన్నతుల్.

శా॥ ఓయయ్యా! భవదీయ సత్కృతికి నే • యూరో, మరేమాన్యమో,
వేయున్నాట పదాబులో, యధమ మ • ర్పింపంగ నౌ; కాని నా
యీయుద్యోగము మీదియొక్కటియె సు • మ్మీ, దానఁబద్ధంబులన్
న్యాయుత్సాహము వెల్లడింతు బహుళ • జ్ఞా! స్వీకరింపంగ దే!

బందరు.
ది, 22–12–46.

అద్దేపల్లి లక్ష్మణస్వామి
హైందవోన్నత పాఠశాల.

ఓమ్ నమః పరమాత్మనే

రసజ్ఞులును కోవిదులు నగు పాఠకుల కొక

# మ న వి

శ్లో॥ శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం,
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి.

శ్లో॥ నవజలధరవర్ణం - చంపకోద్భాసికర్ణం
వికసిత నళినాస్యం - విస్ఫుర న్మందహాస్యం
కనకరుచిదుకూలం - చారుబర్హావచూడం
కమపి నిఖిలసారం - నౌమి గోపీకుమారం.

---

శ్లో॥ గద్యానుబంధ రస మిశ్రిత పద్యసూక్తిః
హృద్యా హి వాద్యకలయా కలి తేవ గీతిః.

అని చంపూ రామాయణ గ్రంథకర్త వ్రాసి యున్నాఁడు. ఇట్లనుటలో సందేహము లేదు. యోజించినకొలఁది గీతవాద్య ప్రసారిత మైన గానమునకును గద్య పద్యాత్మికమైన కావ్యమునకును జాల సన్నిహిత సంబంధ బాంధవ్యములను నిర్మించి యుపమానోపమేయ భావ ములచే నా రెండింటి నొక్క శ్లోకమున గూర్చినందుకు పూర్వకవుల సంపూర్ణరసానుభూతియు సంగీతసాహిత్యములయందు వారికిఁగల సమాన భావమును దేటపడుటయేకాదు. హృదయంగమముకూడ నైనది తత్కారణముననే నాటక నవలా యక్షగా నాది గ్రంథరచన మెంత యొనర్చినను సంతృప్తి కలుగమిఁ జంపూ ప్రబంధ నిర్మాణ సంకల్ప మంకురించినది.

ఒకప్రక్క నభ్యుదయరచనా మహావాతావరణము దేశమునఁ బ్రకోపించి పెక్కుమంది రచయితలను గ్రంథవిక్రేతలను దూదిపింజలను

గావించి యభ్రవిహారముఁ జేయించినది. చేయించుచున్నది. ఈ ఝంఝామారుత విజృంభణములో రచనావిధాన మెట్లుండవలయు నన్న శంక హృదయమందు యథేచ్ఛాసంచారముఁ జేయఁదొడంగినది. భావకవులంతా నవీనరచనా రత్నములతో గ్రంథపతకములఁ దయారొనర్చి కవితా వనితాకంఠసీమ నలంకృతమొనర్చి నవ్యసాహిత్య ప్రియులనానందింపఁజేసి వారి సంపూర్ణ సానుభూతిని సముపార్జన మొనర్చుచున్న యీ దినములలో గ్రాంథికభాషకు అనఁగాఁ బ్రాచీనాంధ్ర సాహిత్యమునకుఁ బ్రసక్తి చాలవఱకంతరించినది. వ్యావహారిక భాషలోఁ గావ్యమును సృష్టించుట మదభీష్టమునకు వ్యతిరేకము. కేవల మసంగతము. అందువలనఁ గొన్ని దినములు యోజించి "కుడుచుటయునుకాదు, కుడువకుండుటకాదు, సలిలభక్షణంబు సమ్మతంబు" అనునట్లు పాఠకలోకమునకు సులభముగా గ్రాహ్యము కాఁదగిన భాషాసౌలభ్యముతోఁ గావ్యసౌధ నిర్మాణమునకుఁ బునాదిని నిర్మించితిని.

ఇందలి యితివృత్తము నారదుని చరిత్రము. ఇంతకు ముందు కృతికర్తయైన శ్రీరామచంద్ర సంకల్పానుసారముగ నాచే సమకూర్పఁబడిన "ప్రేమ భక్తి దర్శనమే" (సుధాలహరి యను పేరుగల నారద కృతభక్తి సూత్రముల కాంధ్రవ్యాఖ్యానము) ఈ కావ్యరచనకు మూల కారణము. సూత్రకారుఁడగు నారద దేవర్షి యొక్క దివ్యచరిత్రము తెలుఁగునఁ గావ్యరూపమున నాంధ్రలోకమున కర్పింపవలయునన్న యుత్సాహమే నా యీ గ్రంథరచనకుఁ బ్రేరకమైనది. ఇందలి పంచమాశ్వాస పర్యంతము కల కథయంతయును, బ్రహ్మవైవర్త పురాణాంతర్గతము. సమయానుగుణ్యముగఁ సంగ్రహింపఁబడినది. షష్ఠాశ్వాసములోని కథలు జగత్కల్యాణ కాంక్షియై నారదమునీంద్రుఁడొనర్చిన కార్యక్రమమునకును బరమ శివానుశాసనమగు భక్తి తత్త్వవ్యాప్తికిని దిఙ్మాత్రసూచకములు. శారదావతారమైన కాళిదాసకవి యంతవాఁడు "ప్రాంశులభ్యే ఫలే లోభా దుబ్బాహురివ వామనః । తితీర్షు

రు స్సరం మోహా దుఃఖ పేనాౙ్స్మిసాగరం" అని వ్రాయఁగా శ్రీమన్నారాయణాంశావతారమూర్తియైన, భక్తిమార్గ ప్రథమాచార్యుఁడైన నారద మహాముని చరిత్రను గావ్యముగ లిఖించుటకు నసుఁబోలిన యల్పజ్ఞానికి శక్తికి మించిన కార్యమని నేనెఱుంగక పోలేదు. అయినను శ్రీరామచంద్రుని సంకల్ప ముత్సాహరూపముగ నాలోఁ బ్రవేశించి ముందు నకుఁ ద్రోయుచుండ నేను వెనుకకడుగిడఁజాలక పోతిని. శ్రీరామకరుణయే దీనిం బూర్తిచేయించినది. స్వర్ణాభరణ మందమునఁ బనివాని యసమర్థత కారణముగాఁ గొంతవడినను బంగారమగుట విలువయందుఁ దీసిపోనిరీతి భగవద్భక్తుని చరిత్రము, భగవన్మహిమనుగూర్చి వ్రాయఁబడిన యీ గ్రంథము నావంటి ప్రాథమికుని మూలమున రచనాకౌశలమున వెనుకఁ బడినను మీకందరికిని బ్రీతిపాత్రమై శ్రీరామానుగ్రహపాత్ర మగు ననియే నానమ్మకము.

కావ్యము సమాప్తమై వర్షపంచకమైనను దైవ సంకల్పము దూరమగుటయే గ్రంథ ముద్రణమున కింత కాలవిలంబన మగుటకుఁ గారణము. ఇందు 88 వ పేజీవఱకును గల భాగమును కృతి సమర్పణ కాలమున సుహృద్వరు లొసంగిన ధన సహాయమున ముద్రింపఁజేయఁ గలిగితిని. తదుపరి కార్యక్రమమున కాధారభూతు లదృశ్యులగుటచేఁ గొంతకాలము నిరీక్షించవలసి వచ్చినది. ఒకనాడు హేలాపురి (ఏలూరు) వాస్తవ్యులును భాషా పోషకులును వేంకటరామ పవరు ముద్రణాలయ సర్వాధికారులగు మ. రా. రా. శ్రీ ఈదర వేంకటరావు పంతులుగారిని దర్శించి జరిగిన విషయమును విన్నవింప శ్రీ వారు వెంటనే తక్కిన భాగమంతయు నచ్చువేయించి యిత్తుమని వాగ్దానమును జేసిరి. వెంటనే విజయవాడలోని తమ ప్రధాన కార్యాలయాధ్యక్షుల పేర జాబువ్రాయ వారాకార్యమును శీఘ్రకాలములోనే పూర్తిచేయించి శ్రీ రామానుగ్రహ పాత్రులైరి.

ఇవ్విధంబున గ్రంథముద్రణంబును బరిసమాప్తి నందించిన శ్రీ వేంకటరావు పంతులుగారికి నా వందనములు. కృతిసమర్పణ కాల

మున గ్రంథముద్రణకై యథాశక్తి ధన సహాయ మొనర్చిన నా మిత్ర మండలి కనేక కృతజ్ఞతాపూర్వకాశీస్సులు. నా యీ కావ్యమునకుఁ దొలిపలుకు వ్రాసియిచ్చిన "కవిసమ్రాట్ బ్రహ్మశ్రీ. విశ్వనాథ సత్యనారాయణగారికిని సమీక్షను వ్రాసి యనుగ్రహించిన కవితిలక, కవితా విశారద, విద్వాన్, కాంచనపల్లి కనకాంబగారికిని, తమ సదభిప్రాయములను బ్రసాదించిన పండిత కవిరత్నములకును నా హృదయ పూర్వకాభివందనములు.

గ్రంథాంతమం దీయఁబడిన సవరణ పత్రమునందుఁ జాలవఱకు తప్పులనేరి యుదహరించితిమి. ఇంకను మిగిలియుండినచో వానిని ద్వితీయ ముద్రణమున సవరించుకొనఁ గలను. అట్టి భాగ్యము మీ యందరి యను గ్రహమువలనఁగదా లభింప వలయును.

ఈకావ్యము గోలోక వృత్తాంతముతోఁ బ్రారంభమై మార్కండేయ చరిత్రతోఁ బూర్తిచేయఁబడి యుండుటఁజేసి శైవ, వైష్ణవ భేద రహితమని పాఠకులు గ్రహింపఁగలరు. తత్కారణమున నియ్యది సర్వ జనాదరణీయ మగుట నిర్వివాదాంశము. కావున రసజ్ఞులై పాఠకు లందరు దీనిని శ్రద్ధతోఁ బఠించి నీరక్షీర విభాగ చాతురీ ధురీణతగల పరమహంసలవలె గుణగ్రహణ మొనర్చి దోషములను నా కెఱింగించిన వానిని సవరించుకొందునని ప్రార్థించుచుంటిని.

విజయవాడ,
గవర్నరుపేట.

ఇట్లు భక్తబుధజన విధేయుఁడు,
కేతవరపు రామకృష్ణశాస్త్రి.

కృతిసమర్పణ కాలమున ముద్రణ కార్యమునకై
ధనమునిచ్చిన యుదారులు

| | రు. అ. పై |
| --- | --- |
| శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు, విజయవాడ | 25-0-0 |
| మ రా శ్రీ ఆదూరి చలపతిరావుగారు, మచిలీపట్నం | 25-0-0 |
| బ్రహ్మశ్రీ కోట వేంకటాచలంగారు, విజయవాడ | 25-0-0 |
| శ్రీయుత కురుకూరి స్వరాజ్యంగారు, విజయవాడ | 25-0-0 |
| బ్రహ్మశ్రీ డాక్టరు పి. వి. యాజులుగారు, విజయవాడ | 10-0-0 |
| మ రా శ్రీ చిట్టూరి నరసింహంగారు, మచిలీపట్నం | 15-0-0 |
| మ రా శ్రీ మోటమర్రి లక్ష్మీనారాయణగారు, మచిలీపట్నం | 15-0-0 |
| బ్రహ్మశ్రీ పిల్లుట్ల భావనారాయణగారు, తెనాలి | 25-0-0 |
| బ్రహ్మశ్రీ జంధ్యాల కృష్ణమూర్తిగారు, మచిలీపట్నం | 15-0-0 |
| | 180-0-0 |

మిగిలిన ద్రవ్యమంతయు నాంధ్రభాషాపోషకు లనఁదగు మ. రా. శ్రీ. ఈదర వేంకటరావు పంతులుగారు దయతో గ్రంథ ముద్రణమును బూర్తిజేయించి యిచ్చుట మూలముగా సమకూడినది.

ఇట్లు విధేయుఁడు,

గ్రంథకర్త.

భాషాపోషకులైన, శ్రీయుత ఈదర వేంకటరావుగారికి; కృతికర్త యొక్క

# ఆశీస్సులు.

సీ॥ ఆంధ్రదేశీయుల ♦ నాంధ్రసారస్వతో
పాసన న్గడు తృప్తి ♦ పరచె నెవరు?
కవులను బండితా♦గ్రణుల నాహ్వానించి
యెన్నియో కృతుల వ్రా♦యించె నెవరు!
జన్మప్రభృతి సాధు ♦ సాంగత్యమహిమచే
నతిభక్తి తత్పరుం ♦ డయ్యె నెవరు?
ఆశ్రితజనపంక్తి ♦ కాధారభూతుఁడై
పెక్కు వృత్తులను గ♦ల్పించె నెవరు?

ఆ॥ వె॥ అర్థిజనులఁ గరుణ ♦ నరయునే పుణ్యుఁ? డా
ఈదరాన్వవాయ ♦ హిమకిరణుని
విమలు నమలయశుని ♦ వేంకటరాయార్యు
భువినిఁ గాచు రామ ♦ భూవిభుండు.

ఉ॥ పంకజనేత్రుఁ డార్తజన ♦ బంధువు దానవవైరి శేషప
ర్యంకమున న్పరుండి భువ♦నావలి సాకెడి దేవదేవుఁ డా
వేంకటశైలనాథుఁ డతి ♦ ప్రీతినొసంగి చిరాయు రున్నతుల్
వేంకటరాయవర్యున క♦భీష్టశుభప్రదుఁడై చెలంగుతన్.

ఉ॥ రాజులులేరు నేఁడు కవి♦రాజ వినిర్మిత కావ్యకన్యకా
రాజినిగాంచి మెచ్చి ధన♦రాసులొసంగఁగ వేంకటార్య! యో
రాజితకీర్తిసాంద్ర! కవి♦రాట్పరిపాలకుఁ డన్న పేరు నీ
కే జగతిన్లభించె నిది ♦ యెంతటిపుణ్యతపఃఫలంబొకో!

క॥ నారదముని సుచరిత్రము
గారవమున ముద్రణంబుఁ ♦ గావించిన మి
మ్మా రామవిభుఁడు రఘుకుల
వీరుఁడు కృపఁజూచు నెపుడు ♦ వేంకటరాయా!

సీ॥ విమలుఁ డాత్మజుఁడైన ♦ వేంకట రామయ్య
యుండగా మీ వెన్క ♦ నమరియుండ
ఉద్యోగి బృందంబు ♦ లుత్సాహమున మీ రో
సంగెడి యాజ్ఞల ♦ సల్పుచుండ
అభినవ చాణక్యుఁ ♦ డనఁదగు పాలుట్ల
ఫాలాంకయాఖ్యుండు ♦ ప్రక్కనుండ
అఖిల పండితు లుపా♦ధ్యాయులు కవులు మీ
భాషాభిమానమున్ ♦ వ్యాప్తిఁజేయ

తే॥ గీ॥ సకల భాగ్యంబులను రామ♦చంద్రుఁ డొసఁగ
స్వాయువును నిధి యారోగ్య ♦ మర్కుఁడీయ
శంభుఁ డైశ్వర్యమీయఁగ ♦ సంతసమున
వెలయుమా! పురి నీదర ♦ వేంకటార్య!

—♦ కృతిపతికొక విజ్ఞాపనము ♦—

గీ॥ శ్రీధరాత్మజా మానస ♦ శీతకిరణ!
రఘుకులాంబుధిచంద్ర! వి♦రాధభంగ!
సకలదానవ దుష్టశా♦సన విభంగ!
పరమపావన! వినుము నా ♦ ప్రార్థనమును.

ఉ॥ ఆర్తుఁడనై భవత్పదము ♦ లంటి వచించుచునుంటి దేవ! నీ
కీర్తిని బాడుచుంటిఁ దమ♦కించుచునుంటి భవత్కృపాప్తికై
కీర్తన వ్రాయుచుంటి నిను ♦ గేయసుమంబులఁ బూజసేయ, నో
యార్తజనావనా! రఘుకు♦లాన్వయ భూషణ! లోకపావనా!

ఉ॥ ఏమనువాఁడనో? యినకు♦లేశ్వర! నాదగు మానసంబు నో
హో మహనీయ! నీదు పద♦యుగ్మముపై నిడనెంచి యత్నమే
మేమొయొనర్చినన్ హృదయ ♦ మెంతయుఁ జంచలమాటయత్నమో
రామ! ఫలింపలే దిఁక స్థి♦రత్వమొసంగి యనుగ్రహింపవే!

ఉ॥ చేత మచంచలంబుగను ♦ జేయఁదలంచితిఁగాని దేవ ! నా
చేతలు నిష్ఫలంబగుటఁ ♦ జెప్పెదునేమని నీయనుగ్రహం
బూతఁగనుంచి శ్రీరఘుకు ♦ లోత్తమ ! నాదగుమానసంబనే
కోతిని నీదుభక్తియను ♦ గూటను గట్టవె జానకీపతీ !.

ఉ॥ ఈయఁగఁ జాల భోగముల ♦ నీయఁగఁ జాలను రత్నభూష లం
దీయఁగఁజాల నో యినకు ♦ లేశ్వర ! నీకు ధనోపచారముల్
తీయని ముద్దుపల్కుల గు♦దించుచుఁ బద్దెములల్లి రామ ! నీ
కీయఁగఁజాలనా యని యొ♦కింతతలంపు ఘటిల్లె రాఘవా !.

చ॥ ధరణిసుతామనోహర ! సు♦ధామయ దివ్యశరీర ! పాపసం
హార ! ఖరదూషణాది దను ♦ జాన్వయ ఘోరమదాపహార ! శ్రీ
ధర ! నవరత్నహార ! వర ♦ తాపసలోక మనోవిహార ! నీ
కరుణకుఁ బాత్రమై వెలయఁ ♦ గాఁ గనుమయ్య మదీయమాకృతిన్.

ఉ॥ రామ ! గుణాభిరామ ! సుర ♦ రాజవిరోధివిరామ ! భండనో
ద్దామ ! పవిత్రనామ ! గుణ ♦ ధామ ! శుభాస్పద ! నీలవారిద
శ్యామ ! విదేహరాజతన ♦ యాహృదయాంబుజ దివ్యధామ ! శ్రీ
రామ ! మదీయకావ్యముఁ గ♦రంబు కృపన్గొనవేఁడెదన్ ప్రభూ !

సీ॥ లోకమీయఁగఁ గుబే♦రుఁడఁగాను నీతత్త్వ
మెఱుఁగఁ గౌశికముని ♦ శ్వరుఁడఁగాను
నీదివ్యమాహాత్మ్య ♦ మోదశరథపుత్ర !
వర్ణింపఁ గుంభ సం♦భవుఁడఁగాను,
నీ దాస్య మొనరించి ♦ నీ నామము న్బాడ
ధన్యుఁడౌ వాయునం♦దనుఁడఁ గాను
నీ కావ్యమున్వ్రాసి ♦ నిత్యకీర్తిఁ గడింప
వరముని వల్మీక ♦ భవుఁడఁ గాను

గీ॥ సైన్యమీయఁగఁ గపి కులే♦శ్వరుఁడఁ గాను
అనుచు నినుఁగూర్చి త్యాగరా♦జాదిభక్తు
లే పలుకుచుండ రామ! నే♦నెంతవాఁడఁ?
బరమగోప్యమౌ నీదు త♦త్త్వంబుఁ దెలియ.

సీ॥ తన తనూజను నీదు ♦ ధర్మపత్నిగఁ జేసి
యంబురాశి కృతార్థుఁ♦డయ్యె మున్ను
జనకుఁడు సీత నీ ♦ సహధర్మచారిణి
యనుచు నీకిచ్చి ధ♦న్యాత్ముఁడయ్యె
తన కుమారిని రుక్మి♦ణిని భీష్మకుఁడు నీకు
జాయగా నొనరించి ♦ సఫలుఁడయ్యె
ప్రేమ భక్తిస్వరూ♦పిణి యైన సుతను స
త్రాజిత్తు నీకిచ్చి ♦ దాతయయ్యె
గీ॥ వారు బిడ్డల నీకర ♦ పద్మములకు
నప్పగించిరి కాని నా♦కట్టి శక్తి
లేమి నీ కావ్యకన్యక ♦ నో మహాత్మ!
నీ పదములపై నుంచితి ♦ నీరజాక్ష!
ఆస్థతో గ్రహింపఁగదె! క♦ల్యాణరామ!

ఇట్లు, భవదీయ భృత్యానుభృత్య పాదరేణువు
గురుభక్తజన సేవాపరాయణుఁడు,
కృతికర్త.





హరికథారచనా పితామహ, హరికథా సుధాకర,
సంగీతసాహిత్యకళానిధి, [illegible],

కేతవరపు రామకృష్ణశాస్త్రి.

# విషయసూచిక

పేజీ.

## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## తృ తీ యా శ్వా స ము



## చ తు ర్థా శ్వా స ము

ఉ॥ అంబకు మ్రొక్కెదన్ త్రిజగదంబకు శంకరు దేవికిన్ నిరా
లంబకు యోగినీగణ విలాసవిహారిణికిన్ బరాంబకు
న్కంబుసమాన కంధరకు గాళికి మత్కుల దేవి స్వర్ణదు
ర్గాంబకు లోకమాతకు మహాకవితాఖ్య విధానమబ్బఁగన్॥ 6

చ॥ సిరుల నొసంగు దేవి సరసీరుహలోచనురాణి దివ్యసుం
దరి మరుఁగన్నతల్లి వరదాయిని భక్తులఁ బ్రోచుమాత యిం
దిర సురసేవితాంఘ్రియుగ నిత్యశుభప్రదయైన లక్ష్మి మా
దురితగణంబుల న్దొలఁగఁ ద్రోసి కృప న్దరిఁజేర్చి కాచుతన్॥ 7

గీ॥ వటతరు సమీపవాసియై పరమహాను
లైన సనకాదులకుఁ దనజ్ఞానముద్రఁ
జూపి సకలసందేహముల్బాపినట్టి
దక్షిణామూర్తి దేవునిఁ దలఁచికొలుతు॥ 8

గీ॥ పలుకుల వెలంది శారద పంకజాస్య
వనజభవురాణి వల్లకీపాణి వాణి
నాదు జిహ్వాగ్రమున నిల్చి నవ్యమధుర
చిత్రవాగ్ఝరిన్ బ్రవహింపఁ జేయుఁ గాత॥ 9

గీ॥ శ్రీరఘూత్తమ పదయుగ సేవకుండు
సకల కార్యార్థసిద్ధి నొసంగువాఁడు
కీశకుల దీపకుండు సుగ్రీవసఖుఁడు
వాయుతనయున కొనరింతు వందనములు॥ 10

గీ॥ ముందు వాల్మీకికిన్ వ్యాస ముఖ్యులకును
నంజలి ఘటించి కాళిదాసాదులైన
సంస్కృత కవీశ్వరులనెల్ల సన్నుతించి
వందనశతంబు లర్పింతు భక్తి వెలయ॥ 11

గీ॥ వివప వాగనుశాసను • వినుతిఁ జేసి
తిక్కయజ్వను బోతనా • ది కవివరుల
పద్యవైఖరులఁ దలంచి • ప్రస్తుతించి
యాంధ్ర కవితాపితామహు • నాత్మఁ గొలుతు॥ 12

కం॥ దోసిలియొగ్గెద గుణమును
వీసంబైనను గ్రహింప • విడుచుచు జగతిన్
దోసము లెన్నెడి కుకవుల
కే సతతము సంతసమున • నీధారుణిలోన్॥ 13

—గురువందనము—

సీ॥ శ్రీశివ పంచాక్ష • రీ రామమంత్రముల్
కరుణతో నొసఁగిన • గురువరుండు
నిగతంబు నాయందు • నిల్పి వాత్సల్యమున్
విద్దెల నేర్పిన • విమలగుణుఁడు
సద్బుధ లాస్నిహిత్య • చక్రవర్తి యనంగ
బిరుదంబు నందిన • విబుధవరుఁడు
వేదాంతశాస్త్ర ప • రీక్షుఁడై తత్త్వమున్
మననంబొనర్చిన • మాన్యతముఁడు
పరమపావనుఁడు తపస్వి • నిరతశాంత
మూర్తి కీర్తిశేషుండగు • బుధజననుతు
మజ్జనకు సిద్ధచారిత్రు • మదిఁ దలంచి
యంజలుల నిడుచుందు న • త్యంతభక్తి॥ 14

గీ॥ వసుధఁ బోలిన సహనస్వ • భావ పరమ
సాధ్వి సతతదయామయి • సచ్చరిత్రి
మాతృదేవతి వేంకమాం • బకును భక్తి
వందన శతంబులను సమ • ర్పణ మొనర్తు॥ 15

పల్లవి జ్ఞానవేత్తలై♦పరగినారు
ఋషులు చేబ్రోలు వంశాన♦బుట్టినట్టి
వరచరితులు వేంకటరత్న♦హనుమాంబ్ల
గురుల కిడుదు వందనపరం♦పరల నెపుడు॥ 13

గీ॥ కొలఁది దినములలోఁ గైతఁ ♦గూర్పఁగల్గు
శక్తి నొసఁగినయట్టి ప్ర♦జ్ఞానమేతుఁ
బరమపావను నాగేశ్వ ♦ వంశచంద్రుఁ
బూరుషోత్తమ కవివరుఁ ♦ బొగడుచుందు॥ 14

— జన్మభూమి సంస్మరణము —

సీ॥ గంగా సరస్వతుల్ ♦ కావేరి మున్నగు
పుణ్య నదుల కెల్లఁ ♦ బుట్టినిల్లు
ప్రహ్లాద నారద ♦ పరమ భక్తవరులఁ
గొమరులుగాఁ గన్న ♦ విమలచరిత
వాల్మీకి కుంభసం ♦ భవ వసిష్ఠాదులౌ
మునిచంద్రులం గన్న ♦ వినుతయశస్వి
జానకి ద్రౌపది ♦ సావిత్రి మొదలగు
సాధ్వీమణుల కెల్ల ♦ జన్మభూమి
అమిత శూరరత్నంబుల ♦ కాపుపట్టు
సకల శాస్త్రపరిజ్ఞాన ♦ సాగరంబు
దివ్య మాణిక్య సుప్రభా ♦ దీపితంబు
భారతక్షేత్ర మాతకు ♦ వందనములు॥ 15

సీ॥ గౌతమీ కృష్ణాది ♦ ఘన పుణ్యస్రోతస్వి
నులచేత నేతల్లి ♦ ఫలదయయ్యె
పాడి పంటలనిచ్చి ♦ బహు దేశవాసుల
కోగిర మేమాత ♦ యొసఁగుచుండె

వీరాధివీర క • మారుల నేయుశస్త్ర
కనులచే పేరసూ • యునఁగఁ బరఁగె
పోతన్న గోపన్న • మొదలగు భక్తిత
సత్కవీశుల కేది • జన్మభూమి
కళల నెలవయి బుధజనా • వళులకెల్లఁ
గీర్తనీయమై తులలేని • కీర్తిఁగన్న
యఖిల విద్యాపమేత ప్రి • త్యక్షమాత
అంధ్రమాతకు నాదు జో • హారులివియె॥ 21

సీ॥ భాగీరథీ తుంగ • భద్రాది పుణ్యాన
దీజలంబుల మన • తృష్ణఁదీర్చి
యాహారమునకు ధా • న్యాది వస్తువులను
సమకూర్చి మనలఁగ • నిఁకమొసఁగ్చి
తొలఁగలేని దివ్యౌష • ధుల ప్రభావంబున
వ్యాధి సంఘంబులఁ • బారఁదోలి
వక్షస్థలంబునఁ • బవ్వళింపఁగఁ జేసి
లీలాసనంబున • జోలఁబాడి
మన సుఖంబునకై సర్వ • మార్గములను
బోవుఁజేసి యుంచిన జన్మ • భూమి యన్న
ధరణిలోపల మనకన్న • తల్లికన్న
మాన్యయగుట నొనఁగెద న • మస్కృతులను. 22

వ॥ ఇవ్విధంబున నిష్టదేవతావందనంబును గురువందనంబును భారతదేశ మాతృనమస్కృతియును జన్మభూ సంస్మరణంబును గావించి యెద్దియైన నొక్క కావ్యరచనంబు నొనర్పవలయునను తలంపుతో నితివృత్తంబునకై యోజించుచుండ మద్బాల్యమిత్రుం డొక్కఁడేతెంచి మదీయ ప్రయత్నంబును గ్రహించి యనువ్వు వెలయ భక్తవరా! యని సంబోధించి యిట్లనియె.

వాట్రీ నగరాంతర్గత సుప్రసిద్ధ శ్రీతిరుమల శ్రీనివాస త్రిలింగవిద్యాపీఠసంచాలకుల సమక్షమునఁ బండిత కవి ప్రశంసలవలన హరికథా రచనా విశారదయనియు సంగీత సాహిత్య కళాప్రవీణయనియు హరికథాసుధాకరయనియు బిరుదములు నందిన శ్రీయుక్తవారికి కార్యమతి సులభము. కానఁ బ్రారంభింపుమని ప్రోత్సహించుటయు మిత్రుని యానతిని శిరసావహించి బ్రహ్మవైవర్త పురాణాంతర్గతమగు నారద వృత్తాంతంబును వ్రాయఁ గుతూహలుండనై

## షష్ఠ్యంతములు

కం॥ శ్రీకరునకు సూర్యకులసు
ధాకరునకు వాంఛితార్థ ♦ దాయకునకు సు
శ్లోకునకు దానవాన్వయ
భీకరునకుఁ బార్వతీశ ♦ వినుతాకృతిన్॥ ౨౮

కం॥ ధీరునకుఁ బయోనిధి గం
భీరున కిక్ష్వాకువంశ ♦ వీరునకు శుభా
కారునకు మానినీహృదయవి
హారునకును దివ్యమంగ ♦ ళాకారునకున్॥ ౨౯

కం॥ రామునకు సకల సద్గుణ
ధామునకును రఘుకులావ ♦ తంసునకుఁ బరం
ధామునకుఁ బరమ పావన
నామునకును సకలలోక ♦ నవ్యాకృతికిన్॥ 30

కం॥ దండితదనుజేశునకా
ఖండల వినుతునకు సకల ♦ కళ్యాణునకు
ద్దండపరాక్రమశాలికి
ఖండపరశు భీమకార్ముక ♦ విభంగునకున్॥ 31

కం॥ సరసిజదళలోచనునకు
దరహాసితాస్యునకు సుగుణ ♦ ధామునకు దివా
కర కులదీపకునకు దా
శరధికి నిజదాసహృదయ ♦ సంచారునకున్॥ 32

గీ॥ అంకితంబుగ రచియింప ♦ నాత్మ నెంచి
నట్టి నారద సుచరిత్ర ♦ మనెడి గద్య
పద్యయుక్తమౌ చంపూ ప్ర♦బంధమునకు
నింపుఁగూర్చు కథాక్రమ ♦ మెట్టులనిన॥ 33

— కథారంభము —

సీ॥ తక్కోలహింతాల ♦ తాలరసాలామ్ల
సర్వంసహాజాత ♦ సంయుతంబు
సురమార్గ చుంబితో ♦ పరిభాగ సంయుక్త
పర్వతశ్రేణీ వి ♦ భాసితంబు
కరివృక శార్దూల ♦ గండకీ పంచాస్య
ఘోరకానన సత్త్వ ♦ పూరితంబు
శారికా కీర మ♦యూర పరభృతాది
మధుర నినాద స♦మన్వితంబు
విమల తాపసాశ్రమ పరి ♦ వేష్టితంబు
స్వచ్ఛ వనపూరకాసార ♦ పరివృతంబు
సంతతవ్యాధ సంచార ♦ సంయుతంబు
మౌని నిలయంబు నైమిశ ♦ కాననంబు॥ 34

గీ॥ అవ్వనంబునఁ గల శౌన ♦ కాదిమౌను
లఖిల శాస్త్ర పురాణేతి ♦ హాసవిదుని
వ్యాస శిష్యుని బౌరాణి ♦ కాగ్రగణ్యు
సూతుఁగాంచి ప్రశ్నించిరి ♦ జోతఁజేసి॥ 35

ఉ॥ వింటిమి పెక్కుధర్మముల ♦ విష్ణుచరిత్రల నీ ముఖంబునన్
వింటిమి సద్వ్రతంబులఁ బ♦విత్ర చరిత్రలమున్న వీని న
న్నింటిని మించు నారదము♦నీంద్ర చరిత్ర వినంగ వేడ్కతో
నుంటిమి కావు నన్దెలుపు♦మో కథకోత్తమ పండితాగ్రణీ॥ 36

ఉ॥ నావుడు సౌతి యిట్లనియె ♦ నారదమౌనివరేణ్యు సత్కథన్
బావనులార తెల్పెద శు♦భప్రదమియ్యది భక్తితో వినం
గావలె విష్ణుభక్తుల గు♦ణంబులు గాధలు తత్స్వభావముల్
భూవలయంబున న్బరమ ♦ పూజ్యములై విలసిల్లుచుండెడిన్, 37

ఆ॥ వె॥ సర్వ పాపహరము ♦ సకల మంగళదంబు
నిత్యముక్తిదంబు ♦ నిర్మలంబు
సారతరము భక్త ♦ నారదచరితంబు
వినుడి మానులార ♦ విశదముగను॥ 38

— గోలోక వృత్తాంతము —

ఆ॥ వె॥ శ్రీకరమగు సత్య ♦ వైకుంఠ కైలాస
లోకదూరమై వె♦లుంగుచుండు
కోటి సూర్యకాంతి ♦ గోలోక మొక్కటి
మునిగణముల కెల్లఁ ♦ బూజ్యమగుచు॥ 39

కం॥ ఆలోకమునకుఁ బ్రభువై
నీలోత్పలదళ విశాల ♦ నేత్రుఁడు కరుణా
శీలుఁడు బ్రహ్మమయుఁడు రా
ధా లోలుఁడు కృష్ణుఁడు పర♦తత్త్వ మనఁదగున్॥ 40

సీ॥ హరిహరులే పరా♦త్పరు వామదక్షిణ
పార్శ్వభాగముల ను♦ద్భవముఁ గనిరి
బ్రహ్మ యెవ్వని నాభి ♦ పద్మజుఁడయ్యె ధ
ర్మఁ డెవని శ్రీ వక్ష♦మున జనించె

మాదేవి యెవ్వాని ♦ మనమునుండి వెడలె
వాణి జనించె నె♦వ్వని ముఖమున
ప్రకృతి దుర్గాంబ యీ♦శ్వరి యుద్భవించె నే
శుద్ధ చైతన్యుని ♦ బుద్ధివలన
వరుణుఁ డెవ్వని తేజంబు ♦ వలనఁగలిగె
మనసిజుఁడెవనికి హృదయ ♦ జనితుఁడయ్యె
నెవఁడు విశ్వాధివాసి యా ♦ కృష్ణవిభుఁడు
పావనుఁడు దివ్యగోలోక ♦ పాలకుండు॥ 41

గీ॥ ఆ మహాత్ముఁడు నిజరస ♦ నాగ్రజనిత
మైనకళ్యాణి సావిత్రి ♦ యనువధూటి
నబ్జయోనికి భార్యగ ♦ నప్పగించి
హితము వెలయించు పలుకుల ♦ నిట్లులనియె॥ 42

గీ॥ తొలుత సృష్టికార్యమొనర్ప♦వలయుఁగాన
నీవధూమణి నృతిగా గ్ర♦హించి వత్స !
దివ్యవర్ష సహస్రము ♦ దీర్ఘతపముఁ
జేసి శాశ్వతపరిపూర్ణ ♦ సిద్ధిఁగాంచి॥ 43

కం॥ తదనంతరంబు సృష్టికి
మొదలిడుమని పల్కి మంత్ర ♦ మును మాలను దా
ముదమున నీయంగఁ జతు
ర్వదనుఁడు వానిని గ్రహించి ♦ పనిగొనియె వడిన్॥ 44

— శ్రీకృష్ణుని పన్పున బ్రహ్మతపస్సుఁజేసి
సృష్టికార్యమున కుపక్రమించుట —

గీ॥ వేయిదివ్యాబ్దములవ్యధి ♦ విష్ణుఁగూర్చి
పరమభక్తిని దీర్ఘత ♦ పం భొనర్చి

యీప్సితములగు వరముల ♦ నెల్లఁబడసి
విశ్వసృష్టి కార్యము నెఱ♦వేర్పనెంచె॥ 45

కం॥ మధుకైటభ మేధస్సునఁ
విధి పృథివిని దెలుత సృష్టిఁ ♦ జేమనొనర్చెన్
బడపడి తరుపర్వతముల
నదులనదీవారిధుల నొ ♦ నర్చెను సృష్టిన్॥ 46

క॥ సప్తకుల పర్వతంబుల
సప్తద్వీపముల సప్త♦సాగర సమితిన్
సప్తోప ద్వీపమ్ములఁ
దృప్తిని సృజియించి బ్రహ్మ ♦ దేవుఁడు పిదపన్॥ 47

గీ॥ మేరుశృంగాష్టకంబుల ♦ సారసభవుఁ
డష్ట లోకపాలకుల వి ♦ హారమునకు
మహిత నిరుపమ శృంగార ♦ మయముతైన
యష్టపురముల నిర్మించె ♦ నతిచతురత॥ 48

వ ఇవ్విధంబున నసంఖ్యాకములగు పర్వతంబులను నగర గ్రామంబులను నుత్తరోత్తర ద్విగుణీకృత లక్షయోజన విస్తీర్ణంబుకల లవణేక్షుసురాసర్పి దధిక్షీరజలార్ణవంబులను సప్తసముద్రములను జంబూ ప్లక్ష కుశ క్రౌంచ శాక శాల్మలీ పుష్కరంబులను సప్త ద్వీపంబులను నతలవితల సుతలతలాతల రసాతల మహాతల పాతాళంబులను సప్తాధోలోకంబులను భూలోకభువర్లోక సువర్లోక మహాలోక జనలోక తపోలోక సత్యలోకంబులను సప్తోర్ధ్వలోకంబులను మేరు మూలమున ననంతుని నగరంబును శిఖరోపరిభాగమున జరామరణ భయవర్జితంబగు స్వకీయ సత్యలోకంబును తదూర్ధ్వభాగంబున ధృవలోకంబును నవ వర్షములుకల బ్రహ్మాండ కటాహమును నిర్మించినవాఁడై నిర్జీవముగనున్న యచ్చోటఁ బ్రాణికోటిని సృజింప నిశ్చయించి, 49

కం॥ వెనువెంటనున్న సావి
త్రిని గేళింగూడి తనదు ♦ తేజము నా కా
మినియందు నిల్ప సీమం
తిని గర్భముఁదాల్చి నూరు♦ దివ్యాబ్దంబుల్. 50

గీతమాలిక॥

వేదములునాల్గు యోగ త ♦ ర్కాది వివిధ
శాస్త్రచయమును యుగచతు ♦ ష్టయమును నిగ
మాంగ షట్కమున్ ముప్పది ♦ యాఱు దివ్య
రాగములఁ దాళముల వత్స ♦ రాయనర్తు
మాసపక్షములను తిథి ♦ వాసరములఁ
గళలఁ బవలు రాతిరుల యో♦గకరణముల
బ్రాహ్మపాద్మ వారాహ క ♦ ల్పత్రయమును
కాలపురుషుని షట్కృత్తి ♦ కలను నెల్ల
వ్యాధులను జతుర్విధముఁలౌ ♦ ప్రళయములను
మృత్యుకన్యను బ్రసవించి ♦ మించువేడ్క
నామె వారికిఁ దనదు స్త♦న్యం బొసంగి
యాత్మపతికి సహాయురా♦లై చెలంగె॥ 51

గీ॥ అపుడు వనజోద్భవుఁడు కడు ♦ హర్షమంది
యాత్మ సంకల్పమున సన♦కాదిముని చ
తుష్టయమును సృజించి సం♦తుష్టిమీఱ
వారల నొనర్చె వేద వి♦శారదులుగ॥ 52

చ॥ తనయులు నల్వురీగతిని ♦ దండ్రికడ న్నిగ మాగమంబుల
ఘనతరశాస్త్ర చింతనల ♦ గాఢ తపోబల దివ్యసంపదల్
మనమలర న్గ్రహించి పర♦మార్థనదంబునఁ బారదృశ్వులై
జనకునకుల్ బ్రమోదము నొ♦సంగఁగఁ జాలిరి యోగసిద్ధులై॥

గీ॥ సనకుఁడు సనందనుఁడు సనా♦తనుఁడు నల స
నత్సుజాతుఁడనఁగ నీ త♦నయుల నల్వు
రను బ్రజాపతి వీక్షించి ♦ తనవిఁ జెంది
పరమ సంతోషమును బొంది ♦ పలికె నిటుల॥ 54

గీ త మా లి క॥

తనయులార ! నా యానతిఁ ♦ దలనుదాల్చి
ప్రజల సృష్టించు కార్యభా♦రము వహింప
వలయునని పెక్కు విధములఁ ♦ బలికెఁగాని
వారి భావమ్ములు ప్రవృత్తి ♦ పథమునందుఁ
జేరక నివృత్తి మార్గము ♦ జేరుచుంటఁ
దెలిసికొని వారి నల్వుర ♦ నళినభవుఁడు
ముక్తసంగుల గావించి ♦ మోక్షపథముఁ
జేర్చి కర్తవ్యమా ప్రజా ♦ సృష్టికొఱకు॥ 55

కం॥ పదునొక్కసుతులఁ దేజో
వదనుల సృజియించి వారి ♦ వలనం జేయిం
చెద నింక సృష్టియని నె
మ్మది సంకల్పించెఁ దా కు♦మారులు కలుగన్॥ 56

వ॥ అట్లుసంకల్పించుటయే తడవుగ నా పితామహుని వామకర్ణమునుండి పులస్త్యుండును దక్షిణకర్ణమునుండి పులహుండును దక్షిణనేత్రమునుండి యత్రియు వామనేత్రమునుండి క్రతువును ముఖమునుండి యంగిరసుండును వామపార్శ్వమునుండి భృగువును దక్షిణపార్శ్వమునుండి దక్షుండును ఛాయవలనఁ గర్దముండును స్కంధమునుండి మరీచియు జిహ్వాగ్రమునుండి వసిష్ఠుండును గంఠమునుండి నారదుండును మున్నగు కొమరులాయా ప్రదేశములనుండి ప్రాదుర్భవింపఁ బరమేష్ఠియా తనయులనందఱను॥ 75

గీ॥ వేదవేదాంగ సర్వశా ♦ స్త్రాదిది విద్య
లను విపులముగ బోధించి ♦ మునిజనార్హ
ములగు యోగసిద్ధులనెల్లఁ ♦ గలుగఁజేసి
ఘన తపో నిష్ఠ కలవారి♦గా నొనర్చె॥ 58

చ॥ జనకుని శిక్షచే సుతులు ♦ శాస్త్రవిశారదులై శమాది స
ద్గుణ సముపేతులై పరమ ♦ కోవిదులై నిగమజ్ఞులై మహా
ముని నుతియోగ్యులై సతత♦భూరి తపోబలభాసితాంగులై
తనరిరి పుణ్యమూర్తులయి♦త త్త్వవిదగ్రణులై మహాత్ములై॥

గీ॥ అతులసంప్రా_ప్త సుజ్ఞాను ♦ లైన యట్టి
తనయులనుగాంచి తృప్తుఁడై ♦ తమ్మిచూలి
నిజహృదయగత సంకల్ప ♦ నియతిఁ బల్కి
వారిగే స్తులఁగమ్మని ♦ పలికెనపుడు॥ 60

— నారదుఁడు బ్రహ్మదేవునిచే శపింపబడుట —

గీ॥ నారదుఁడు కాక తక్కిన ♦ వారలెల్ల
జనకవాక్యంబులను శిరం ♦ బున ధరించి
సమ్మతించిరి పితృవాక్య ♦ సరణిని విని
వారిజోద్భవుతో ననె ♦ నారదుండు॥ 61

కం॥ జనకా! తగునా జ్యేష్ఠుల
సనకాదుల విడిచి దార♦సంగ్రహణంబున్
గొనుమని యాజ్ఞాపించెద
వనఘా! యిటులనఁగ నీకు ♦ న్యాయంబగునే॥ 62

కం॥ ఐహికములగు దురూహా
పోహాలకును జిక్కి పరమ ♦ మూఢుఁడనై స్త్రీ
గేహాదులపై దుర్వ్యా
మోహంబునుజెంది నరక ♦ మునఁ బడఁజాలన్॥ 63

శా॥ శ్రీనారాయణ పాదపద్మయుగ సం♦సేవానురక్తుండనై
ధ్యానాసక్తుఁడనై తపోనియతి బ్ర♦హ్మైక్యాను సంధానని
త్యానందంబును బొందఁగోరు నను నీ♦వత్యంత క్రుద్ధుండవై
నానా లౌకిక వాసనాహ్రదములో ♦ నన్ద్రోయఁగాఁ జూచెదే॥

గీ॥ ఇట్టి విపరీతబుద్ధి నీ♦కేల కలిగె
సుతుల సద్గతిఁ బంపఁగ ♦ జూచువార
లుందురేకాని కుటిలమో ♦ హోర్మిమాలి
కలను ముంచెడి తండ్రులు ♦ కానరారు॥ 65

గీ॥ విషమమై విషాధికమైన ♦ వివిధవిషయ
వాసనామయ ఘోర భ♦వంబునందుఁ
దనయునిం బడఁద్రోసెడి ♦ తండ్రి కోటి
కల్పములకైన నిష్కృతిఁ ♦ గాంచఁగలఁడె॥ 66

గీ॥ సర్వమెఱిఁగిన వాఁడవీ ♦ సరణిఁ బలుక
నే మనం గలవాఁడ నే ♦ నో మహాత్మ!
సారతరని వృత్తిపథమున్ ♦ గోరుచిత్త
వృత్తి యేరీతిఁ జేరుఁ బ్ర♦వృత్తిపథము॥ 67

చ॥ పరముని బూరుషోత్తముని♦బావను నాత్మమయున్ గృపానిధిన్
నిరుపము భక్తవత్సలుని ♦ నిర్మలునార్తశరణ్యు నీశ్వరున్
బరమపదప్రదు న్విడిచి ♦ నాశనహేతువులై చెలంగు దు
ర్భరవిషయాదుల న్దనదు♦ స్వాంతము నిల్పెడి మూర్ఖుఁడుండునే॥

శా॥ పీయూషాధికమైన శ్రీహరిపద ♦ ప్రేమానిధిన్వీడి యు
న్మాయంబౌ విషయాది వాసనలకు ♦ న్బ్రాలైనచో భీకరా
పాయంబు న్దలపోయలేమి వడి దీ♦పంబున్ ఫలభ్రాంతిచే
డాయంబోయెడు కీటకంబుగతి కా♦డా! తుల్యభావంబునన్॥ 69

కం॥ పలుకు లిఁకేటికి నీదగు
తలఁపును విడనాడి నాకుఁ ♦ దపము నొనర్పన్
సెలవీయుము పోయెద నని
పలుకఁగ నారదుఁడు బ్రహ్మ ♦ బహుకోపమునన్॥ 70

గీ॥ కంపితాంగుఁడై భయద ర♦క్తముఖుఁడగుచుఁ
దన కెదురు వల్కియుండిన ♦ తనయుఁ గాంచి
సతత చలితాధరుండయి ♦ జ్వలితజాత
వేదతుల్యుఁడై పల్కె నా ♦ వేశమునను॥ 71

క॥ పితృవాక్యముఁ బాలించుట
సుతులకు వరధర్మమనెడి ♦ సూక్తి నెఱుఁగవే
మతి చెదరెనేమొ నీవి
గతి సాహసమున వచింపఁ ♦ గడఁగితివౌరా॥ 72

గీ॥ సృష్టికార్యము నెఱవేర్చు ♦ టీశ్వరాజ్ఞ
యగుటచే మన కర్తవ్య ♦ మాయె నిప్పు
డట్టి పరమేశ్వరోద్దిష్ట ♦ మైన నాదు
ముదల కెదురాడిన ఫలంబుఁ ♦ బొందుమింక॥ 73

వె॥ గేస్తువగుట కేవ ♦ గించిన నీవు గం
ధర్వ కులమునందుఁ ♦ దగ జనించి
పెక్కురూపవతుల ♦ ప్రేమంపు భర్తవై
కాముకేళిఁదేలఁ ♦ గలవు మఱియు॥ 74

సీ॥ స్థిరయౌవనంబునఁ ♦ జెలఁగెడి కామిను
లేఁబదిమందికి ♦ పీనుఁ శవయి
కామశాస్త్రంబున ♦ ఘన పండితుండవై
శృంగారశాస్త్ర ప్ర ♦ సంగివగుచు

కాంతాజనంబుతోఁ ♦ గామకేళీ కలా
పంబున మునిఁగి స ♦ ర్వమును మఱచి
వైణికోత్తముఁడవై ♦ గాన విద్యావిశా
రదుఁడవై యాచార్య ♦ పదవినంది
మహిని నుపబర్హణుఁడను నా♦మమును దాల్చి
శాంతమధుర వాగ్భాషివై ♦ సతులతోడ
లక్షయుగ దివ్య వర్షము ♦ ల్ప్రీతియొనర్చి
సంచరించుచుఁ దిరిగి మ ♦ చ్ఛాపమునను॥ 75

కం॥ దాసీ కుమారకుఁడవై
దాసుఁడవై వైష్ణవులకుఁ ♦ దత్పదసేవా
భ్యాసమునఁ ద దుచ్ఛిష్ట
గ్రాసాదనమునను భక్తి ♦ కలుగును దానన్॥ 76

గీ॥ పరమభక్త రత్నంబవై ♦ వసుధలోన
సతత హరికీర్తనామృతా ♦ స్వాదనమున
సంతసించుచుఁ దదుపరి ♦ జన్మమందుఁ
బొందఁగలుదువయ్య మ ♦ త్పుత్త్రపదవి॥ 77

—* నారదుఁడు బ్రహ్మను దిరిగి శపించుట *—

కం॥ అనుచు శపించిన చతురా
నను గని బద్ధాంజలియయి ♦ నారదుఁడనె నో
జనకా! మానుము కోపం
బనిమిత్తంబుగ శపింప ♦ నానే నన్నున్॥ 78

గీ॥ ధర్మపథముఁ ద్యజించిన ♦ తనయుఁడెంత
పండితుండైన దండనా♦ర్హుండుగాని
తపసియౌ సుతుపైనఁ గ్రో♦ధమువహించి
శాపమీయంగఁ జెల్లునే ♦ జలజగర్భ!॥ 79

ఆ॥ వె॥ విష్ణుభక్తిలేని ♦ పృథ్వీసురుఁడు బ్రహ్మ
పుత్త్రుఁడైననేమి ♦ పుడమిలోన
శ్వానసూకరాది ♦ జంతుజాలముకన్న
నధముఁడని వచింతు ♦ రార్యవరులు॥ 80

కం॥ ఏయే యోనులఁ బుట్టినఁ
దోయజదళనేత్ర భక్తి ♦ తోడై నన్నుఁగా
బాయకయుండెడి సద్వర
మీయవె నా కదియచాలు ♦ నీ జగమందున్॥ 81

చ॥హరిచరణ ద్వయంబు నన ♦ యంబుభజించుచుఁ బూర్వజాతి సం
స్మరణము కల్గి భక్తియను ♦ మార్గమునం జరియించు ప్రాణిసూ
కరముగఁ బుట్టుఁగాక తన ♦ కర్మఫలంబగు దైవసేవచేఁ
బరమపదంబుఁ జెందదె భ♦వంబుల నంటక నిత్యయుక్తమై॥ 82

గీ॥ వైష్ణవాదుల దివ్యసం ♦ స్పర్శనమునఁ
బరమపావనతం గన్న ♦ భారతోర్వి
విమల గోవిందపాదార ♦ విందభక్తి
సుధను గ్రోలుచు నాత్మ వి♦శుద్ధిఁగాంచు॥ 83

గీ॥ వైష్ణవాగ్రేసరుల తను ♦ స్పర్శనంది
సర్వతీర్థము లుత్తమలోన ♦ సంక్రమించు
పాపచిత్తుల పాపము ♦ ల్బాపుకొనుచు
దుష్టులనుగూడ నతి పవి♦త్రుల నొనర్చు॥ 84

గీ॥ దైవ మంత్రోపదేశ మా♦త్రమున నరులు
పూర్వ పరకోటి సంఖ్యాక ♦ పురుషవరుల
తోడ భవపాశముక్తులై ♦ దుర్లభమగు
పుణ్య గోలోకవాసమున్ ♦ బొందగలరు॥ 85

గురుతర ఘోరపూర్వ భవ♦కోటి కృతంబగు పాపసంఘముల్
సరు లల్లదైవనామభజ ♦ నంబున మంత్రజపాదుల న్దహో

నిరతిని సంహరించి కడు ♦ నిష్ఠమెలంగుచు నిత్య శుద్ధులై
పరమపదంబు నందెదరు ♦ భక్తి పథంబునఁ బారదృశ్వులై ॥86

గీ॥ ఎవఁడు సుతదార శిష్యబాం♦ధవ సహచర
పరిచరుల నెల్ల శ్రీకృష్ణ ♦ భక్తిపరులఁ
జేయునో యా మహాత్ముండు ♦ స్థిరతరమగు
సద్గతిం జేరఁగల్గును ♦ సత్యమిదియ॥ 87

ఆ॥ వె॥ తన్ను నమ్మియున్న ♦ తనయుల శిష్యుల
నెవఁడు దుష్పథముల ♦ కీడ్చివేయు
నట్టి వారలకు భ♦యంకర నరకంబు
లుండు నినశశాంకు♦లుండు వఱకు॥ 88

గీ॥ భవమరణ శోక తాప వి♦ధ్వంసక మగు
కృష్ణభక్తి నీ లేనివాఁ♦డెట్టి తండ్రి ?
దేవదేవుని బరమాత్మ ♦ దివ్యపదవి
నిచ్చు జ్ఞానమీ లేని వాఁ ♦ డెట్టి తండ్రి॥ 89

కం॥ అపరాధి గౌరవమును ని
రపరాధి యవజ్ఞ నెచట ♦ నందునో యచటన్
విపరీతంబగు క్షామము
నపహరణము వ్యాధి చెలఁగు ♦ నతిభీకరముల్॥ 90

కం॥ ఏ దోషం బెఱుఁగని నా
కో దేవా ! శాపమిచ్చి యుంటివి వినుమా
నాదగు ప్రతిశాపంబును
వేధా ! నీ వింక ననుభవింపఁగ వలయున్॥ 91

ఉ॥ ధాతవు సర్వనిర్ణయ వి♦ధాతవు నేతవు ధర్మశాస్త్ర సం
ధాతవు నీవు నా యెడల ♦ ధర్మముఁ దప్పి యొసంగినావు ని
ర్హేతుక శాపము న్మరల ♦ నిచ్చెద నేఁ బ్రతిశాప మియ్యదే
భూతలమందు నీవిఁక న♦పూజ్యత నందుము మూఁడు కల్పముల్॥

గీ॥ కవచమాలికా స్తోత్ర సం♦ఘటితమంత్ర
ముండ దీఁకమీఁద నీ పేర ♦ నుర్విలోన
యజ్ఞముల వ్రతములను స్మా♦ర్తాది కర్మ
లందు మాత్రముకల్గు నీ ♦ కగ్రపూజ॥ 93

గీ॥ మూఁడుకల్పము లేనాఁడు ♦ పూర్తియగునో
యపుడు శాపము క్తుండవై ♦ యఖిలలోక
పూజ్యతను గాంతు వింక నేఁ ♦ బోవుచుంటి
ననుభవింపఁగఁ బ్రారబ్ధ ♦ మును జగాన॥ 94

కం॥ అని పల్కి చనెను నారద
ముని విధి శాపానుభవముఁ ♦ బొందుటకై మిం
చినపనికి విచారింపుచుఁ
దన తొందరపాటుఁ దలచి ♦ ధాతయు వగచెఁ॥ 95

— ఆశ్వాసాంతము —

కుమారలలిత—
సరోజదళనేత్రా! సురేశనుతిపాత్రా!!
పురారినుతనామా! సురారిగణభీమా! 96

గద్య

ఇది శ్రీరామచంద్ర వరప్రసాదలబ్ధకవితా భాగధేయ
కేతవరపువంశపయఃపారావారరాకాసుధాకర కాశ్యపస
గోత్రోద్భవ లక్ష్మీనృసింహగురుపుత్త్ర
రామకృష్ణ నామధేయ ప్రణీతంబైన
భక్తనారదీయమందలి
ప్రథమాశ్వాసము.

—o—

-

# భక్తనారదీయము

## ద్వితీయాశ్వాసము

కం॥ శ్రీరాఘవ ! రవితేజా !
నారాయణ ! దేవదేవ ! ♦ నారదవినుతా !
ధీరా ! దశరథనందన
కారుణ్యము వెలయమమ్ముఁ ♦ గావుమురామా॥ 1

వ॥ దేవా ! అవధరింపుము. 2

గీ॥ శౌనకుఁడు సూతిఁ గాంచి యో♦మాననీయ !
తండ్రిచే శపింపఁబడిన ♦ తాపసియగు
నారదుండెట్లు గంధర్వ ♦ నాథుఁడయ్యె
తెలుపు మన. నాతఁ డాకథ ♦ పలికె నిటుల॥ 3

గీ॥ నారదుఁడు కాక తక్కిన ♦ వారలెల్ల
తండ్రి యాజ్ఞావిధాన ము♦న్నలనుదాల్చి
దారలన్గ్రహించి సం ♦ సారులగుచుఁ
దనివిఁ జెందిరి తగిన సం♦తతినిగాంచి॥ 4

చ॥ జనకుఁడు క్రుద్ధుఁడై తన కొ♦సంగిన శాపమె కారణంబుగా
తనయుఁడు నారదుండు పరి ♦ తాపభరంబునఁ బోయి వీడి యా
తనువును దేవయోనులకు ♦ దైవవశంబునఁ బుట్టెఁ బుత్త్రుఁడై
వినుఁడిదె మౌనులార ! విని ♦ పించెదనాకథ నప్రమత్తులై॥ 5

— గంధర్వరాజు సంతతికొఱకు శివునిగూర్చి తపంబుఁజేయుట —

కం॥ శర్వుని భక్తుండగు గం
ధర్వ విభుఁడు కలఁడొకండు ♦ ధర్మోన్నతుఁడై
సర్వైశ్వర్య యుతుండై
గుర్వాజ్ఞా పాలనంబె ♦ కోరుచునుండున్॥ 6

గీ॥ ఎంత యైశ్వర్యముండిన ♦ నెంతభోగ
వైభవంబులు కల్గిన ♦ స్వాంతమందు
చింతయుండుట సహజమై ♦ చెలఁగుకతన
బాధపడుచుండె నతఁడొక ♦ వ్యాకులమున॥ 7

ఉ॥ సంతతి లేనివాఁడగుట ♦ సంతత శోకపరీత చిత్తుఁడై
కాంతనుజూచి యిట్లనియె ♦ కామిని! పుత్త్రిలు లేనిచింత నా
స్వాంతమునుంగలంచెడిని ♦ బట్టిజనించు విధంబుఁజోఁప దా
వంతయు నేఁటికీగతిని ♦ భాగ్య విహీనుల మైతిమక్కటా॥ 8

సీ॥ ముద్దుమాటలచేత ♦ మురిపెంబుఁ గూర్చెడి
కొమరుఁడులేని యూ ♦ కూటమేల
పూర్ణచంద్రునిబోలు ♦ మోముతో వెలయు కు
మారుఁడులేని సం♦సారమేల
తల్లిదండ్రులయొక్క ♦ దైన్యంబుఁ బోగొట్టు
తనయులు లేకున్న ♦ ధనము లేల
కరములాడించుచుఁ ♦ గడుమోదము న్గూర్చు
కనుగందులేని సౌ♦ఖ్యంబు లేల
ఎట్టి దుఃఖము ల్గల్గిన ♦ యెడనునైన
సుతుని కొమరారు ముఖమును ♦ జూచినయెడఁ
జింతలన్నియుఁ దొలఁగును ♦ జిత్తమునకు
సుతునిబోలు పదార్థ మీ ♦ క్షితినిగలదె॥ 9

గీ॥ అట్టి భాగ్యమునకు నోచ • మైతి మబల!
పుత్త్రగాత్ర పరిష్వంగ • భూరిసుఖముఁ
బొందఁజాలని తనువేల • భోగమేల
బాలుఁ గాంచనిజీవిత • మేల మనకు॥ 10

మ॥ అని చింతించెడి యాత్మనాథుగని యా•యబ్జాస్య కేల్మోడ్చి యో
యనఘా! చింతిలనేమి కల్గు? భవదీ • యాచార్యవర్యున్వసి
ష్ఠుని బ్రార్థించినఁ బుత్త్రలాభవిధము • న్సూచింపఁజేయుంచుఁ బ
ల్కిన గంధర్వవిభుండు భార్యకరము • న్గీలించి తానిట్లనున్॥ 11

గీ॥ ఉవిద! సమయోచితమగు నీ • యుక్తివలనఁ
గార్యసాధనము లభించుఁ•గాన నటులె
చేయుదు ననుచు నపుడు వ • సిష్ఠమౌని
కడకుఁబోయెనతఁడు పుత్త్ర • కాముఁడగుచు॥ 12

ఉ॥ మానివరేణ్యుఁగన్గొని న • మస్కృతిసల్పి నతోత్తమాంగుఁడై
సూనుఁడు కల్గుమార్గమును • జూపవె యోమునినాథ! యంచుఁదా
దీనతతో వచింప గురు • దేవుఁడు పల్కెబిరాన వత్స! నీ
మానసమందుఁ జింతిలుట • మాని హితోక్తులనాలకింపుమా॥

కం॥ శంకరభక్తుఁడ వీగతి
శంకింపఁగనేల నీకు • సర్వేశుఁడె నీ
సంకల్పంబులఁ దీర్చును
సంకటహరణుండ తండు • సౌజన్యనిధీ॥ 14

గీ ద్వాదశాక్షరశైవమం • త్రంబు కలదు
దాని గ్రహియించి పార్వతీ • జానిగూర్చి
తపముసల్పు మాయంచు గం • ధర్వ విభున
కపుడె మంత్రోపదేశము • న్దపసిచేయు॥ 15

మ॥ కర మామోదముతో గ్రహించి యప్పుడా ♦ గంధర్వనాథుండు పు
ష్కరతీర్థంబున కేగి యొక్క యెడ ని ♦ శ్శబ్దప్రదేశంబునన్
హరమంత్రంబు జపించుచు న్దపము ని ♦ త్యాత్మానుసంధానుఁడై
స్థిరచిత్తంబున నూఱువర్షములు చే ♦ సెన్ నిశ్చలధ్యానియై॥ 16

— పరమేశ్వరుఁడు గంధర్వునకుఁ బ్రత్యక్షమై వరంబు లిచ్చుట —

గీ॥ అతని తపమునకును మెచ్చి ♦ యాదిదేవుఁ
డమృతకరమౌళి శంభుఁడా ♦ ర్యావిభుండు
కాలకాలుఁడు భవుఁడు గం ♦ గాధరుండు
పరమశివుఁడు మందస్మిత ♦ వదనుఁడగుచు॥ 17

సీ॥ మిన్నంటి వెలసిన ♦ మేల్జటా పటలితో
భస్మాంగరాగ లే ♦ పంబు తోడ
ఘన జటాబద్ధమౌ ♦ గంగాంబువులతోడ
వ్యాఘ్రచర్మోజ్జ్వలాం ♦ బరము తోడ
కరమున విలసిల్లు ♦ వరపినాకము తోడ
డమరుక శూలాయు ♦ ధముల తోడ
కంఠమునంగల ♦ గరళచిహ్నము తోడ
భుజగ కంకణముల ♦ భుజముతోడ

బాలచంద్ర రేఖాంచిత ♦ ఫాల మొప్ప
మౌనిసన్నుత పాదప ♦ ద్మముల వాఁడు
శంకరుఁడు సంతసమున సా ♦ క్షాత్కరించెఁ
బ్రేమమీఱఁగ గంధర్వ ♦ విభుని యెదుట॥ 18

విశ్వరూపుండును దివ్యతేజోవిభాసితుండును స్ఫటిక సంకాశుండును సర్వాభరణధారియుఁ దపోఫలప్రదాతయుఁ బ్రసన్నాస్యుండును త్రినేత్రుండును నాగ యజ్ఞోపవీతుండును భక్తానుగ్రహాకారకుండును శరణాగతభక్త సర్వసంపత్ప్రదాతయు శూల పట్టిసాద్యాయుధ

ధారియు మృత్యుంజయుఁడును గోటిసూర్య ప్రభామండితుండును
నగు శివుఁడు వృషభవాహనుండై కట్టెదుటఁ బ్రత్యక్షమైనంత॥ 19

గీ॥ తనువు పులకింప బాష్పము ♦ లక్షులఁ బ్రాల
పరమ సంతోష విభ్రమ ♦ స్వాంతుఁడగుచు
పార్వతీశుని పదముల ♦ వ్రాలి పరమ
భక్తిమీఱఁగ నిటు సంస్త ♦ వంబొనర్చె॥ 20

సీ॥ సకల లోకావళి ♦ సంహారకారణ!
పావనాకార! తు ♦ భ్యం నమోస్తు
పరిపాలితాఖిల ♦ భక్తలోక! బిడౌజ
వందితరూప! తు ♦ భ్యం నమోస్తు
జ్ఞానాంకశోభిత ♦ సనకసనందన!
భక్తార్తిభంగ! తు ♦ భ్యం నమోస్తు
బ్రహ్మాది సురవంద్య! ♦ పార్వతీనివసిత
వామాంకభాగ! తు ♦ భ్యం నమోస్తు
ప్రమథగణ పరిసేవిత! ♦ భక్తవినుత!
పావన మునిమానస పద్మ ♦ పద్మభృంగ!
రజతశైల నివాస వి ♦ రాజితాంగ!
వందితాఖిలలోక! తు ♦ భ్యం నమోస్తు॥ 21

సీ॥ ఏసామి నయనాగ్ని ♦ కించువిల్తుఁడు కాలి
పూర్ణాహుతిగఁ జేరఁ ♦ బోయినాఁడొ
ఏదేవు క్రోధాగ్ని ♦ కా దుష్టదానవ
దళము నిశ్శేషమై ♦ దగ్ధమయ్యె
నేమహాదేవున ♦ కెసఁగు భూషణములై
ఫణిరాజవంశంబు ♦ పరమభక్తి
నే మహామహిమాఢ్యు ♦ వామభాగంబున
గౌరీమహాదేవి ♦ కూరుచుండు

పులికఁగాంచ నేదేవుని ♦ పుట్టమరయ
పునుకమాలిక లేసామి ♦ పూలసరులు
అట్టి యోదేవ! శంకర! ♦ యమలచరిత!
నీకు మ్రొక్కెడి మమ్మేలు ♦ నిటలనయన॥ 22

కం॥ అని ప్రార్థించెడి గంధ
ర్వునకును గరుణామయుండు ♦ భూతేశుండి
ట్లనె వత్సా! నీతపమున
కును మెచ్చితి వరములిత్తు ♦ కోరుమనంగన్॥ 23

మ॥ హరవాక్యంబుల నాలకించి యతఁ డ ♦ త్యంతంబు సంతుష్టుఁడై
పరమానందమున న్మునింగి యనెనో ♦ భక్తావనా! నాకు శ్రీ
హరిభక్తుండగు పుత్త్రు నీయఁగదవే ♦ యన్నన్ ప్రసన్నాత్ముఁడై
దరహాసాననుఁడై వచించె నిటు గం ♦ ధర్వేశు వీక్షించుచున్॥ 24

గీ॥ అఖిల వాంఛితార్థ ప్రద ♦ మైనయట్టి
వరముఁ గోరి కృతార్థతన్ ♦ బడసినావు
అన్యవరముల నీవింక ♦ నడిగినయెడ
నదియె చర్విత చర్వణం ♦ బగునుగాదె 25

కం॥ హరియం దెవనికి దృఢమై
స్థిరమగు భక్తియును లక్ష్య ♦ సిద్ధి కలుగునా
పురుషుండు విలాసంబుగ
విరచింపఁగ శక్తుఁడగును ♦ విశ్వము నైనన్॥ 26

గీ॥ తరమె విష్ణుభక్తుల నెన్న ♦ సురలకైన
తనకులమ్మున మాతామ ♦ హునికులమున
నాఱుతరముల వారికు ♦ ద్ధారకులయి
శాశ్వతమగు గోలోకమె ♦ సంగుచుండ్రు॥ 27

గీ॥ హరిని సేవించి తదనుగ్ర ♦ హమును గాంచి
పరమ పావనుఁడైన యా ♦ భక్తవరుఁడు
కోటి జన్మసంచిత పాప ♦ కోటి నెల్ల
ఖండన మొనర్చి పుణ్యలో ♦ కమును బొందు॥ 28

గీ॥ ఎంతకాలము చిత్తము ♦ కృష్ణవిభుని
శ్రీకరాకార లగ్నంబు ♦ కాకయుండు
నంతకాలము నరులు భా ♦ ర్యాకుమార
ధన సుఖాదులపై వాంఛ ♦ దగిలియుంద్రు॥ 29

కం॥ హరిఁ జింతించెడు భక్తుఁడు
కరమున శ్రీకృష్ణభక్తి ♦ కరవాలంబున్
ధరియించి సమూలంబుగ
నరగణ దుష్కర్మతరుల ♦ నరకుచునుండున్॥ 30

గీ॥ ఏ మహాత్ముని పుత్రులీ ♦ యిలను బరమ
వైష్ణవాగ్రేసరులగుచుఁ ♦ బరఁగుచుంద్రు
వారలందఱు తమ పూర్వ ♦ వంశకోటి
నుద్ధరించుచు గోలోక ♦ మొసఁగఁగలరు॥ 31

చ॥ అరయఁగ వైష్ణవాగ్రణుల ♦ మహా మముబోంట్లకుఁ గూడఁ బొందఁ గ్రా
హరి పదభక్తి దుర్లభమె ♦ యాటను నీదగు వాంఛఁదీర్ప దు
స్తరముగుఁ గాన వేఱొక ప్ర ♦ శస్తవరంబును గోరుకొమ్ము న
త్వరముగ సంశయింపకుము ♦ తప్పక యిచ్చెద నీకు ధీమణీ॥ 32

గీ॥ క్షితిని హరిభక్తియనెడి సం ♦ చితధనమ్ము
నందఁగారాదు మముబోంట్ల ♦ కైనఁ గాన
కృష్ణ పదభక్తుఁడౌ సుతు ♦ నీయఁజాల
నితర వరమెద్దియైన నే ♦ నిత్తు నీకు॥ 33

గీ॥ జ్ఞానమో యమరత్వమో ♦ సర్వసిద్ధి
యో మహేంద్రత్వమో మహా ♦ యోగసిద్ధి
యో నిరంతర బ్రహ్మత్వ ♦ మో త్వదీయ
వాంఛితార్థం బదెద్దియో ♦ పలుకు మిత్తు॥ 34

వ॥ అనిపలికిన చంద్రశేఖరుని వాక్యముల నాలించి గంధర్వ నాథుండు
విషణ్ణవదనుండై దోసిలియొగ్గి యిట్లనియె. 35

గీ॥ ఎవఁడు కనుమూయ బ్రహ్మత్వ ♦ మెల్లఁదొలఁగి
సమసి పోఁగలదో యా య ♦ శాశ్వతమగు
బ్రహ్మపదవి నాశ్రీహరి ♦ భక్తుఁడెపుడు
నాసపడఁడు తలఁపడు గా ♦ రీ సనాథ! ॥ 36

చ॥ ప్రవిమలభక్తిఁగృష్ణపద ♦ పంకజము ల్భజియించునట్టి భ
క్తవరుఁడు దైవసేవలను ♦ దన్మయుఁడై పరమార్థకాంక్షియై
భువిఁగల భూరిభాగ్యముల ♦ భోగసుఖాదుల వైభవోన్నతిన్
దవులక నామగానమునఁ ♦ దాఁగనుచుండును నిత్యతృప్తిమైన్॥ 37

గీ॥ కృష్ణ సంకీర్తనానంద ♦ హృదయుఁడైన
భక్తవర్యుఁడు విష్ణుసే ♦ వలఁ ద్యజించి
యల చతుర్విధ ముక్తుల ♦ నైనఁదలఁపఁ
డాత్మకృత కర్మఫలముల ♦ హరికి నొసఁగి॥ 38

గీ॥ అరయ నింద్రత్వ మమరత్వ ♦ మాదిసకల
సిద్ధు లస్థిరములగుచు ♦ క్షీణభావ
యుక్తము లగుటచే హరి ♦ భక్తులకవి
వాంఛనీయము ల్కావహో ♦ పరమపురుష!॥ 39

కం॥ దాననె భక్తులు కలయం
దైనను జాగ్రత్తనైన ♦ హరిసేవలనే
మానసమున వాంఛింతురు
కాని తదితరముల నెపుడు ♦ కాంక్షింపరొగిన్॥ 40

ఉ॥ కావున నీ పవిత్రపద ♦ కంజములంటి వచింతు నాకిఁకన్
మావరభక్తుఁడైన సుతు ♦ మాటిమి పుత్రునొసంగుమయ్య యో
దేవ! మహానుభావ! శివ! ♦ దీనశరణ్యా! భవాబ్ధిపోత! గౌ
రీవర! వేఱు కోరికలు ♦ లేవిఁక నాదగుమానసంబునన్॥ 41

గీ॥ చివర నొక మాట పల్కెదఁ ♦ జిత్తగింపు
మేను గోరిన వరమీయ ♦ వేని నాదు
శిరము ఖండించి నీదు శ్రీ ♦ చరణములకు
నర్పణ మొనర్తు నిది నిశ్చ ♦ యంబు సుమ్మి॥ 42

కం॥ అని వచియించెడి గంధ
ర్వునిఁ గని చిఱునగవు వెలయ ♦ భూతేశుం డి
ట్లనె నీ దృఢసంకల్పం
బును మెచ్చితి నీయభీష్ట ♦ ములుసిద్ధించున్॥ 43

ఉ॥ నీదగు నిశ్చయం బెఱుఁగ ♦ నేనిటు పల్కితిఁ గల్గె సంతతా
మోదము కృష్ణభక్తుఁడగు ♦ పుత్రుని జ్ఞానిని సుందరాంగునిన్
వేదవిదు న్గళాకుశలు ♦ వీరుని సద్గురుభక్తు వల్లకీ
వాదన తత్త్వవేత్తయగు ♦ వాని నొసంగితి సంతసింపుమీ॥ 44

గీ॥ అనుచు వరమిచ్చి శంకరుం ♦ డరిగెఁ దనదు
భవనమునకు నామోదిత ♦ స్వాంతుఁడగుచు
స్వగృహమున కేగి గంధర్వ ♦ పతి యుదంత
మెల్ల నుత్సాహమున భార్య ♦ కెఱుకపఱచె॥ 45

కం॥ గిరిజానాథుని వరమున
వరపుత్రుఁడు పుట్టఁగల్గు ♦ భాగ్యంబునకై
తరుణియుఁ బరివారంబులు
నిరుపమ సంతోషమున ము ♦ నింగినయంతన్॥ 46

ఆ॥ వె॥ అంతలో వసంత ♦ మనుదేర విశ్వంబు
దివ్య కాంతి తోడఁ ♦ దేజరిల్లె
చిత్తజాతుఁ డంతఁ ♦ జెఱకువిల్లెబూనె
వడఁతుల హృదయములు ♦ పల్లవింప॥ 47

కం॥ అతులిత మోదాకరమై
సతతము కిసలయ ప్రసూన ♦ సంభరితంబై
ఋతురాజంబు వసంతము
పతులకు సతులకు విలాస ♦ భావమొసంగెన్॥ 48

చ॥ తరువులు పల్లవింపఁగ ల ♦ తల్ప్రసవింపఁగఁ బద్మకాంతిచే
సరములునిండఁ గామినులు ♦ సంతత మారశరార్తిఁ గుందఁగాఁ
బరభృతము ల్రసాలతరు ♦ పల్లవ ఖాదినులై కుహూయనన్
బరమ ముదావహం బగుచు ♦ భాసిలుచుండెవసంతమత్తరిన్ 49

వ॥ ప్రకృతిశోభ కాకరమైన యవ్వసంతకాలమున॥ 50

గీ॥ ప్రభువు గంధర్వరాజు భా ♦ ర్యాద్వితీయుఁ
డగుచు గంధమాదన గిరి ♦ యందుఁగల్గు
తనదు శృంగార మందిర ♦ మునకుఁ జనియె
సపరివారుఁడై ప్రముదిత స్వాంతుఁడగుచు॥ 51

మ॥ అల శృంగార వనాంతరస్థలమునం ♦ దాపుష్పపర్యంకమం
దు లతాంగి స్వన ప్రేయసి న్దిగిచి సం ♦ తోషంబున న్గౌగలిం
తలతోఁ జెక్కుల ముద్దులుంచి పరమో ♦ త్సాహంబు రెట్టింపఁగాఁ
గళల న్మట్టుచు మాయకేళిఁగలిసెన్ ♦ గంధర్వుఁడత్యంతమున్॥ 52

గీ॥ కొంతకాల మీరీతిని ♦ గాంతతోడఁ
గంతుకేళిని దేలఁగఁ ♦ గాంతకప్పుడు
పరశివానుగ్రహమున గ ♦ ర్భంబుగలుగ
నెలలు తొమ్మిది కడచెనా ♦ నెలఁత కప్పుడు॥ 53

— ఉపబర్హణుని జననము —

కం॥ నవమాసంబులు కడచి ప
దవమాసము వచ్చినంతఁ ♦ దనయునిఁ గనె నా
నవనీలోత్పల లోచన
నవలావణ్యుఁడగు సుతు న ♦ నంగసమానున్॥ 54

గీ॥ పరమ తేజోమయుండైన ♦ పురుషశిశువు
జననమందిన వార్తను ♦ వినినయంత
బంధు మిత్రాది సహచర ♦ వర్గమెల్ల
ఘనతరానంద భాగ్యము ♦ గాంచెనపుడు॥ 55

గీ॥ బ్రహ్మచేఁ దొల్లి శపియింపఁ ♦ బడినయట్టి
నారదుండె గంధర్వుని ♦ నారియందు
శంకరుని కృపఁ గొమరుఁడై ♦ జననమందెఁ
గర్మగతి దాఁటఁగలవారు ♦ కలరె జగతి॥ 56

మ॥ ధనధాన్యంబుల ధేనురాశి నొసఁగె ♦ న్ధాత్రీసురశ్రేణికిన్
ఘనరత్నాభరణాది వస్తుతతి దా ♦ నంబిచ్చి దివ్యాన్నభో
జనము ల్పెట్టెను సేవకావళికి ను ♦ త్సాహంబుతోఁ బ్రత్యహం
బును నీరీతిగ వెల్లడించెఁదనదౌ ♦ పుత్రోత్సవానందమున్॥ 57

కం॥ తపసియగు గురువసిష్ఠుం
డపుడయ్యెడ కరుగుదెంచి ♦ యర్భకుఁగని తా
నపరిమితానందముతో
నుపబర్హణుఁ డనెడి నామ ♦ ముంచిలిఖించెన్॥ 58

గీ॥ అరయ నధికార్థ ముపశబ్ద ♦ మగుటఁ బూజ్య
వాచక మగుట బర్హణ ♦ పదము ధరణి
నధికపూజ్యుఁ డీతండను ♦ నర్థమిచ్చు
పదము నుపబర్హణాఖ్యను ♦ వ్రాసె మౌని॥ 59

కం॥ సితపక్షబాలచంద్రుని
గతి నుపబర్హణుఁడు జనుల ♦ గౌరవప్రేమో
న్నతులనుబొంది కిశోర
స్థితిని గడచి బాల్యమునకుఁ ♦ జేరిన యంతన్॥ 60

కం॥ క్రమముగవిద్యాసంస్కా
రముఁ బొందెను గురువసిష్ఠ ♦ బ్రహ్మర్షికడన్
విమలమతియగుచు నామ్నా
యములను శాస్త్రాదివిద్య ♦ లన్నియుఁజదివెన్ 61

సీ॥ సాంగవేదముల స్వ ♦ రార్థ యుక్తంబుగ
నతిశ్రద్ధతో సధ్య ♦ యన మొనర్చె
శాస్త్రపాఠంబుల ♦ సారాంశముల నెల్ల
భక్తియుక్తుఁడగుచుఁ ♦ బఠనఁజేసె
అఱువది నాల్గు వి ♦ ద్యలయందు నిపుణుఁడై
యసమానమైన వి ♦ ఖ్యాతిఁ గాంచె
గానశాస్త్రంబునఁ ♦ గౌశలంబు గడించి
వల్లకీవాదనఁ ♦ బటుతఁగాంచె

వేత్తయయ్యె ధనుర్వేద ♦ విద్యయందు
దీక్షతోడమహాస్త్రోప ♦ దేశమందె
నీవిధంబుగ విద్యల ♦ నెల్ల నేర్చి
గురున కానందమును సమ ♦ కూర్చెనతఁడు॥ 62

— ఉపబర్హణుఁడు తపంబుసల్పుచుండ గంధర్వకాంతల యాగమనము —

ఉ॥ పదునారబ్దము లీగతి న్గడుప నా ♦ బాలుండు విద్యార్థియై
సదయుండైన వసిష్ఠమౌని యుపదే ♦ శంబిచ్చె నంతన్ శుభ
ప్రదమై శ్రీహరి సత్కృపాఫలము సం ♦ ప్రాప్తింపఁగా జేసి మో
క్షదమై యొప్పెడి మంత్రరాజమును దాఁ ♦ గారుణ్యభావంబునన్॥63

ఆ॥ వె॥ గురుఁ డొసంగినట్టి ♦ హరిమంత్రముఁ గొని గం
ధర్వసుతుఁడు తగిన ♦ తావుఁ జేరి
శ్రీరమేశుఁ గూర్చి ♦ ఘోరతపముసల్పె
నిశ్చలాత్ముఁ డగుచు ♦ నిష్ఠతోడ॥ 64

సీ॥ దీర్ఘకాల మీరీతిని ♦ దీవ్రతపముఁ
జేసి హరియనుగ్రహము నా ♦ ర్జించి సకల
వరములను బొంది దివ్యప్ర ♦ భావుఁడయ్యెఁ
గొఱఁత కల్గునె కృష్ణభ ♦ క్తులకు జగతి॥ 65

గీ॥ అంత నొకనాడు గండకీ ♦ ప్రాంతమందుఁ
దపము సల్పుచు నున్నట్టి ♦ తరుణమందు
తరుణు లేఁబదిమంది గం ♦ ధర్వకాంత
లట కరుగుదెంచి యతని ది ♦ వ్యాకృతిఁగని॥ 66

గీ॥ తనువు లెల్లను బులకింప ♦ మనము లెల్ల
మన్మథాయత్త మగుచును ♦ మరులుఁ జెంద
నా జగన్మోహనాంగుని ♦ యతివలెల్ల
దనివి తీఱఁగ వీక్షించి ♦ తలఁచి రిటుల 67

సీ॥ ఈ మనోహరు ముద్దు ♦ మోముఁ జూడఁగలేని
వాలుకన్నుల వైభ ♦ వంబదేల
కమనీయరూపుని ♦ గౌఁగలింపఁగలేని
కరములు గల్గిన ♦ ఘనతయేల
మోహనాకారుని ♦ మోవి యానఁగలేని
యధరోష్ఠమున్న భా ♦ గ్యంబదేల
నవమన్మథుని భాష ♦ ణంబులు వినలేని
కర్ణయుగ్మంబున్న ♦ కలిమియేల

మనసు తీరఁగ నీతని ♦ నెనసి మదన
కదనమునఁ దేలలేని యీ ♦ కాయమేల
నని వచింపుచు నుపబర్హ ♦ ణుని సురూప
వైభవముఁగాంచి గంధర్వ ♦ వనితలెల్ల॥ 68

గీ॥ చిత్తజోద్రేక పూరిత ♦ చిత్తలగుచు
నతని బెండ్లాడఁ దలఁచి శ్రీ ♦ హరిని గూర్చి
తపము సల్పుచు యోగాగ్నిఁ ♦ దమ తనువులఁ
ద్యాగమొనరించి రతినిశ్చి ♦ తాత్మలగుచు॥ 69

— గంధర్వకాంతలు మరణించి చిత్రరథునకుఁ బుత్రికలైజనించుట —

కం॥ తనువులను వీడి చిత్రర
థునకుఁ దనూజాతలగుచుఁ ♦ దొయ్యలులంతన్
జననమునందిరి యుపబ
ర్హణునిన్ బ్రాణేశ్వరునిగ ♦ గ్రహియించుటకై॥ 70

వ॥ అట్లా గంధర్వకాంత లేఁబదిమందియుఁ దనుత్యాగంబొనర్చి చిత్రరథునకుఁ దనయలై జనించి శశికళల మాడ్కి దినదినాభివృద్ధి నందుచుఁ గ్రమముగ 71

చ॥ తనయలు బాల్యకాలమును ♦ దాఁటి యనంగశరాళివోలె నూ
వనదశలోఁ బదంబులిడి ♦ ప్రాప్తమనోహర దివ్యసుందరీ
మణులయి విద్యలందు నస ♦ మానమహాప్రతిభన్ గణించుచున్॥
జనకున కెంతయో ముదమొ ♦ సంగఁగఁజాలిరి వారలత్తఱిన్॥ 72

కం॥ వారలలోమాలావతి
భూరి కళానిలయ జ్యేష్ఠ ♦ పుత్రిక సారా
చార సురూపసమన్విత
యై రమణీలోకరత్న ♦ మన నొప్పారెన్॥ 73

గీ॥ పూర్వకృతమైన పుణ్యాత ♦ పోబలమున
గతము నెఱిఁగినవారౌటఁ ♦ గన్నెలపుడు
జనకునకుఁ దమ సంకల్ప ♦ మునువచించి
పల్కి రుపబర్హణుండె మా ♦ భర్తయనుచు 74

కం॥ తన యనుమతిఁ జిత్రరథుఁడు
తనయల కెఱిఁగింప నపుడు ♦ తడయక వారా
తని గళమున నొక శుభదిన
మున వరమాలల నునిచిరి ♦ ముదమొప్పారన్॥ 75

మ॥ సుముహూర్తంబునఁ బెండ్లియాడిరపుడా ♦ సుశ్లోకు గంధర్వపు
త్రిమణిన్ సుందరరూప యావనకళా ♦ ప్రాగల్భ్యుని స్వీరునిన్
గమలానాథ పవిత్రనామ భజనా ♦ నందు న్సుధీరత్నమున్
బ్రమదాలోకమనోజ్ఞుఁ జిత్రరథజ ♦ న్యల్పిత్యసంతృప్తితోన్॥ 76

— ఉపబర్హణుఁడు భార్యలతో విహరించుట —

శా॥ ఆశాంతప్రథిత ప్రభావయుత ది ♦ వ్యానందమొప్పారఁ బం
చాశత్పత్నులఁ బెండ్లియాడి యతఁడు ♦ త్సాహంబునన్ బ్రేమతో
నా శంపాంగులఁ దాఁ గరంచెను విహా ♦ రారామ కుంజంబులన్
గేశాకర్షణ చుంబనాది మదన ♦ క్రీడా విశేషంబులన్॥ 77

సీ॥ చారుచందన వన ♦ స్థలములలో మనో
హారపుష్పవాటికాం ♦ తరములందుఁ
జంద్రకాంతోత్పల ♦ సౌధరాజములలోఁ
దత హంసతూలికా ♦ తల్పములను
దివ్యవనాంతర ♦ స్థిత కుంజములలోనఁ
బుణ్యా నదీతీర ♦ భూములందుఁ
బ్రకృతివిచిత్ర సం ♦ భరిత శైలోపరి
సంస్థిత తరువర ♦ చ్ఛాయలందు

గంధమాదన పర్వతా ♦ గ్రగంబులందుఁ
బత్నులంగూడి యా యుప ♦ బర్హణుండు
నిరుపమోత్సాహ సంతోష ♦ భరితుఁడగుచు
భోగవీచికా డోలల ♦ నూఁగులాడె॥ 78

గీ॥ ఇటుల నుపబర్హణుండు కా ♦ మేచ్ఛతోడ
మూఁడులక్షలు దివ్యాబ్ద ♦ ములు సుమేషు
లీలల దేలియాడుచుఁ ♦ గాలమైనఁ
గానలేదయ్యె నతఁడెంత ♦ కాముకుండొ॥ 79

కం॥ ఏలెను తనరాజ్యంబును
జాలఁగఁ బాలితులు సంత ♦ సంబును బొందన్
లోలాక్షులతోఁ గూడుచు
నేలెను మన్మథునిరాజ్య ♦ మింతులు మెచ్చన్॥ 80

వ॥ ఉపబర్హణుం డావిధంబుగ గంధర్వరాజ్యరమాలాలితుండై కామోప
భోగంబులఁ దేలియాడుచుండ 81

— చతురాననుఁడుపబర్హణుని బిలువనంపుట —

మ॥ అమితానందముతో విరించి యొకనాఁ ♦ డాత్మీయలోకంబునం
దు మును ద్దేవగణంబులున్న సభకా ♦ త్సుక్యంబుతోఁబిల్వబం
చె మహాత్మున్ స్తమలాక్ష దివ్యపద సం ♦ సేవాసమాసక్తుఁ గా
న మయుండో నుపబర్హణాఖ్య వర వీ ♦ ణావాదనానందునిన్॥ 82

కం॥ చతురానను పనుపున నా
చతురుఁడు గంధర్వవిభుఁడు ♦ చనె రభసమునన్
శతధృతి సభాస్థలమునకు
హితమతితోఁ దనవిమాన ♦ మెక్కి బిరానన్॥ 83

కం॥ వచ్చినవానికి గౌరవ
మిచ్చి సుఖాసీనుఁ జేసి ♦ యిట్లనియెను తా
నచ్చతురాస్యుఁడు వత్సా!
యిచ్చట నొక్కింత పాడు ♦ మింపొదవంగన్॥ 84

గీ॥ అమలచరిత! నీగానము ♦ నాలకింపఁ
గోరియున్నార లీసభ ♦ వారు కాన
మునులు సురవరు లానంద ♦ మునఁ జెలంగఁ
బాడుమా యన్న నాతండు ♦ వల్లె యనియె॥ 85

ఉ॥ వీణనుమీటి తంత్రులను ♦ వేడ్క మెయి న్సరిచేసి తచ్ఛ్రుతి
స్థానములన్ గ్రమంబరసి ♦ శాస్త్రవిధి న్గమనించుచున్ స్వర
జ్ఞానముతోడఁ దానలయ ♦ జాతులఁ జూపుచుఁ గృష్ణలీలలన్
గానము జేసెఁ దన్మయతఁ ♦ గాంచఁగ సభ్యులు మోదమగ్నులై 86

సీ॥ రహిని ముప్పది యాఱు ♦ రాగముల్ మధ్యమ
స్వరభేదయుక్తమై ♦ పరఁగువాని
దశవిధ గమకము ♦ ల్విశదం బొనర్చుచుఁ
బ్రస్తారవిధమును ♦ విస్తరించి
గ్రామమండలమున ♦ గాంధార మధ్యమ
స్వరములపై నిల్పి ♦ సరణిఁజూపి
సూళాదులౌ సప్త ♦ తాళ భేదంబుల
గతుల మార్పుల తోడఁ ♦ గానఁ జేసి

రాగముల కాలము లెఱింగి ♦ రక్తిమీఱ
శ్రుతివిభేదము ల్గమనించి ♦ చూపి యతఁడు
కృష్ణలీలామయంబులౌ ♦ కీర్తనములఁ
బాడె సభలోన నా యుష్ట ♦ బర్హిణుండు 87

గీ॥ గానవాదనమును సల్పు ♦ కాలమందు
గోట మీటి వాయించు నం ♦ గుళులుకాక
కదల వితరావయవములా ♦ గాయకునకుఁ
బూజ్య గాయక లక్షణ ♦ ములివికావె॥ 88

చ॥ పరవశుఁడై యతండు తన ♦ స్వాంతము కృష్ణుని పైననిల్పి శ్రీ
హరిగుణ కీర్తనామృత మ ♦ హాలహరిన్ బ్రవహింపఁజేయ న
త్తతి నటనున్న సభ్యులతి ♦ తన్మయులై పవిత్ర సచిత్తులై
మఱచిరి దేహభావముల ♦ మాటలఁ జేష్టలఁ వీడిరందఱున్॥ 89

శా॥ రాగాలాపన సేయువేళఁ దన హృ ♦ ద్రంగంబునన్భక్తితో
శ్రీగోపాలుని నిల్పి సంతతప్రమా ♦ చేతస్కుఁడై కృష్ణలీ
లాగానంబొనరించుచున్ బరవశో ♦ ల్లాసంబునన్మగ్నుఁడై
యాగంధర్వుఁడు తాళభంగమున గ ♦ తారంభమున్ జేయు చోన్॥ 90

— నలువ గంధర్వనాథుని శపించుట —

గీ॥ సరభసుండయి గోపికా ♦ విరహగీత
గానమున మైమఱచిన ♦ కారణమునఁ
దాళభంగము కల్గుట ♦ నాలకించి
యధిపుఁడగు బ్రహ్మపలికెఁ గో ♦ పాత్ముఁడగుచు॥ 91

శా॥ సంగీతంబును నేర్చవో వినవొ శా ♦ స్త్రజ్ఞాన మే లేదొ యీ
భంగి న్దాళముఁదప్పి పాడఁగ స ♦ భన్ బ్రజ్ఞావతు ల్మెత్తురే
యంగీకారమె దేవగాయకులకీ ♦ యన్యాయమార్గంబు వే
దాంగం బియ్యది పాట నీవెఱుఁగవో ♦ యంధత్వమున్పొందితో॥ 92

గీ॥ తాళగతిఁ దప్పి పాడు ట ♦ ధర్మము నెడి
శాస్త్రనియమం బతిక్రమించియు ♦ జనుసఁబోలె
గానమునఁ దాళగతి నీవు ♦ కానకుంట
న్నాదు శాపముఁ గొనుము గం ♦ ధర్వరాజ!॥ 93

కం॥ రాగాశ్రయమై యతి వై
భోగములకు నిలయమగుచుఁ ♦ బొలుపొందెడి నీ
యీ గంధర్వ శరీరముఁ
ద్యాగంబొనరించి శూద్ర ♦ తరుణీమణికిన్॥ 94

కం॥ తనయుఁడవగుచును వైష్ణవ
జనముల బ్రాహ్మణుల దివ్య ♦ సాంగత్యమునన్
ఘనతరసేవా సువ్రత
మును భక్తినొనర్చినట్టి ♦ పుణ్యఫలమునన్ 95

గీ॥ భక్తుఁడవగుచుఁ దదుపరి ♦ భవమునందు
మత్సుతత్వముఁ గని లోక ♦ మాన్యుఁడవయి
భక్తిశాస్త్రమం దాచార్య ♦ పదవినంది
దేవమునివై త్రిలోకము ♦ ల్దిరుగఁ గలవు॥ 96

గీ॥ అని నలువ శాపమీయ మ ♦ హాత్ముఁడైన
భక్తవరుఁడైన యా యువ ♦ బర్హణుండు
మారువల్కక తలయొగ్గి ♦ ధీరుడైన
సదయుల హృదయ సహన మి ♦ ట్టిదియ కాదె॥ 97

గీ॥ కష్టసుఖములు నరులకుఁ ♦ గలుగుచుండు
టవని సహజంబె కాని పు ♦ ణ్యాత్ములకిల
ఘోరతర కష్టములు నమ ♦ కూడు నపుడె
వారిమహిమల్ల ఘనతయుఁ ♦ బ్రకటమగును॥ 98

గీ॥ పంచపాది
అవ్విధంబున శపియించి ♦ యబ్జభవుఁడు
చనెను సభ వీడి శారదా ♦ సదనమునకు
దుర్భర సభాపరాభవ ♦ దుఃఖమునకుఁ
దాళఁజాలక పయనమై ♦ తనవిహార
వనమునకుఁ బోయె నాయువ ♦ బర్హణుండు॥ 99

—♦ ఉపబర్హణుండు యోగమార్గమునఁ దన శరీరమును వదలుట ♦—

గీ॥ కమలజుండన్న శాపవా ♦ క్యములు తనదు
స్వాంతమును వహ్నికీలల ♦ వలె దహింపఁ
దనువు విడనాడ మదినెంచెఁ ♦ దాళఁగలఁడె
మానవంతుఁడౌ వాఁడవ ♦ మానసరణి. 100

కం॥ మరణమునకు నిశ్చితుఁడై
పరిశుద్ధ స్థలముఁ జేరి ♦ పరమేశ్వర మం
దిరమున కెదురుగ నొకచోఁ
బఱచెను దర్భలను ద్యక్త ♦ వాసనుఁ డగుచున్. 101

కం॥ ధనభోగ రాజ్యములపై
వనితలపై దగిలియున్న ♦ వాంఛలనెల్లన్
మనమునఁ జేరఁగ నీయక
తనలక్ష్యము కృష్ణునందె ♦ ధారణఁ జేసెన్. 102

గీ॥ అంబువులఁబట్టి యాచమ ♦ నంబొనర్చి
మోహదూరుఁడై నష్టసం ♦ దేహుఁడగుచు
కృష్ణసంకీర్తనానంద ♦ హృదయుమెనయఁ
దన్మయుండై సమీపించె ♦ దర్భశయ్య. 103

సీ॥ వామహస్తంబున ♦ వల్లకినిం బూని
కుడిచేత జపమాలఁ ♦ గుదురఁ జేసి
చిత్తపద్మంబున ♦ శ్రీకృష్ణ కమనీయ
మంగళాకృతి నమ ♦ రంగఁ జేసి
ప్రాగుత్తమాంగుఁడై ♦ పశ్చిమచరణుఁడై
పావనదర్భలఁ ♦ బవ్వళించి
వేదాంత చోదిత ♦ విజ్ఞానసారమై
పరగెడి శ్రీకృష్ణ ♦ వర్ణములను

గీ॥ భక్తిఁ బఠనమ్మొనర్చుచుఁ ♦ బరమయోగి
పగిదిఁబ్రాగ్జన్మ విదుఁడయి ♦ వాయువులను
బంధనముఁ జేసి హఠయోగ ♦ పద్ధతి గమ
నించి నిర్వికల్ప సమాధి ♦ నిష్ఠుఁడయ్యె. 104

వ॥ మహా యోగవిద్యా విశారదుండైన యా యుపబర్హణుండు యథా విధిగఁ బ్రాణాయామంబును బట్టి వాయువునుబూరించి దృగ్గత్యము ను ద్రికూటస్థానమున నిలువఁబెట్టి హంసను మూలాధారచక్రము నుండి క్రమక్రమముగ స్వాధిష్ఠాన మణిపూరక విశుద్ధ అనాహత ఆగ్నేయ సహస్రారములను షట్చక్రములను ఇడా, పింగళా, సుషుమ్నా, మేఘా, ప్రాణధారిణీ, సర్వజ్ఞాన ప్రదా, మనస్సంయమినీ, విశుద్ధా, నిరుద్ధా, వాయుసంచారిణీ, తేజశ్శుష్కకరీ, బలపుష్టికరీ, బుద్ధి సంచారిణీ, జ్ఞానజృంభణకారిణీ, సర్వప్రాణహారిణీ, పునర్జీవనకారిణీ విదిత షోడశ నాడులను దాటించి మనస్సుతోఁగూడిన యోగ రంధ్రమను గుహనుజేర్చి ముహూర్తకాల మాత్మానుసంధాన మును జేయు. 105

గీ॥ తత్క్షణంబున బ్రహ్మరం ♦ ధ్రంబువగులఁ
దేజరిల్లుచు నాతని ♦ దివ్యహంస
స్థూలదేహము విడనాడి ♦ శుద్ధమైన
యా పరబ్రహ్మలో నైక్య ♦ మందెనపుడు. 106

—♦ గంధర్వ పత్నుల విలాపము ♦—

గీ॥ (పంచపాది!).

అటుల నా యుపబర్హణుం ♦ డస్తమించి
నట్టి దుర్వార్త నతని భా ♦ ర్యాగణంబు
బంధుబృందము ల్పరివార ♦ వర్గమెల్ల
నాలకించి దుర్భరవిచా ♦ రాగ్నిదగ్ధు
లగుచు గొల్లున నేడ్చిరి ♦ వగలఁబొగిలి. 107

ఆ॥ వె॥ అతని భార్యలపుడు ♦ పతి మృతదేహమున్
జూచి ఘొరలివచ్చు ♦ శోకమునకుఁ
దాళలేక భర్త ♦ తనువు నాశ్లేషించి
కడుపు వగుల నేడ్వఁ ♦ దొడఁగిరంత. 108

గీ॥ పట్టమహిషి మాలావతి ♦ పతికళేబ
రంబు నొడిఁజేర్చి యుచ్ఛ్వాస♦నంబుగదురఁ
బరమశోకాహతాత్మయై ♦ భర్తనెంచి
పెక్కుభంగులఁ దా విల ♦ పింపఁదొడఁగె. 109

శా॥ ఓ నాథా! రసికాగ్రగణ్యా! రమణా! ♦ యోమన్మథాకార! యో
నానాశాస్త్ర కళానిధాన! వరవీ ♦ ణా వాదనానంద! యో
శ్రీనారాయణ పాదపద్మయుగ సం ♦ సేవాసమాసక్త! మ
మ్మిమ్మాడ్కిగతి వీడిపోవఁదగునా! ♦ యెట్లోర్తుమీదుఃఖమున్. 110

ఉ॥ నాఁడు వసంతకాలమున ♦ నాయక! చక్కని పూలతోఁటలో
నీడల మమ్ముఁజేర్చుకొని ♦ నీవొనరించిన యా విలాసపుం
గ్రీడల మోహలీలలను ♦ ప్రేముడినించు ప్రసంగవైఖరిన్
నేఁడెటు మామది స్మరువ ♦ నేర్తుమొ? తెల్పవె యోమనోహరా!.

ఉ॥ నీదు మనోహరాకృతిని ♦ నీదు సుధామయ వాక్యజాలమున్
నీదు విహారవైభవము ♦ నీదు కళాకుశలత్వ మెన్నఁగా
రా దిఁక నేమిసేయుదుము ♦ వ్రాతఫలం బిటులయ్యె దైవమా!
యేదియొ దిక్కుమాకు జగ ♦ దీశ్వర! యెయ్యెది త్రోవ తెల్పవే.

ఆ॥ వె॥ పరమ దారుణంబు ♦ బాంధవ మరణంబు
అంతకన్న హెచ్చు ♦ వంతనిచ్చుఁ
బితరుల మరణంబు ♦ భేదించు హృదయమున్
భర్తృమరణమిలను ♦ బడఁతులకును. 113

కం॥ మరణముకంటె నిల భయం
కరమా వనితామణులకుఁ ♦ గాంతునిమృతి త
త్పరమా సంకటమికవే
రరయంగాలేదు నీర ♦ జాస్యల కిలలోన్. 114

గీ॥ శయన భోజన పానము ♦ జనక్రియలను
బతిమరణదుఃఖ మత్యంత ♦ భయదమగుచుఁ
బ్రతిదినంబును నూతన ♦ త్వము వహించి
పడఁతులను దుఃఖదావాగ్ని ♦ పాలొనర్చు. 115

గీ॥ ఇంతు లెద్దానినైన స ♦ హింపఁగలరు
కాని ప్రాణేశు మరణ దుః♦ఖంబు నెపుడు
సైఁపఁజాలరే ! యీ పరి ♦ తాపభార
మెటుల భరియింతుమయ్య ? ప్రా ♦ణేశ ! నేఁడు. 116

సీ॥ మానాథునకు జీవ ♦ దానంబొసంగరే ?
పావనులార ! ది ♦ క్పాలులార !
మామనోహరు నిచ్చి ♦ మమ్ము రక్షింపరే?
వాసవవినుత ! వా ♦ ణీసనాథ !
మావిభు బ్రదికించి ♦ మమ్ముఁగాపాడరే ?
హైమవతీశ ! వి ♦ శ్వాధివాస !
మా ప్రాణనాథుని ♦ మాకీయఁ గా రావె?
మంగళాకార ! ర ♦ మాసమేత!

గీ॥ మాపతి సజీవుఁగావించి ♦ మాకొసంగి
మా సుమంగలీత్వము సదా ♦ మనుపరమ్మ !
మా సరస్వతీ పార్వతీ ♦ మాతలార!
కృపఁ దలిర్పఁగఁ బతిభిక్ష ♦ నీయరారె?. 117

—• మాలావతీ శాప ప్రయత్నము •—

గీ॥ ఇటుల దుఃఖార్తయై యెలుఁ • గెత్తి యేడ్చి
ధరణి మూర్ఛిల్లి మరికొంత • తడవునకును
తెప్పరిలి ప్రాణనాథుని • దేహముఁ దన
వక్షమునఁ జేర్చి పలికెఁ గో • పంబుగదుర. 118

గీ. వినుఁడి మునులార ! స్వర్లోక • గణములార !
మోక్షదాతలౌ హరి శివ • మూర్తులార !
అఖిలధర్మాత్ములార ! మీ • రందరిపుడు
ధర్మనిర్ణయమును జేయఁ • దరలిరారె ! 119

గీ॥ గానమును వినఁగోరి మా • ప్రాణనాథు
సభకుఁ బిలిపించి పాడించి • శాపమొసఁగి
సాగనంపు టెఱుంగరే • సాహసించి
ధాత చేసిన కార్యంబు • ధర్మమగునె ? 120

గీ॥ మహిత కృష్ణలీలాగాన • మగ్నచిత్తుఁ
డగుట నాపతి తాళంబు • నరయుపట్ల
లోప మొనరించినంతనే • కోపమూని
శాప మీయఁదగునె? యబ్జ • సంభవునకు. 121

గీ॥ ఇంత స్వల్పలోపంబున • కీవిధమున
దారుణముగ శపించుట • తగునె విధికి ?
దేవతలకైన నేరము • లేవె ? తప్పు
లేనివారల నెట్టనైనఁ • గానగునె?. 122

ఆ॥ వె॥ కృష్ణ దివ్యనామ • కీర్తనాసక్తుఁడౌ
పావనునకుఁ గలదె • పాపమెన్న?
నట్టి పుణ్యమూర్తి • కిట్టి శాపమొసఁగె
బ్రహ్మదేవుఁ డెట్టి • పాపమతియొ? 123

కం॥ అక్కరలే దింద్రత్వం
బక్కరయే లేదు మోక్ష మమరత్వము మా
కక్కర లేదిఁక మావిభుఁ
డొక్కఁడె కావలయు నీయుఁ డోసురలారా! 124

సీ॥ గాంభీర్యమునను సా గరసమానుండు శ్రీ
హరిభక్తిలోన నా హరిసముండు
భాసించుపట్లను భాస్కర తుల్యుండు
పరిశుద్ధతను హవ్య వాహనుండు
చల్లదనంబునఁ జంద్రుఁబోలినవాఁడు
సౌందర్యమున సుమ శరసముండు
భోగవైభవములఁ బురుహూతసామ్యుండు
కావ్యపాఠంబునఁ గవిసముండు

గీ॥ బుద్ధియందు బృహస్పతిం బోలువాఁడు
తపమునను గార్తికేయుని దాటువాఁడు
బ్రహ్మతుల్యుఁడు ధర్మాచ రణమునందు
నిట్టి మాపతి జీవంబు లీయరారె! 125

శా॥ ఓనారాయణ! యోరమేశ్వర! హరీ! యోనిర్వికల్పప్రభూ!
నానారూప! చరాచరాత్మక! శివా, నాథా! మహేశా! శివా!
జ్ఞానానందమయా! మదీయ పతిభి క్షఁ బెట్టరారేని మీ
రీనాఁడేను ప్రతిజ్ఞఁజేసెద వినుం డీ! నావచోవైఖరిన్. 126

గీ॥ పద్మభవ! వినుమిదె నాదు వాక్యములను
పుత్త్రి శాపకారణముగఁ బుడమిలోనఁ
బూజ్యతను గోలుపోతి వి ప్పుడుశపించి
నేను నీ యధికారంబు నేలఁగూల్తు. 127

చ॥ యముఁడ! త్వదీయశక్తిని ల • యంబానరించెద శాపమిచ్చి వి
శ్వమును గలంతు శంకరుని • జ్ఞానవిహీను నొనర్తు ధర్మస
త్యములను దేవలోక మును • దగ్ధముఁజేసెద నాదు భర్త్రుజీ
వముల నొసంగకున్న నిదె • భస్మమొనర్చెద సృష్టినంతయున్.128

గీ॥ అని వచింపుచు దుఃఖ ద • గ్ధాత్మ యగుట
కనుయుగమునుండి విస్ఫులిం • గములు వ్రాల
భర్త్రు మృతదేహమును పైన • వైచుకొనుచుఁ
జేరె శపియింపఁ గౌశికీ • తీరమునకు. 129

— బ్రహ్మదేవుఁడు దేవతలతో శ్రీహరిం జూడవచ్చుట —

శా॥ ఈ వృత్తాంతము జ్ఞానదృష్టిఁగని వా • ణీశుండు భీతాత్ముఁడై
దేవేంద్రాది సమస్తదేవతలతో • దేవర్షిబృందంబుతో
శ్రీవత్సాంకుని క్షీరవార్ధిశయనున్ • సేవింపఁగావచ్చి రా
జీవాక్షు న్వినుతించి రా సురవరుల్ • చేమోడ్పు సంధించుచున్. 130

సీ॥ సత్యనిత్యాకార! • శరణాగతత్రాణ
దీక్షాపరాయణ! • దేవదేవ!
ప్రకృతి భిన్నుఁడవయి • పరగుచుండు మహాత్మ!
చిద్రూపమునను భా • సిల్లువాఁడ!
జ్ఞానప్రదాతవై • దీనావనుఁడవై స
దానందమూర్తివై • యమరువాఁడ!
భువనంబులెల్లను • బొజ్జలోఁ గలవాఁడ
భక్తులకష్టము • ల్బాపువాఁడ

గీ॥ జ్ఞాతవై నేతవై జగ • త్త్రాతవగుచు
విశ్వనిర్మాణ పాలన • విలయములకుఁ
గారణుఁడవైన నీపద • కంజములకు
వందనము లిత్తు మోవట • పత్రశయన! 131

గీ॥ చిత్రరథపుత్త్రి కడు సచ్చ ♦ రిత్రి సాధ్వి
భర్తృ మరణకారణమునఁ ♦ బరమకోప
పూరితాత్మయై శపియింపఁ ♦ బూనె మమ్ముఁ
గరుణ రక్షింపుమయ్య! శ్రీ ♦ కమలనయన! 132

వ॥ అని ప్రార్థింపుచు ముకుళిత కరాంజలులై జగద్రక్షణ పరాయణుం డగు జనార్దనుని యెదుట మోకరించి పతివ్రతాతిలకమగు మాలావతి యొసంగనున్న శాపమువలన విశ్వమునకుఁ గలుగ నున్న ప్రళయంబును వివరింపనెంచి యిట్లనిరి. 133

కం॥ వారిజభవుఁ డప్పుడిట్లనె
వారిజదళనేత్రుఁ గాంచి ♦ పంకజనాభా!
దూరంబాయెను పూజ్యత
నారదశాపమున నాఁడె ♦ నాకిఁక నేఁడో. 134

గీ॥ నీవొసంగిన యధికార ♦ నియతికూడ
తొలఁగిపోయెడి కాలంబు ♦ కలుగనుండె
సాధ్వియైన మాలావతి ♦ శాపమునను
కాన నాకింకఁ గర్తవ్య ♦ మానతిమ్ము. 135

కం॥ తదుపరి ధర్ముండిట్లనె
సదయాత్మా! ధర్మదహన ♦ సమయమువచ్చెన్
మదవతి శాపవశంబున
మదిచెదరెను తెలుపఁగదవె ♦ మార్గంబేమో.. 136

కం॥ కాలుండిట్లనె దేవా!
కాలునియధికారపదవి ♦ కడలింబడు దు
ష్కాలము సమీపమాయెను
మాలావతివలన నిప్పుడు ♦ మాహృదయేశా! 137

మ॥ గిరిజానాథుఁడు విష్ణుఁగాంచి యిటుప • ల్కె న్దేవ! మున్నీవు పు
ష్కరతీర్థంబున నాకొసంగిన మహా • జ్ఞానంబు మాలావతీ
గురుశాపంబున లుప్తమయ్యెడుఁగదా! • గోలోకనాథా! భవ
చ్చరణాబ్జంబుల నమ్మినాను జగదీ • శా! కృష్ణ! రక్షింపవే. 138

గీ॥ దేవతాబృంద మిట్లనె • దేవదేవ!
భువనజాలము విలయమ్మై • పోయెనేని
క్రతుభుజులకింక సవనభా • గంబులెల్ల
క్షీణమైపోవె? లోకేశ! • శ్రీరమేశ! 139

—• విష్ణుమూర్తి బ్రహ్మాదులకుఁ గర్తవ్యముఁ దెలుపుట•—

చ॥ సురగణ మెల్లరీగతిని • శోకభరంబున విన్నవింప నా
హరిపలికెన్ ప్రసన్నవద • నాంబుజుఁడై విధిఁగాంచి ధాత్రిలోఁ
బరమపతివ్రతామణి ప్ర • భావము నాపఁగఁజాలు శక్తియె
వ్వరికెని గల్గ దీజగతి • వారికిఁ బోలిక వారలేసుమా. 140

ఉ॥ తొందరపాటుఁజెందుటతి • దుఃఖకరంబను టెంచకీగతిన్
మందుఁడవై కుమారకుని • మాన్యుని నారదుని న్శపించుటే
కొందలపాటు నేఁడు సమ • కూడుటకుఁగతమయ్యెఁగానమీ
రందరుఁబోయి యామె హృద • యంబునుజల్లగఁజేయు టొప్పగున్.

వ॥ ఎట్లయిన నమ్మాలావతిని సమాధానపరచి యుపబర్హుని సజీవుం
జేయకున్న లోకహాని వాటిల్లును. కావున మీరందరును యథా
స్థానంబులకుఁబొండు. నేను మీయభీష్టంబును దీర్తునని పల్కి దేవ
గణంబులను బంపి వారిలో శివ విధి యమ సత్య ధర్మదేవతలను
సన్నిధికిం బిలిచి వారితోనిట్లనియె. 142

గీ॥ మీరలిప్పుడు కౌశికీ • తీరమునకు
వెడలిపొం డేను బ్రాహ్మణ • వేషముననె
వచ్చి నెఱవేర్చువాఁడ మీ • వాంఛితమును
ధాతృ యమ సత్య శంకర • ధర్ములార! 143

ఆ॥ వె॥ అనివచించివారి ♦ నపుడుమాలావతి
యున్నయెడకుఁ బంపి ♦ వెన్నఁడపుడు
విప్రుఁడగుచు బయలు ♦ వెడలె నచ్చోటికి
భక్తరక్షణమను ♦ ప్రతినఁబూని. 144

ఆ॥ వె॥ కనిరి వారలంత ♦ కౌశికీదివ్యన
దీతటమ్ముఁ జేరి ♦ స్నాతయగుచుఁ
బతిశరీరము నొడిఁ ♦ బట్టి విశ్వమును శ
పింపఁ బూనియున్న ♦ వెలఁదినపుడు. 145

సీ॥ నిడుద పెన్నెఱివేణి ♦ ముడి వీడి వ్రేలాడి
జడఁగట్టుచున్న కే ♦ శములదాని
నేటినీటను స్నాత ♦ యాటచే నొడలంటి
కాన్పించు దివ్యాంశు ♦ కంబుదాని
దీపించుచున్న పా ♦ తివ్రత్య తేజమో
యన వెల్గుచున్న దే ♦ హంబుదాని
భువనంబులను మాడ్చి ♦ బూదిసేయఁగ శాప
మీయఁగ మదిలోన ♦ నెంచుదాని

గీ॥ పతిశరీరంబు నొడిఁజేర్చి ♦ వహ్నిఁజేర
నుద్యమించుచుఁజితిఁబేర్చి ♦ యున్నదాని
నల పరాశక్తియో యన ♦ వెలయుచున్న
దాని మాలావతింగాంచి ♦ దైత్యరిపులు. 146

గీ॥ సంభ్రమాశ్చర్య కంపిత ♦ స్వాంతులగుచు
దరికిఁ బోలేక నిలిచిన ♦ సురలఁ గాంచి
వెఱువకుఁ డటంచు వారల ♦ వెఱపుఁదీర్చి
బ్రాహ్మణాకార విష్ణువ ♦ స్సడఁతిఁగాంచి. 147

—♦ శ్రీహరి మాలావతిని శాంతింపఁజేసి యుపబర్హణుని జీవింపఁజేయుట ♦—

కం॥ శాంతింపుము సాధ్వీమణి !
సంతాపమువీడి లోక ♦ సంక్షోభంబున్
శాంతింపఁజేయుమిదె నీ
వంతం దొలఁగింప సురలు ♦ వచ్చిరి కనుమా! 148

గీ॥ అనివచించెడి కృతక వి ♦ ప్రునిపలుకుల
నాలకించి మాలావతి ♦ యబ్బురంపడి
వెనుకకనుజూడ వర విప్ర ♦ వేషధారి
యైన తేజస్వియొక్కఁడు ♦ కానుపింప. 149

ఆ॥ వె॥ విభ్రమంబుఁజెంది ♦ వీక్షించుచుండఁగఁ
గపటవిప్రుఁడపుడు ♦ కాంతఁజూచి
వినఁగదమ్మ! నీకు ♦ విన్పింతు శుభమైన
మాటనొకటి హితము ♦ తేటఁబడఁగ. 150

ఉ॥ చింతిలకమ్మ భర్త మృతిఁ ♦ జెందెనుగా యని సంచితార్థ మా
వంతయుఁబోదు ప్రాణి కను ♦ భావ్యముకాకయె ప్రాణనాథు వృ
త్తాంతము నీవెఱుంగమి వ్య ♦ థాభరమానసవైతి వింక నీ
కాంతుని పూర్వవృత్తమును ♦ కాంతరో! తెల్పెద నాలకింపుమా.

గీ॥ పూర్వభవమున నితఁడొక ♦ మునివరుండు
బ్రహ్మమానససుతుఁడు నా ♦ రదుఁడు జనక
శాపమునను గంధర్వుఁడై ♦ జననమంది
మీకుఁ బ్రాణేశుఁ డయ్యె నో ♦ మించుబోడి! 152

కం॥ వనిత ! యితఁడుపరజన్మం
బున శూద్రీ పుత్త్రుఁడగుచు ♦ భూసురసేవన్
ఘనుఁడయి హరిపదసేవా
ధనుఁడై మరణించి మోక్ష ♦ ధామముఁజెందున్. 153

కం॥ పదపడి బ్రహ్మసుతుండై
యుదయించిమహర్షులందు • నుత్తముఁడై నా
రద దేవర్షి యనంగా
ముదమునఁదిరుగాడుచుండు • ముల్లోకములన్ 154

గీ॥ తండ్రి యాజ్ఞావిధిని జవ•దాటినట్టి
కార్యఫలిత మీరీతిగ • గర్భనరక
వాస రూపంబుగా నేఁడు • పరిణమించె
వసుధఁ బ్రారబ్ధ మనుభవిం • పంగవలదె? 155

గీ॥ కర్మ మనుభవింపక పోదు • కల్పకోటి
వత్సరంబుల కైనను • వసుధలోన
మంచియైనను జెడుగైన • సంచితమ్ము
ననుభవింపనే వలయుఁ ద•థ్యంబుసుమ్మి, 156

గీ॥ విశ్వమునఁ బ్రాణికోట్ల జీ•విత చరిత్ర
జనన మనియెడి నాంది ప్ర•స్తావనముల
మరణ మను నాటకాంతపు • భరతవాక్య
పఠనమును గూడియున్న రూ•పకముకాదె? 157

సీ॥ కన విశ్వనాటక•మునకు సర్వేశుఁడే
పాత్రల నాడించు • సూత్రధారి
పాత్రలు మనము వి•శ్వము రంగ మంకముల్
పవలు రాత్రియనఁగఁ • బడుచునుండు
తెరలు రెండుండు వె•ల్తురు చీకటి యనఁగఁ
గర్మానుభవమను • ఘనచరితము
చిత్రగతులఁ బ్రద • ర్శింపఁగఁ బడుచుండు
ననుభవాంతమె జీవి • కాంతమగును

గీ॥ కష్టసుఖముల నాట్యరం◆గమున నెటుల
నటుఁ డభినయించి తన మది ◆ నెటుల కాని
యటుల వదలునో యారీతి ◆ నవనిలోన
మరువవలయును వానిని ◆ మనము పుత్రి ! 158

ఆ॥ వె॥ వసుధలోన నరుఁడు ◆ ప్రారబ్ధ మనుభవిం
చుచును తా విచార ◆ శూన్యుఁడగుచుఁ
దనను తాను తెలిసి ◆ కొని సంచరించుటే
ప్రాజ్ఞ లక్షణ మను ◆ పలుకు వినవె? 159

ఆ॥ వె॥ పాంచ భౌతికమగు ◆ భవన మీ దేహంబు
జీవుఁడీ తనువునఁ ◆ జేరియుండు
దేహ మెన్నఁడైన ◆ దాహ మగును కాని
జీవుఁడెన్నటికిని ◆ జెడనివాఁడు. 160

గీ॥ కావున వివేకవంతులు ◆ కష్టసుఖము
లందు బుద్ధిని జొరనీక ◆ యనవరతము
తత్త్వవేత్తలై దేహాత్మ ◆ దాత్మ్యబుద్ధి
వదలి శాశ్వతానందంబుఁ ◆ బడయుచుంద్రు. 161

వ. కావున నోయమ్మా ! భర్తృమరణ సంజనితమైన శోకరూపాజ్ఞాన మేఘం బావేశించి భవదీయ దివ్యజ్ఞాన భాస్కర తేజమును గప్పి పుచ్చుటంజేసి యథార్థమును గుర్తింపఁజాలకుంటివి. చనిపోయి నదెవ్వరు ? నీభర్తృకళేబరమా ? తదంతర్భూతుఁడగు జీవుఁడా ? యని విచారించుకొనలేకపోతివి. నాశలీనమైననభము నాశవినాశనా నంతర మనంతాకాశమునఁ గలసినట్లు దేహావృతుండగు జీవుండు శరీరత్యాగానంతరము పరమేశ్వరునిలోఁ గలయుచుండుటంజేసి జీవుని నిత్యునిగా గ్రహింపవలయును. మదీయ సామర్థ్యమువలన నీకిదె దివ్యమైన యాధ్యాత్మికదృష్టి నిచ్చుచుంటిని. దానివలన

నొక్కమా యాత్మావలోకన మొనర్చుకొనుమని పలుక మాలావతి భగవద్దత్త దివ్యజ్ఞానదృష్టివలన నిజంబును గ్రహించి శంకారహితయై శాంతభావంబున న విప్రరూపజనార్దనుని పాదారవిందములకు నమస్కరించి యిట్లనియె. 162

ఆ॥ వె॥ ఓమహానుభావ! ♦ నీమహాబోధచే
ధన్యురాలనైతి ♦ తండ్రి! నీవు
బ్రాహ్మణుఁడవుకావు ♦ పరమాత్ముఁడవ నెడి
తలఁపుగలిగె నిజము ♦ పలుకుమయ్య! 163

—♦ విప్రవేషధారియగు శ్రీహరి మాలావతికిఁ
దననిజరూపముం జూపుట ♦—

చ. మదవతి యిట్లు వేడుకొన ♦ మాధవుఁడంతట బ్రాహ్మణాకృతిన్
వదలి రమావధూలసిత ♦ వక్షముతోఁ గమనీయ నీల నీ
రద తనుకాంతితో శుభక ♦ రంబగు కుండలదీప్తితోఁ గృపా
నిధియగు భార్గవీధవుఁడు ♦ నీరజనాభుఁడు నిల్వ ముంగటన్. 164

గీ॥ కాంచి సంతోషబాష్పము ♦ ల్కనుల గ్రాల
తనువు వివశత్వమందగ ♦ ద్గదిక మొప్ప
వనజనాభుని పదముల ♦ వ్రాలి పరమ
భక్తి వెలయఁగ నిటు సంస్త ♦ వం బొనర్చె. 165

సీ॥ ఏవేల్పు కనువిప్ప ♦ నెల్లబ్రహ్మాండముల్
జీవించి చరియించుఁ ♦ జిత్రగతిని
యేవిశ్వరూపుని ♦ యిచ్ఛావశంబున
భువనజాలంబులు ♦ పుట్టుచుండు
నేదివ్యరూపుని ♦ పాదారవిందంబు
భక్తలోకమునకుఁ ♦ బట్టుఁగొమ్మ
యేమహాత్ముని దివ్య ♦ నామ సంస్మరణంబు
దాసజనాభీష్ట ♦ దాయకంబు

గీ॥ మౌనిజనము లేదేవుని ♦ మానసమున
నిల్పి సేవించుచుందురో ♦ నియతి వెలయ
నట్టినిను గొల్చుచుందుమో ♦ యసురభంగ !
మౌని మానససరసిజ ♦ మత్తభృంగ !. 166

మ॥ సరసీజేక్షణ! దేవదేవ! వరదా! ♦ శాంతస్వరూపా! నిరం
తరలోకత్రయపాలకా! దనుజహ ♦ ర్తా! విశ్వసృడ్వందితా!
తరమా నీదు మహాప్రభావము నెదన్ ♦ ధ్యానింపఁగానాకు? నీ
చరణాబ్జంబుల నమ్మినాను జగదీ♦శా! దీనచింతామణీ. 167

మ॥ భువనంబుల్ సృజియింపఁగాఁ బెనుపఁగాఁ ♦ బోకార్పఁగాఁ గర్తవై
భవపాశంబులఁ ద్రుంచి భక్తులను గా ♦ పాడంగ యత్నింతువో
భవబ్రహ్మాది సురేంద్రవందిత పదా ♦ బ్జా! నీశుభాకార మీ
యవనిన్ జూడఁగ నామనంబునకు బ్ర♦హ్మానంద మో యీశ్వరా!

మ॥ సిరిపై ధారుణిపై తపోన్వితులపై ♦ సేవించు దాసాళిపై
వరమౌనీంద్రులపై మహామహులపై ♦ భక్తాన్వయశ్రేణిపైఁ
బరమానుగ్రహ మొప్పఁ బంపుకృప నా ♦ పైఁ బంపవే "యన్యథా
శరణం నాస్తి" యటంచు నమ్మితి రమే ♦ శా! దీనచింతామణీ! 169

మ॥ అనియిటు ప్రార్థన ల్సలిపి ♦ యాసతి విష్ణునిగాంచి యోప్రభూ!
వనితలు ప్రాణనాథు నెడఁ ♦ బాసి జగంబున నిల్వఁజాలరం
చనియెదు వాక్యమీ వెఱుఁగ ♦ వా? పురుషోత్తమ! స్వామిలేని జీ
వనము నిరర్థకంబగుట ♦ భర్తనొసంగుము మాకుఁ గేశవా! 170

గీ॥ నీవుపల్కిన యర్థంబు ♦ నిశ్చయంబు
సంతసమె కాని దేహము ♦ న్నంతవరకు
ప్రాణికోటికి దేహసం ♦ బంధములగు
ధర్మనియమంబులను దాటఁ ♦ దగునె? చెపుమ. 171

గీ॥ ఈ భవమున మూకాత్మఁ డ ♦ ధీనుఁడగుట
మాపతిని సజీవుని జేయు ♦ మా రమేశ !
కానినాఁడు నా శాపాగ్నిఁ ♦ గమలభవ్రుఁడు
శలభమై పోవుటేకమీఁద ♦ సత్యముసుమి. 172

ఉ॥ ఈవిధి రూఢభావము వ ♦ హించి వచించెడి సాధ్వియైన మా
లావతి మోహముఁగాంచి కమ ♦ లాపతి సంతత తృప్త చిత్తుఁడై
భావజవైరి ధర్మ యమ ♦ పద్మభవాదులఁ జేరఁబిల్చి యో
పావనులార ! మీర లుప ♦ బర్హణుజీవిత మీయఁగావలెన్. 173

గీ॥ ఇతఁడు పరిభవసంతప్త ♦ హృదయుఁడగుట
వ్యాకులితుఁడయి బలిమిని ♦ బ్రాణములను
వదలె రాజయోగబలంబు ♦ వలన నింక
దశశతాబ్దంబు లాయు వీ ♦ తనికిఁగలదు. 174

ఆ॥ వె॥ మీరలీ యకాల ♦ మృత్యువునందిన
భక్తవర్యున కుప ♦ బర్హణునకుఁ
బ్రాణదానమిచ్చి ♦ బ్రదికించి యీసాధ్వి
స్వాంతమునకు సంత ♦ సంబొసఁగుఁడు. 175

—♦ బ్రహ్మాదులు గంధర్వుని సజీవుని జేయుట – వేల్పుల వరప్రదానము ♦—

గీ॥ వెన్నుఁ డిట్లని పల్కఁగ ♦ వేల్పుపెద్ద
కరమునంగల కుండికా ♦ కమలములను
మృతశరీరంబుపైఁ జల్ల ♦ నతని దేహ
మునను చైతన్యభావంబు ♦ జననమయ్యె. 176

కం॥ జ్ఞానానందుఁడు శంకరుఁ
డానందము నందుచు సద ♦ యాంమయుఁడై సు
జ్ఞానము నొసఁగె నపుడు భగ
వానుఁడు లక్ష్మీధవుండు ♦ వాత్సల్యమునన్. 177

గీ॥ ధర్మవిజ్ఞాన మిచ్చెను ♦ దయదలిర్ప
జఠరదీప్తిని గల్గించె ♦ జాతవేదుఁ
డమిత రూపసంపద నాయ ♦ నంగుఁడొసఁగె
బల పరాక్రమములనిచ్చె ♦ వాయుమూర్తి. 178

గీ॥ దీప్తిమంతుఁడు కలిగించె ♦ దృగ్బలమ్ము
భారతీదేవి యొసఁగెను ♦ వాగ్బలమ్ము
నిటుల గీర్వాణసందోహ ♦ మెల్ల సర్వ
సిద్ధులనొసంగి పరిపూర్ణుఁ ♦ జేసిరతని. 179

గీ॥ దేవతానుగ్రహ ప్రసా ♦ దితసమస్త
వాంఛితుండయి యుప ♦ బర్హణుండు
నిద్రనుండి లేచినరీతి ♦ నేత్రములను
నులుముకొని లేచి విస్మయా ♦ కులితుఁడగుచు. 180

కం॥ కడచిన వృత్తాంతము తన
పడఁతిముఖంబున నెఱింగి ♦ పరవశుఁడగుచున్
కడు భక్తి వెలయ నిలుచం
బడి మ్రొక్కెను బ్రహ్మవిష్ణు ♦ పరమేశులకున్. 181

గీ॥ తనివితీఱఁగ వీక్షించి ♦ తన్మయుఁడయి
వారి పావన పాదపం ♦ కేరుహముల
వ్రాలి సంతోష పులకిత ♦ స్వాంతుఁడగుచు
ప్రార్థన మొనర్చె నాతండు ♦ పరమభక్తి. 182

సీ॥ జగముల సృజియించి ♦ సంరక్షణ మొనర్చి
పోకార్పఁజేయు త్రి ♦ మూర్తులార!
నమ్మినవారిఁ గ ♦ రమ్మనురక్తితో
వెన్నాడి రక్షించు ♦ వేల్పులార!

దీనాతిదీనుఁడ • నైన నన్గ్రపఁజూచి
జీవింపఁజేసిన • జేజెలార !
ప్రార్థించువారిని • బరమాదరమ్మునఁ
జేపట్టు దివ్యస్వ•రూపులార!
గీ॥ నాదు నేరముఁ ల్మన్నించి • సాదరమునఁ
బ్రోచియున్నట్టి పుణ్యస్వ•రూపులార !
భారతీపార్వతీందిరా • భర్తలార !
మీకిదే వందనములు సు•శ్లోకులార! 183

గీ॥ అనుచుఁ బ్రార్థనసల్పి బ•ద్ధాంజలియయి
నిలువ నాతని ధర్మప•త్నీలలామ
సాధ్వి స్నాతయై ధౌతవ•స్త్రముధరించి
యా పరబ్రహ్మమూర్తి ని•ట్లని స్తుతించె. 184

ఉ॥ ఎవ్వఁడు బ్రహ్మయై జగము • లెల్ల సృజించును విష్ణుమూర్తియై
యెవ్వఁడు కాచుచుండు పర • మేశ్వరుఁడౌచు లయింపఁ జేయువా
డెవ్వఁడు సాక్షిరూపమున • నీ భువనావళిఁ జూచుచుండువాఁ
డెవ్వఁడు వాని విశ్వమయు • నీశ్వరు నాత్మఁదలంచి [మ్రొ]క్కెదన్.

గీ॥ ముప్పురు మూర్తులఁ గన్నట్టి • మూలశక్తి
ప్రకృతి త్రిగుణాత్మక జగదాం•బ లలితాంబ
యే మహాత్మునివలనఁ దా • సృష్టియయ్యె
నట్టి పరమేశ్వరుని హృద • యమునఁ గొలుతు. 186

కం॥ వరుఁడై వరేణ్యుఁడై సుర
వరదాయకుఁడై నతార్థి • పరమార్థదుఁడై
సురమునినుతుఁడై ప్రకృతికిఁ
బరుఁడై యుండెడి మహాత్ముఁ • బ్రార్థింతు సదా. 187

సీ॥ మార్తాండకోటిస ♦ మప్రభాభాసిత
మండలాకృతివీవు ♦ మానివర్య
లాకృతిలేని ని ♦ న్నాకారమునఁ జూచి
స్వేచ్ఛామయుఁడవని ♦ చెప్పుచుందు
రఖిల లోకంబుల ♦ కాధారుఁడవు కర్మ
ఫలదాయకుఁడవు శు ♦ భప్రదుఁడవు
తేజోమయాత్మక ♦ దివ్యరూపుఁడవు ప్రా
రబ్ధవినాశ కా ♦ రణుఁడవీవు
గీ॥ సచ్చిదానందమూర్తివి ♦ సర్వబీజుఁ
డవు తపఃఫలప్రదుఁడవ ♦ భవుఁడవీవు
పీత కౌశేయవాస! గో ♦ పీవిలాస!
సతతగోలోకవాస! వి ♦ శ్వప్రకాశ! 188

మ॥ తరమా? శేషునకైన నీదగు మహా ♦ త్త్వంబెన్నఁగా నెంతదా
న? రమానాయక! నీదు దివ్యగుణగా ♦ నంబేను సల్పంగ నో
యరవిందానన! నీదయాగుణము నా ♦ యందుంచిరక్షింపు నీ
చరణాబ్జంబులఁ గొల్చుచుండెదను కృ ♦ ష్ణా! దీనచింతామణీ! 189

గీ॥ ఇటులఁ బ్రార్థింప సంతుష్ట ♦ హృదయుఁడగుచుఁ
బద్మనాభుండు పడఁతి! నీ ♦ భర్తఁగూడి
చనుము పురికి శుభంబగు ♦ ననుచుఁబలికి
యనిమిషులతోఁ దిరోహితుఁ ♦ డయ్యెనపుడు. 190

సీ॥ సురలుదీవించిరి కురిసె ♦ విరులవాన
దుందుభులుమ్రోగె నప్సరో ♦ బృంధమెల్ల
నాట్యములుసల్పె పాడె గం ♦ ధర్వగణము
దేవలోక మానందాబ్ధిఁ ♦ దేలెనపుడు. 191

—♦ ఉపబర్హణుఁడు భార్యలతోఁ దన నగరికి వచ్చుట ♦—

కం॥ అంతట నుపబర్హణుఁ డ
త్యంత కుతూహలమనస్కుఁ ♦ డగుచు బిరానన్
కాంతాసంఘంబును గొని
సంతసమునఁ బురిని జేరి ♦ జనకుని గాంచెన్. 192

గీ॥ తల్లిదండ్రుల పాదప ♦ ద్మముల కెఱఁగి
వారి దీవనములనంది ♦ బ్రాహ్మణులను
దివ్యభోజనాదులచేతఁ ♦ దృప్తిపఱచి
ధనములను రత్నరాసుల ♦ దానమొసఁగె. 193

గీ॥ ఉవిద మాలావతియు సమ ♦ యోచితముగఁ
బతిని బూజించి పాదసే ♦ వలనొనర్చి
తన సపత్నులతోడ మో ♦ దంబుగదుర
నఖిల కామోపభోగంబు ♦ లనుభవించె. 194

గీ॥ పత్నులంగూడి యా యుప ♦ బర్హణుండు
తనదు జీవితశేష మం ♦ తయు విచిత్ర
రతులఁ గ్రీడించెఁ గేళికా ♦ రామములను
భవనములయందు నిర్జన ♦ వనములందు. 195

కం॥ తనయుని వైభవమును గని
జనకుఁడు గంధర్వరాజు ♦ సంతృప్తుండై
యొనరించెఁ గ్రతువరంబుల
మునులెల్లరు మెచ్చ నిత్య ♦ మోత్సాహితున్. 196

గీ॥ కొడుకు కోడండ్రు బంధుగుల్ ♦ గొలుచుచుండ
విమలగుణశీల భార్యసే ♦ వించుచుండ
దానముల జపయజ్ఞాది ♦ ధర్మవిధుల
నాచరించి యతండు కృ ♦ తార్థుఁడయ్యె. 197

గీ॥ మరణ మాసన్నమగుట నె ♦ మ్మది నెఱింగి
ధర్మపత్నితో జాహ్నవీ ♦ తటముఁజేరి
హరిని బ్రార్థించి తత్ప్రవా ♦ హమున మునిఁగి
ప్రాణములఁ బాసి గోలోక ♦ వాసి యయ్యె. 198

కం॥ హరభక్తుండై కొమరుని
హరిసేవాభాగ్యమునను ♦ హరికిం బ్రియుఁడై
పరమ పదంబునకును జని
హరిపార్షదుఁడై వెలింగె ♦ నతిపుణ్యమునన్. 199

కం. జనకుని మృతదేహమునకుఁ
దనయుం డుపబర్హణుండు ♦ తగుసంస్కారం
బొనరించె ధర్మపద్ధతి
ధనదానంబులను విప్ర ♦ తతులను దనిపెన్. 200

—♦ ఉపబర్హణునినిర్యాణము ♦—

గీ॥ వేయువర్షంబు లీరీతి ♦ వివిధగతుల
రాజ్యవైభోగములఁ దేలి ♦ బ్రహ్మశాప
మనుభవింపఁగ నిజదేహ ♦ మునుద్యజించె
జననమందఁగ వృషలికిఁ ♦ దనయుఁడగుచు. 201

కం. పతిమరణించినవెంటనె
సతులెల్లరుఁ దమ తనువుల ♦ సంతోషముతో
హుతవహున కొసఁగి తాము
ద్గతిఁజెందిరి పుణ్యవతుల ♦ ధర్మఫలమునన్. 202

ఆ॥వె॥ మాన్య పట్టమహిషి ♦ మాలావతి గతించి
మరు భవంబునందు ♦ మనువువంశ
మందు సృంజయునకు ♦ నాత్మజయై పుట్టి
నారదుని వరింపఁ ♦ గోరుచుండె. 203

ఆశ్వాసాంతము – విద్యున్మాలా వృత్తము.

వైదేహీశా! ♦ భక్తాధారా! – వేదోద్ధారా! ♦ విశ్వాకారా!
నాదానందా! ♦ నానాకారా! – శ్రీదా! దేవా! ♦ సీతారామా. 204

గద్య॥ ఇది శ్రీరామచంద్ర వరప్రసాద లబ్ధకవితా భాగ
ధేయ కేతవరపువంశ పయః పారావార రాకా
సుధాకర లక్ష్మీ నరసింహాగురు పుత్త్రరామ
కృష్ణనామధేయ ప్రణీతంబైన
భక్తనారదీయ మను గద్య
పద్యాత్మక కావ్యంబు
నందు ద్వితీయా
శ్వాసము

శ్రీ రామచంద్రాయ నమః

# భక్తనారదీయము

## తృతీయాశ్వాసము

క॥ శ్రీజానకీమనోహర !
రాజీవదళాక్ష ! భక్త • రక్షణ ! కపిరా
ట్పూజితపదయుగ ! నిరుపమ
తేజా ! సుగుణాభిరామ ! • దితిజవిరామా! 1

వ॥ దేవా ! అవధరింపుము. 2

గీ॥ శౌనకాది మహర్షులు • సౌతిఁగాంచి
నారదుం డుపబర్హణ • నామకుఁడగు
దేవయోనియై జనియించి • దివ్యభోగి
యగుచు మృతుఁడైనకథ విన • నాయెమాకు. 3

గీ॥ తదుపరి వృత్తాంతమువిన
హృదయమునకుఁ గోర్కెకలిగె • నింపుఁదలిర్పన్
మృదుమధుర వచోవైఖరి
సదయాత్మ ! తెలుపుమయ్య • సాధువరేణ్యా ! 4

గీ॥ విప్రవీర్య కారణమున • వృషలదార
గర్భమునఁ బుట్టెనంటి వా • కథను నేఁడు
వినఁ గుతూహల మయ్యెను • విమలచరిత !
విస్తరింపఁగదయ్య మా • వీనులలర. 5

ఆ॥ వె॥ అనుచుఁబల్కుచున్న • మునిగణంబులఁగాంచి
యా మహానుభావుఁ • డైన సౌతి
సారవంతమైన • నారదచరితంబు
పలుకఁదొడఁగె మధుర • వచనములను. 6

—♦ ద్రుమిళుని వృత్తాంతము ♦—

చ॥ కలఁడొక గోపకుండు గుణ ♦ గణ్యుఁడు శ్రీహరినామగాన తుం
దిలుఁడయి కాన్యకుబ్జమను ♦ దేశమునన్ ద్రుమిళాఖ్య నొప్పుచున్
కులమున కెల్ల పెద్దయయి ♦ గోధనరక్షకుఁడై ధనాఢ్యుఁడై
వెలయుచునుండు సంతతము ♦ విష్ణుకథామృతపానమత్తుఁడై. 7

కం॥ ఆతనిభార్య కళావతి
భూతలమునఁ గల్గినట్టి ♦ పొలఁతులలోనన్
నీతిని ధర్మపథంబునఁ
బాతివ్రత్యమునఁ మిగులఁ ♦ బ్రస్తుతిఁగాంచెన్. 8

గీ॥ ప్రాణనాథుఁడు చిరరుజా ♦ గ్రస్తుఁడైన
కారణంబున సంతతిన్ ♦ గాంచలేక
వంధ్యయై వ్యాకులాత్మయై ♦ వగకుఁజిక్కి
కష్టమునఁ దనకాలము ♦ గడపుచుండె. 9

మ॥ తనతో నన్వయ మంతరించునను సం♦తాపంబుతోఁ బ్రేయసిన్
గని యాతండనె నిట్లపుత్రకున కో ♦ కాంతా! గతుల్ప్రాప్తియం
చను ధర్మోక్తి మదీయచిత్తమున క♦త్యంతంబు దుర్వార చిం
తను గల్గించెను కాన నొక్కవెరవో ♦ నారీమణీ! తెల్పెదన్. 10

గీ॥ వ్యాధి పీడితుఁడనగు నా ♦ వలన వంశ
వృద్ధి కలుగ నేరదు కాన ♦ వెలఁది నీవు
తాపసోత్తము నొకని పా♦దములఁ గొల్చి
పుత్రఫలమును గాంచుమా ♦ పువ్వుఁబోడి. 11

గీ॥ నే ననుజ్ఞ నిచ్చుచునుంటిఁ ♦ గాన నీకుఁ
గలుగ నేరదు శీలభం♦గంబు కలికి!
పోయి పరమపావనుఁడైన ♦ మునివరేణ్యు
నాశ్రయంబున సుతలాభ ♦ మందుమింక. 12

వ॥ అని తనకళత్రమునకు బోధించినంత 13

— ♦ కళావతి పుత్రార్థినియై మున్యాశ్రమంబున కేగుట ♦ —

కం॥ పతియానతిఁ బొంది కళా
వతి పయనంబై మృగేంద్ర ♦ భయదస్వన కం
పితమగు ఘోరారణ్యము
ద్రుతగతితోఁ జేరి వెదకె ♦ దిశలన్నిటినిన్. 14

ఆ॥ వె॥ కాంచె నొక్కచోట ♦ ఘన తపోనిష్ఠుని
ప్రజ్వలించుచున్న ♦ బ్రహ్మతేజు
గరుడగమన నామ ♦ గాన వినోదుని
కశ్యపుఁడను మునిని ♦ గాంచి కలికి. 15

గీ॥ ఆ తపసి దివ్యరూపము ♦ నాత్మ మెచ్చి
గ్రీష్మ మధ్యాహ్న మార్తండ ♦ కిరణసదృశ
తేజమున వెల్గు నతనిపై ♦ దృష్టినిల్పి
యంతికముఁజేర నసమర్థ ♦ యగుచు నిలువ. 16

గీ॥ ఆ మహామునీంద్రుండు ధ్యా ♦ నాంతమందు
నయనముల విప్పి యాచమ♦నంబొనర్చి
కదలి పోఁబోయి యంతలోఁ ♦ గట్టెదుటను
నిలువఁబడియున్న ద్రిమిళుని ♦ నెలఁతఁగాంచె. 17

॥ సరసిజదళనేత్ర ♦ చారు చంపకవర్ణ
పీనపయోధర ♦ పీతవస్త్ర
సంపూర్ణ చంద్రాస్య ♦ స్వర్ణభూషణ భూషి
తాంగి లోలాక్షి బృ ♦ హన్నితంబ
హరిమధ్య సస్మిత ♦ విరిబోడి సుందరి
సిందూరతిలక భూ ♦ షితసుఫాల
స్మరశర పీడిత ♦ సౌందర్యజితరతి
సుమ కోమలశరీర ♦ శుద్ధచరిత

గీ॥ భర్తయాజ్ఞచే సత్పుత్త్రి ♦ ఫలమువడయు
వాంఛచే నటకరుదెంచి ♦ భక్తితోడ
నిలువఁబడి తన్నువీక్షించు ♦ నిర్మలాంగి
యైన కలికినొక్కరితను ♦ మౌనికాంచి. 18

గీ॥ రమణి! యెవ్వతెవీవు? ని ♦ ర్జనవనమున
నిలిచియుండఁ గారణమేమి? ♦ జలజనయన!
పతియెవరు నీకు? నిటకేల ♦ వచ్చినావొ?
నీదు తలఁపేమొ? దాఁచక ♦ నెలఁత! చెప్పుమ. 19

చ॥ అని జడదారి తా నడిగి ♦ నంతఁ గలావతి యిట్లుపల్కె నో
యనఘ! మహాత్మ! నేను తన ♦ యార్థినినై పతియాజ్ఞఁబొంది పా
వన! మిముఁజేరితిన్ ద్రమిళ ♦ పత్నిని గోపిక నాత్మవాంఛితం
బును నెఱవేర్చి నాకొక సు ♦ పుత్త్రినొసంగి యనుగ్రహింపవే. 20

గీ॥ భావగర్భిత వాక్య మీ ♦ వరుసఁ బలుకు
కొమ్మ పలుకులువిని మౌని ♦ కోపగించి
కంపితాధరుఁడై కాంతఁ ♦ గాంచి పలికె
తగునె తపసితో నిట్లులాడ? ♦ తన్వి! నీకు. 21

♦ కశ్యపముని కళావతికి ధర్మబోధఁజేయుట ♦

గీ॥ నీవిభుండు విరక్తితో ♦ నిను త్యజించె
గాన నీవతనికిఁ బరి ♦ గ్రాహ్యవగుట
జరుగ దిఁకమీఁద నాతఁడు ♦ తరుణిగనిను
గైకొనంజాలఁ డిద్ది ని ♦ క్కంబు వినుము. 22

గీ॥ అవని నెవ్వఁడు తనకు భో ♦ గార్హమైన
తరుణిఁ బరులకీఁదలఁచు నా ♦ పరమమూర్ఖుఁ
డ్యాగమొనరించు లక్ష్మియుం ♦ చాగమములు
నిగమములు చాటుచున్నవి ♦ నిశ్చితముగ. 23

గీ॥ బ్రాహ్మణుండయి జ్ఞానదు ♦ ర్బలత శూద్ర
కాంత నెవ్వఁడు కూడు నా ♦ కల్మషుండు
భ్రష్టుఁడై పాపియై కర్మ ♦ బాహ్యుఁడగుచు
జగమునందుఁ జండాలుఁడై ♦ జన్మమందు. 24

గీ॥ యజ్ఞకార్యములందు సు ♦ రార్చనముల
నతిథిపూజల శ్రాద్ధకా ♦ ర్యములయందు
కలుగ దట్టివారల కధి ♦ కారమనుచు
కమలసంభవుఁడు వచించె ♦ ఖండితముగ. 25

గీ॥ పంచపాది.
వాఁడు స్వయముగ నరకాగ్నిఁ ♦ బడుటెగాక
నాత్మనంశాన మాతామ ♦ హాన్వయమున
పదితరమ్ముల వరకు ను ♦ ద్భవముఁగనిన
పూర్వపరముల వారలఁ ♦ బుణ్యలోక
దూరులను జేసి నరకాగ్నిఁ ♦ ద్రోయుచుండు. 26

గీ॥ వాఁడు పితరులకిడిన త ♦ ర్పణ జనములు
పిండములు మూత్రమలములై ♦ వెలయుచుండుఁ
బూజ్యములగు సాలగ్రామ ♦ ముల స్పృశించి
యున్న మూఁడునా ళ్ళుపవాస ♦ ముండవలయు. 27

గీ॥ తామ్రసురాంగన న్నాదు ♦ రిందు కలసినఁ బదు
నల్వురిందు ల కాలంబు ♦ నరకమునను
గూలుటయెగాక నిర్వురఁ ♦ గాలుఁడు క్రిమి
భోజనం బను శిక్షను ♦ బొందఁజేయు. 28

చ॥ అని వచియించి నిల్చిన మ ♦ హాత్ముని గశ్యపుఁగాంచి పంకజా
సన కడుచింతనందుచు మ ♦నంబునఁ బొక్కుచుఁ గంపితాంగియై
మునిఁ గనుచుండ నావృషలి ♦ పుణ్యవశంబున మేనకాఖ్యచేఁ
దనరెడి యప్సరోంగన ప ♦ థంబునఁ బోవుచునుండ నత్తరిన్. 29

గీ॥ దివ్యభూషణ భూషిత ♦ దేహియగుచు
మార్గమునఁబోవు మేనకన్ ♦ మౌని గాంచి
తన్మ యుండయ్యె నామె సౌం ♦ దర్యముఁగని
పంచశరుబారిఁ దప్పిన ♦ వారుకలరె? 30

చ॥ అతివ సురూపసంపదల ♦ నా మునిచంద్రుఁడు గాంచి యాత్మలో
నతిశయ పారవశ్యమును ♦ నందఁగ నాతని తేజ ముర్విపైఁ
బతనమునందు టాద్రిమిశ ♦ పత్నిగనుంగొని పత్రిపాత్రిలో
జతపడఁజేసి సంతస మె ♦ సంగ్రహించెను. కార్యసిద్ధికై. 31

గీ॥ ఆ మదవతి ఋతుస్నాత ♦ యగుట మదిని
దగినయదనని తలపోసి ♦ తపసి తేజ
మును గ్రహించి మహర్షికి ♦ మ్రొక్కి-చనియె
నీశ్వరానుగ్రహం బన ♦ నిట్టిదికద. 32

గీ॥ దైవ సంకల్పవశమున ♦ తపసి తేజ
మా చకోరాక్షి కావేళ ♦ నద్భుతగతి
గర్భకారణమయ్యె జ♦గంబునందు
దైవకరుణఁ గల్గిన కొఱం ♦ తలుకలుగునె? 33

♦ కళావతి పతిసన్నిధిఁ జేరుట ♦

కం॥ తరుణి నిజభర్తృ సన్నిధిఁ
ద్వరితగతిం జేరి మ్రొక్కి పరమముదమునన్
జరిగిన విషయముఁ దెలుపఁగఁ
బరమానందమును బొంది ♦ పతి యిట్లనియెన్. 34

చ॥ వనిత! త్వదీయగర్భమున ♦ వైష్ణవ బ్రాహ్మణ వీర్య ముంట నీ
తనయుఁడు విష్ణుభక్తుఁడయి ♦ ధార్మికుఁడై హరిదాసదాసుఁడై
తనరెడిఁ గాన నీవుకడు ♦ ధన్యవుసుమ్ము సతీలలామ! నీ
తనువు పవిత్రమై వెలయు ♦ తన్ హరిభక్తుని తల్లివౌటచే. 35

ఉ॥ ఎవ్వని తేజము న్బడసి ♦ యెవ్వతె గర్భమునందు వైష్ణవుం
డివ్వసుధాతలంబున జ ♦ నించునొ? వారల పూర్వవంశజుల్
దవ్వయి జన్మకర్మదురి♦తంబులకున్ బరిశుద్ధమూర్తులై
యవ్వనజాక్షునంతికము ♦ నంది సుఖింతురు నిత్యముక్తులై. 36

గీ॥ నాదు కోర్కెలీడేరెనీ ♦ నాఁటి కబల !
హార్యనుగ్రహ పాత్రుఁడ ♦ నైతిఁ గానఁ
ద్యాగమొనరించి సంసార ♦ ధర్మములను
వనముఁ జేరుదునింకఁ ద ♦ పంబొనర్ప. 37

కం॥ దైవధ్యానముఁ జేయుచు
జీవితకాలమును బూర్తిఁ ♦ జేయఁ దలఁచితిన్
కావున నీవిటుపై నొక
పావన విప్రాలయమున ♦ బ్రతుకఁగ వలయున్. 38

చ॥ హరిపదభక్తుఁడై వెలయు ♦ నాత్మజుని న్గని పెంచి పుణ్యభూ
సుర వర పాదసేవల వి ♦ శుద్ధునిగా నొనరించి భక్తిత
త్పరునిగఁ జేసి నీతనువుఁ ♦ ద్యాగమొనర్చి పవిత్రధామమై
పఱఁగెడి కృష్ణదివ్యపద ♦ భాగినివై ననుఁజేరు టొప్పగున్. 39

గీ॥ తనదు సందేశ మీరీతిఁ ♦ దరుణికెఱుక
పఱచి దేవతార్చనమును ♦ భక్తి సలిపి
తర్పణంబులఁ బితృ దేవ ♦ తలకొసంగి
విరివిగ నొసంగె ధనరాశి ♦ విప్రతతికి. 40

ఉ॥ నాలుగులక్ష లశ్వముల ♦ నాగసమూహములన్ గృహంబుల
న్వేలకు వేలొసంగెను బ ♦ విత్రిలఁ బూజ్యుల క్షీరయుక్తలా
నాలను సౌధపంక్తులను ♦ హారముల న్మణిభూషణాదులన్
జాలఁగ దానమిచ్చెను ప్ర ♦ సన్నమనంబున భూసురాళికిన్. 41

—♦ ద్రుమిళుని బదరికాశ్రమ ప్రయాణము ♦—

గీ॥ తనదు సర్వస్వ మీరీతి ♦ ధర్మమొసఁగి
సతత హరికీర్తనామృతా ♦ స్వాదనుఁడయి
త్యక్తసంగుఁడై యపుడె ప్ర ♦ యాణమయ్యె
బదరికాశ్రమమునకుఁ ద ♦ పంబొనర్ప. 42

గీ॥ మాసపర్యంత మచ్చోట ♦ మౌనియగుచు
సలిల మాత్రోపజీవియై ♦ శాంతచిత్త
మునఁ దపమునల్పి నిజదేహ ♦ మును ద్యజించి
ముక్తుఁడై దివ్యగోలోక ♦ మునకుఁ జనియె. 43

గీ॥ కలితపుణ్యుఁడై దివ్య లో ♦ కంబుఁ జేరి
శాశ్వతంబగు కృష్ణదా ♦ స్యమునొనర్చి
భవమరణ విరహితుఁడయ్యె ♦ భక్తకల్ప
తరువు హరిఁ జేరు వారికిఁ ♦ గొఱఁతకలదె? 44

కం॥ తనపతి మరణించిన వా
ర్తను విని దుఃఖార్తయగుచు ♦ ధరణింబడి ఘో
రున విలపించి కలావతి
తనువును త్యాగంబొనర్పఁ ♦ దలఁచుచునుండన్. 45

గీ॥ ప్రాంతమందుండి యావృత్తాంతమెల్ల
నరయుచుండిన పుణ్యభూసురుఁడొకండు
కాంచి దరిఁజేరి శాంత వాక్యములవలన
వనిత మరణింపఁ జను యత్నమును మరల్చె. 46

చ॥ పలికె హితోక్తి లీగతిని ♦ బ్రాహ్మణుఁ డాసతిఁ గాంచి మానుమో
కలికిరొ! నీదుయత్నమును; ♦ గర్భమునంగలఁ డొక్కపుత్త్రుఁ డు
జ్జ్వలుఁడు రమేశభక్తుఁ డతి ♦ శాంతుఁడు వానికిఁగా ధరిత్రిలో
నిలుపుము నీశరీరమును ♦ నీరజలోచన! భద్రమయ్యెడిన్. 47

గీ॥ మాతృతుల్యవౌ నిన్ను నా ♦ మందిరమున
నుంచి రక్షించువాఁడ నో ♦ యువిద! వేరు
సందియమ్మును వీడి మ ♦ త్సదనమునకు
రమ్ము వైళంబ నామాట ♦ నమ్మియిపుడె. 48

—♦ కళావతి విప్రగృహంబున నివసించుట ♦—

గీ॥ బ్రాహ్మణుండన్న యాదర ♦ వాక్యములను
తరుణి యాలించి తనదు క♦ ర్తవ్యవిధిని
మదిని దలపోసి యాతని ♦ మందిరమున
కరుగ నంగీకరింప న ♦ య్యవనిసురుఁడు. 49

కం॥ అమ్మా ! నావెనువెంటనె
రమ్మా! యని తనదు మంది♦రమ్మున కావెన్
సమ్మదమునఁగొనిచని ప్రే
మమ్మునఁ బోషించుచుండె ♦ మానినికరుణన్. 50

గీ॥ గర్భవతియైన కతమునఁ ♦ గాంతతనువు
విష్ణుభక్తుని జననికిఁ ♦ బృథ్విలోనఁ
గలుష మిటు కృశించుననుచుఁ ♦ దెలుపురీతిఁ
గార్శ్యమై పాలిపోయిన ♦ గతిఁజెలంగె. 51

ఆ॥ వె॥ జననమందఁబోవు ♦ తనయుని సత్త్వగు
ణంబునకు నిదర్శ ♦ నం బనంగ
సుదతి మేను లోధ్ర ♦ సూనంబురీతిని
శ్వేతకాంతితోడ ♦ వెలసె నపుడు. 52

కం॥ వేవిళు లగుటన్ మృత్తిక
నావెలఁది భుజించుచుండె ♦ నతిమోదముతో
భూవలయమెల్లెడలఁ "బృథి
వీ వా అన్న" మనుశ్రుతిని ♦ వెల్లడిసేయన్. 53

గీ॥ నెలలు నిండినకొలఁది యా ♦ కలికిమిన్న
యవయవంబులు కడుపుష్టి ♦ నందె కలుగఁ
బోవు సుతునకు హరిభక్తి ♦ పుష్టియగుచు
దిశలవ్యాపించుననుమాట ♦ తెలిపెననఁగ. 54

కం॥ ధరణీసుర దంపతులా
తరుణికిఁ గోరిన పదార్థ ♦ తతులను ఫలముల్
సురుచిరచిత్రాన్నములన్
సరసములగు భక్ష్యముల నొ ♦ సంగిరి ప్రీతిన్. 55

వ॥ ఇట్లాకలావతి పతిమరణదుఃఖాకులితయయ్యు నంతర్వత్నియగుట విప్రదంపతుల సాంత్వన వాక్యములవలన నొకించుక చిత్తశాంతిని గల్గించుకొని కలుగఁబోవుపుత్త్రుని యభ్యుదయమును గాంక్షించుచు సుకుమార కుమారముఖచంద్రదర్శనలాలసయై సమయమున కెదురు చూచుచుండఁ గ్రమక్రమంబునఁ దొమ్మిదినెలలును కడచి పదవ మాసము ప్రవేశించిన కొలఁదిదినములకొకశుభలగ్నంబున. 56

—♦ కుమార జననము ♦—

చ॥ కొమరుని గాంచె నా కుసుమ ♦ కోమలి దివ్యమనోహరాంగునిన్
విమలుని బ్రహ్మతేజమున ♦ వెల్గుచునుండెడివాని సుందరు
న్నమలవిశాలలోచనుని ♦ గాంచనదేహుఁ గళావిభాసితు
న్సుమశర తుల్యరూపుని బ్ర ♦ సూతిగృహంబున విష్ణుభక్తునిన్. 57

గీ॥ వృషలి సుతుఁగన్న వార్తను ♦ వినినయంత
నిరుగుపొరుగున నివసించు ♦ తెరవలెల్ల
రతికుతుకమునఁ బురిటింటి ♦ కరుగుదెంచి
బ్రహ్మతేజోవిశాలుని ♦ బాలుగనిరి. 58

గీ॥ పద్మ చక్రి చిహ్నాంచిత ♦ పాదపద్ము
భాసురకపోలుని విశాల ♦ ఫాలుఁడైన
బాలకుని గాంచి యచ్చటి ♦ పడతులెల్లఁ
బరమ సంతోషవిభ్రమ ♦ స్వాంతలైరి. 59

గీ॥ స్తన్యవాంఛచేఁ గరములఁ ♦ జాచి తల్లి
వైపుఁజూచుచు నేడ్చునా ♦ పాపని గని
యమిత సంతోషమును జెంది ♦ రమణులెల్ల
రాత్మగృహములఁ జేర న ♦ య్యవనిసురుఁడు. 60

గీ॥ భార్యతోఁ బోయి నవజాత ♦ బాలునిగని
పరమసంభ్రమ పూరిత ♦ స్వాంతుఁడగుచు
శిశువు శుభలక్షణంబులు ♦ చేతమునకు
విస్మయముఁగొల్పఁ గొనియాడె ♦ వేయిగతుల. 61

గీ॥ పాలుఁడౌ నిసుగును దన ♦ పట్టియనెడి
భావమువహించి పుత్రోత్స ♦ వంబు సలుప
బిడ్డఁడాయింట సితపక్ష ♦ విధునిమాడ్కి
పెరుగుచుండెను విప్రుని ♦ ప్రేమకలిమి. 62

కం॥ కరుణామయుఁ డా ధరణీ
సురుఁ డా తేజోవిశాలు ♦ సుందరబాలున్
హరిభక్తుని బోషించెను
పరమోదారస్వభావ ♦ వైఖరియిదెయౌ. 63

## —♦ కుమారుని బాల్యలీల ♦—

శా॥ పంచాబ్దంబుల బాలుఁడై క్రమముగాఁ ♦ బ్రాగ్జన్మవిజ్ఞానియై
సంచారం బొనరించువేళల నిశా ♦ సంధ్యాది కాలంబుల
న్గొంచెంబైనను బ్రాలుమాలక సదా ♦ గోవింద! నారాయణా!
యంచున్బల్కును త్యక్తలోకవిషయ ♦ వ్యాపారుఁడై సర్వదా. 64

కం॥ గతజన్మ మంత్రవిద్యా
స్మృతి కలవాఁడగుట నింట ♦ స్మేరాననుఁడై
సతతము కృష్ణపదంబులె
గతియని తలపోసి నామ ♦ గానమొనర్చున్. 65

సీ॥ శ్రీకృష్ణ గుణనామ ♦ చింతనానందుఁడై
జడమతిఁ గన్నీరు ♦ విడుచుచుండు
గోవింద! కేశవ! ♦ శ్రీవాసుదేవ! జ
నార్దనా! యని భజ ♦ నంబొనర్చు
కాలిగజ్జెలు గల్లు ♦ గల్లని మ్రోయఁగఁ
దన్మయుం డగుచు నృ ♦ త్యంబుసలుపు
నాపాలిదైవమ! ♦ నన్ను బ్రోవరావేల
జాగేటికంచు వి ♦ చారపడును

ఆ॥ వె॥ ఆడు నొక్కచోటఁ ♦ బాడు వేరొకచోటఁ
గృష్ణదివ్యనామ ♦ కీర్తనమునఁ
బులకితాంగుఁడగుచు ♦ నెలుఁగెత్తి యేడ్చును
విష్ణుభక్తియనెడి ♦ వెఱ్ఱియెత్తి. 66

ఉ॥ ఎచ్చటనైన శ్రావ్యమగు ♦ కృష్ణకథా కథనంబు కల్గుచో
నచ్చటికేగి ♦ భోజన వి ♦హారములైనను మాని భక్తిపెం
పచ్చుపడంగ నాదితిసు ♦ తారిచరిత్రల ♦ నాలకించియే
వచ్చునుగాని బాలకుఁడు ♦ వ్యర్థమొనర్పడు కాలమింతయున్. 67

గీ॥ వాసుదేవ పురాణ ప్ర ♦ వచనమెచట
జరుగుచుండునో యచ్చటి ♦ కరిగి బాలుఁ
డాస్థతో నిల్చి తత్కథ ♦ నాలకించు
నన్యములగు లౌకిక విష ♦ యముల మఱచి. 68

గీ॥ తోడిబాలురు ధూళితో ♦ నాడుచుండ
ధూళి ధూసరుఁడైన యా ♦ బాలకుండు
ధూళితో బొమ్మనుం జేసి ♦ తోయజాక్షుఁ
డని తలఁచి ధూళితోడఁ బూ ♦ జనమొనర్చు. 69

గీ॥ నాయనుం గుర్తుమార ! రా ♦ వోయి! బువ్వ
నారగింపుమా! యనితల్లి ♦ చేరఁబిలువ
జనని ! తాళుము హరిపూజ ♦ సల్పుచుంటిఁ
గొంచెమాగినచో వత్తు ♦ నంచుఁ బలుకు. 70

వ॥ నారదచరిత్రంబు నీరీతిగ బోధించుచున్న యాసౌతింగాంచి శ్రోత
లలో నగ్రగణ్యుఁడైన శౌనకుఁ డిట్లనిప్రశ్నించెను. 71

గీ॥ జనక తుల్యుఁడైనట్టి యా ♦ బ్రహ్మసురుండు
వృషలి కొమరున కేమని ♦ పేరువెట్టె ?
నేమికతమున నతని కా ♦ నామమిడెనో ?
విస్తరింపఁగదయ్య యో ♦ విబుధవర్య! 72

♦ నారద నామసార్థక్యము ♦

కం॥ అనఁగ విని సౌతి యిట్లనె
వినుఁడీ మునిచంద్రులార ! ♦ విప్రుఁడువృషలీ
తనయున కప్పుడు నారదుఁ
డని నామకరణమొనర్చె ♦ నతిమోదమునన్. 73

గీ॥ ప్రజ లనావృష్టిచే బాధ ♦ పడెడువేళ
నితఁడు జన్మింప సంపూర్ణ ♦ వృష్టికలిగెఁ
గాన జలమొసంగినయట్టి ♦ కారణమున
నారదుఁడని బాలకునకు ♦ నామ మిడిరి. 74

గీ॥ అనుదినంబునుఁ దనతోడ ♦ నాడుకొనెడి
బాలులకు హరినామత ♦ త్త్వంబు దెలిపి
జ్ఞానవృద్ధినొసంగఁగఁ ♦ జాలియుంట
నారదుఁడని బాలకునకు ♦ నామమిడిరి. 75

వ॥ ఇంతియకాక నింకను మూఁడు కారణములున్నవి. వాని నాలకింపుడు. 76

కం॥ నారద నామాంతరుఁడగు
భూరి తపోబలుని కశ్య ♦ పుని వీర్యమునన్
ధారుణి జన్మించుటచే
నారదుఁడని దివ్యమైన ♦ నామమువ్రాసెన్. 77

గీ॥ బ్రహ్మవలన శాపంబును ♦ బడసినట్టి
నారదుఁడె కశ్యపుని వీర్య ♦ కారణమున
వృషలి కడుపునఁ బుట్టుటఁ ♦ బృథ్విలోన
నారదుండను నన్వర్థ ♦ నాముఁడయ్యె. 78

ఆ॥ వె॥ నలువ గళమునుండి ♦ నరులు జన్మించుట
వలన బ్రహ్మ కంఠ ♦ భాగమునకు
నరదమను విచిత్ర ♦ నామంబుగలిగెను
నరదభవుఁడుకాన ♦ నారదుండు. 79

వ॥ ఈరీతిని సార్థకంబగు నారదనామము నాబాలకునకుంచి మహీసురుండు పెంచుచుండ. 80

గీ॥ బాలుఁడీరీతి బ్రాహ్మణ ♦ భవనమునందు
విప్రునకుఁ బుత్త్రతుల్యుఁడై ♦ పెరుఁగుచుహరి
నామచింతనఁ దవిలి య ♦ న్యంబు మరచి
యుండ నప్పాఋనింటికి ♦ నొక్కనాడు. 81

—♦ మహామునుల యాగమనము - నారదుని సేవ ♦—

శా॥ ఆ విప్రాలయ ప్రాంగణమ్మునకు మ♦ధ్యాహ్నార్క తేజోయుతుల్
దేవారాధ్యులు తాపసు ల్గురువరుల్ ♦ దీప్తాంగు లుత్ఫుల్లరా
జీవాస్యు ల్కరుణామయుల్ ద్విజవరుల్ ♦ శ్రీకృష్ణపాదాబ్జ సం
సేవాసక్తులు నల్వురచ్చటికి వి♦చ్చేయ న్మహోత్సాహిౕయై. 82

గీ॥ ఆ మహానుభావులఁ గని ♦ యువని దేవుఁ
డతిముదంబున నెదురేగి ♦ యర్ఘ్యపాద్య
ములను సమకూర్చి మధుపర్క ♦ ముల నొసంగి
యతిథిసేవల నొనరించెఁ ♦ గుతుకమలర. 83

ఉ. వారికిఁ గందమూలములు ♦ భక్తినొసంగి బహూకరింప నా
పాఱుఁడు గోపికాసుతుని ♦ బంప మునీశ్వర దివ్యపాద. సే
వారతిఁబూంగి యాతఁ డల ♦ వైష్ణవ బ్రాహ్మణ భుక్తశేషమున్
దొరపు భక్తిఁగైకొనెను ♦ దోషహారంబగు తత్ప్రసాదమున్. 84

కం॥ అదిమొదలు దినదినంబును
ముదమలరగ శ్రద్ధతోడ ♦ మునిజనములఁ దా
సదమలమతి సేవించెను
హృదయంబునఁబ్రేమభక్తు ♦ లింపుదలిర్పన్. 85

సీ॥ బ్రాహ్మ ముహూర్తానఁ ♦ బద్మదళాక్షు సం
స్మరణంబుతో లేచి ♦ మౌనివరుల
పాదపద్మములకుఁ ♦ బ్రణమిల్లి తత్పాద
సంవాహనంబును ♦ సలిపి పిదపఁ
గాల కృత్యములకై ♦ కావలసినయట్టి
వస్తువులను సమ ♦ ర్పణమొనర్చి
స్నానముఁజేసి వి ♦ సర్జించినట్టి పు
ట్టములను శుద్ధోద ♦ కముల నుదికి

గీ॥ యగ్నిహోత్రి కార్యములకై ♦ యవసరమగు
సమిధలను కుశలను వన ♦ స్థలికిఁబోయి
తెచ్చియిచ్చుచు నీగతి ♦ దీక్షతోడ
సేవలను సల్పె నామువి ♦ శ్రేష్ఠులకును. 86

గీ॥ వారి కాహారముగ వన్య ♦ ఫలతతులును
కందమూలాదులును దెచ్చి ♦ కాన్క యొసఁగు
శయన మొనరింప మెత్తని ♦ చాపలల్లి
పరచియుంచును బాలుండు ♦ పరమభక్తి. 87

కం॥ వారల శ్రీ చరణామృత
వారిఁగొనక ఫలమునైన ♦ భక్షింపంగాఁ
గోరఁడు మానసమున వ
హ్వారే! యాబాలు పూర్వ ♦ భాగ్యంబేమో! 88

గీ॥ వారి దయ నార్జనము సేయఁ ♦ బాటుపడుచు
శ్రద్ధతో వారొనర్చు ధ ♦ ర్మవిధులెల్లఁ
గనులఁగాంచుచు నామహా ♦ మునులొనర్చు
హరిగుణానుకీర్తనముల ♦ నాలకించు. 89

గీ॥ సాధు తాపస హరిగుణ ♦ శ్రవణమునను
హృదయమున నీశ్వరప్రేమ ♦ యుదయమగుట
నేకతంబునఁ గూర్చుండి ♦ కృష్ణరూప
మును మనంబునఁ దలపోయు ♦ ననవరతము. 90

గీ॥ అటుల రూపానుసంధాన ♦ మధికమైన
కొలఁది నానందవృద్ధియై ♦ గోకులేశ
నామ గానమునందుఁ ద ♦ న్మయుతఁ గాంచి
భాగవత ధర్మనిష్ఠను ♦ బడయనెంచె. 91

గీ. ఈగతిని నాల్గునెల లాము ♦ నీశ్వరులకు
ననవరత సేవలనుజేసి ♦ తనుమనములఁ.
పారిశుద్ధ్యమును గడించి ♦ పావనముగు
బ్రాహ్మణానుగ్రహామునకుఁ ♦ బాత్రుఁడయ్యె. 92

గీ॥ పాదసేవలచే నయ్యెఁ ♦ బావనుండు
భుక్త శేషము స్వీకరించి ♦ భక్తుఁడయ్యె
దర్శనముఁజేసి చిత్తశు ♦ ద్ధతనుగాంచె
నవనిలో సాధువులసేవ ♦ వ్యర్థమగునె? 93

—♦ మహాముని నారదునకు మంత్రోపదేశముఁ జేయుట ♦ —

గీ॥ ఒకదినంబున వారిలో ♦ నొకమహర్షి
భక్తితోఁ దమ్ము సేవించు ♦ బాలుఁడైన
నారదునిగాంచి వాని గు ♦ ణముల కాత్మ
నలరి మంత్రదీక్ష నొసంగఁ ♦ బిలువఁబోయి. 94

సీ॥ శ్రీనాథ నామజ ♦ పానంద మాధురీ
పరవశుఁడై మేను ♦ మఱచువాని
కృష్ణ నామధ్యాన ♦ కీర్తనామృతమున
సొక్కుచుఁ జిందులు ♦ ద్రొక్కువాని
పుడమిపై తిరుగాడ ♦ మొదలిడు టాదిగ
మదిలోన హరినిల్పి ♦ మనెడువాని
లౌకిక వస్తుజా ♦ లముకృష్ణరూప మం
చనియెంచి సంతృప్తి ♦ నందువాని

గీ॥ భక్తిలోమున్గి సర్వంబు ♦ వదలువాని
వినయ శాంత్యాది గుణముల ♦ వెలయువాని
నారదునిగాంచి తనదరిఁ ♦ జేరఁబిల్చి
కరము శిరమున నుంచి యిా ♦ గతివచించె. 95

ఉ॥ బాలక! భక్తిమార్గ పరి ♦ పాలక! పావన విష్ణుధర్మసం
చాలక! నీచరిత్రము ప్ర ♦ శస్తము నీవొనరించు సేవయే
చాలఁగ మాకు సంతస మొ ♦ సంగెను నెమ్మది తృప్తిఁజెందె నిః
జోలెడివాఁడుకల్గ డిఁక ♦ భూవలయంబున బాలకోత్తమా! 96

ఆ॥ వె॥ మాకుఁ దెలిసె నోకు ♦ మార! నీపూర్వవృ
త్తాంతమెల్ల నీవు ♦ ధాతృశాప
మున జనించినట్టి ♦ మునివి నారదుఁడవు
గోపికా కుమార♦కుఁడవు కావు. 97

గీ॥ నీదుసేవకు బదులుగ ♦ నీకుఁగృష్ణ
మంత్రము నుపదేశించెద ♦ మనసులోన
దాని నత్యంతభక్తితో ♦ మౌనకెపుడు
జపమొనర్చిన కృష్ణద ♦ ర్శనముకలుగు. 98

గీ॥ అనివచించి యాబాలుని ♦ తనదు నంతి
కమునఁ గూర్చుండఁజేసి త ♦ త్కర్ణములను
బరమపావనమైన యా ♦ వాసుదేవ
మంత్ర ముపదేశమొసఁగెఁ గు♦మారకునకు. 99

వ॥ పరమభక్తాగ్రేసర రత్నంబైన యాబాలకున కా మునిపుంగవుఁడు పరమానుగ్రహ వశంబున శ్రీకృష్ణమంత్రంబును న్యాస కవచ మాలా ధ్యానాద్యష్టాంగ యుక్తంబుగ నుపదేశించి దీనిని భక్తితో జపించిన శ్రీకృష్ణానుగ్రహము కలుగుననివచించి నారదునిబంపిన తదుపరి. 100

గీ॥ మాసములు నాల్గు కడచిన ♦ మరుదినమున
నామునీశ్వరు ల్వెల్వ రా ♦ యవనిసురుని
సదనమును వీడిపోయిరి ♦ సత్వరగతి
నిస్స్పృహుల కొక్క స్థిరమగు ♦ నెలవుకలదె? 101

కం॥ శ్రీకృష్ణ మంత్రరాజము
చేకూరఁగ నారదుండు ♦ చిత్తంబలరన్
గోకులనాథు భజించుచు
లోకంబును మరచి ధ్యాన ♦ లోలుండయ్యెన్. 102

సీ॥ నిజదేహ సుందర ♦ నిష్ఠా గరిష్ఠుఁడై
యతిశయ దంభసం♦గతుఁడు కాఁడు
లౌకిక విషయాదు ♦ లకు వశుఁడై జ్ఞాన
కర్మేంద్రియములకుఁ ♦ గట్టుపడఁడు
తోడిబాలు లొనర్చు ♦ దుండగంబులకుఁ దా
నించుకైనను మది ♦ నీసుగొనఁడు
స్వాంతమ్మునం దెట్టి ♦ వాంఛలుకల్గిన
మనసును మరలించు ♦ కొనుచునుండు

గీ॥ విష్ణు సంబంధములు గాని ♦ వింతలెల్ల
మదిని దృశ్యంబులని యెంచి ♦ వదలివేయు
సంస్తుతుల దూషణంబుల ♦ సమముఁ జేయు
పరమభక్తుండు గోపికా ♦ బాలకుండు. 103

సీ॥ నా కృష్ణదేవుఁడు ♦ నను బ్రోవరాడేల
నో యని విలపించు ♦ నొక్కచోట
కృష్ణనామధ్యాన ♦ కీర్తనానందుఁడై
సొక్కుచునుండు వే♦రొక్కచోట
తనకంటి కేపదా ♦ ర్థము కానవచ్చిన
హరిదృష్టి వీక్షించు ♦ నన్నిచోట్ల
శ్రీకృష్ణనిధి నాకుఁ ♦ జేతఁ జిక్కెనటంచు
గంతులువేయును ♦ సంతసమున

గీ॥ ఈవిధంబున నతఁడు శ్రీ ♦ కృష్ణభక్తి
తత్పరుండయి సర్వథా ♦ తనువుమరచి
త్యక్త లౌకిక వాసనుం ♦ డగుచు బాలుఁ
డనిశము జపించు గురుమంత్ర ♦ మును మనమున. 104

మ॥ మునిబోధించిన మంత్రరాజము జపం ♦ బు న్సేయుచున్ నీరజే
క్షణ నామామృతసిక్తచిత్తుఁడయి ప్రే ♦ మార్ద్రోక్తులం బైన కృ
ష్ణుని గానంబొనరించుచు న్సకలవ ♦ స్తుశ్రేణుల న్గోకులే
శుని వీక్షించుచుఁ గాలము న్గడుప నెం ♦ చున్బాలుఁ డత్యంతమున్.

గీ॥ రానురాను చిత్తమున వి♦రాగభావ
మధికమైనకొలఁది యర♦ణ్యమును జేర
నిశ్చయించియు వాత్సల్య♦నిలయమైన
తల్లినింగాంచి తనప్రియ♦త్నముల వదలె. 106

గీ॥ కడచుచుండ దినంబు లీ ♦ గతిని నొక్క
రాత్రివేళఁ దన్మాత మా♦ర్గమున నడచి
పోవుచుండఁ గాలగతిని ♦ భుజగదష్ట
యై విసము తలకెక్క దే♦హంబు విడిచె. 107

గీ॥ విష్ణుభక్తుని తల్లియై ♦ వెలయు కతన
విష్ణు సేవకవర్గ మా ♦ వెలఁదిని గొని
సుందర విమానమునను గూ♦ర్చుండఁబెట్టి
పరమపావన వైకుంఠ ♦ పదవిఁ జేర్చె. 108

గీ॥ కన్నతల్లికి నంత్య సం♦స్కారములను
బూర్తిఁగావించి వైళంబ ♦ భూసురాను
మతిని గొని యిఁక బంధంబు ♦ మాసెననుచు
స్వాంతమున నెంచి వనిఁజేరఁ ♦ బయనమయ్యె. 109

కం॥ ఆ వైరాగ్య ప్రాభవుఁ
డావిధముఁగ బంధముక్తుఁ♦డై వనిఁజేరన్
వేవేగఁ బయనమై నగ
రావళిఁ బల్లెలను గడచి ♦ యతిధీరుఁడై. 110

చ॥ కనులనుగాంచె నారదుఁడు ♦ గండక భల్లుక పుండరీక భీ
షణ కిటి సారమేయ శశ ♦శల్య వలీముఖ కృష్ణసార కా
ననమహిషీ తరక్షు వృక♦ నాగ భయంకర జంతుయుక్తమున్.
వనచర భిల్లలోక పరి♦పాలిత ఘోర వనాంతరస్థలిన్. 111

వ॥ ఇవ్విధంబున దేవదారు, బదరీ, తాల, హింతాల, రసాల, వట, బిల్వ, కపిత్థ, జంబు, జంబీర, భల్లాత, కామ్ల, సిందువార, పిచుమంద, ఖర్జూర, వకుళ, పనస, నారికేళ, ప్రముఖ పల్లవిత కుసుమిత ఫలిత లలిత వనభూరుహ నివహాలంకృతంబగు కాననంబునఁ బ్రవేశించి నీలోత్పల, శతపత్త్ర, కాంచన, కల్హార, పరిమళ, మిళితంబులై మత్తమధుప సమూహ సంచార సముదంచితంబులై కలహంస, జలకుక్కుట, చక్రవాక, శకుంత, బలాహకాది, జలవిహంగ కోలాహల ప్రతిధ్వనితంబులై, ప్రవిమల వారిపూరితంబులైన సరోవరంబుల దాటుచు అంబరచుంచిత శిఖరవిలసిత మహోన్నతపర్వత పంక్తులను బెక్కంటి నారోహణావరోహణగతి నతిక్రమించుచు నిబిడాంధకార బంధురంబులై ప్రకృతియొక్క పరమాద్భుత సృష్టికౌశల్యంబునకుఁ బరమావధియైయున్న దరీగృహంబులనుతదంతర్గమైయున్న యీశ్వర విలాసంబును గని యానందించుచు మహోన్నత శిఖర పతిత శిలా ఖండ సంఘట్టనైక జనిత మహానినాదసమన్వితంబులై పరమేశ్వర స్వరూప తాదాత్మ్యసిద్ధికై తత్తరంబునఁ బరువెత్తు మహాత్ముల యొక్క చిత్తంబులువోలెఁ బల్లములకై ప్రవహించుచుండెడి కొండ వాగులను వీక్షించుచు బంధురతమోమయంబులై యాతాయాత బహువిధ క్రూరజంతు సమాకులంబులగుటచే భయదాయకంబులై

యరిషడ్వర్గపూరితులై మహామోహపిశాచావేశితులైన మానవుల హృదయములరీతిని పరదూషణ పరాయణుల వదనములవలె దుర్గమంబులై యున్న గిరిగుహాముఖంబులను వెనుకవైచుచు ధరణిందిరుగాడు నీలమేఘంబులవలె భీమగర్జానుకరణంబులగు ఘీంకృతుల సల్పుచు శుండాదండంబులు పైకెత్తి తరుశాఖల నవలీలగ విరిచి పాఱవైచుచు నవయువతీ గమనవైఖరుల కుదాహరణంబులవలె విచ్చలవిడి సంచరించుచున్న మత్తవేతండ తండంబులనుజూచి యులికిపడక ముందునకు నడచుచు మత్తేభకుంభస్థల మాంస భక్షణాసక్తిని గృహాంతరములనుండి బయలు వెడలి కానన ప్రదేశమున నలుదెసల ప్రతి ధ్వనించునట్లు గాండ్రించుచుఁ బోవుచున్న సింగపుకొదమల యట్టహాసంబునకు వెఱపుఁజెందక మాటులోఁజిక్కికొనిన శార్దూలంబులను బంధించి భుజములధరించి ధనుశ్శరాసనంబులతోఁ బల్లెలం జేరఁబోవుచు జీర్ణవస్త్రంబుతో శరీరమాత్రవిభవుఁడై పోవుచున్న యీబాలుఁడెవ్వారోయని తన్నువీక్షించుచుఁ గాఱుమెయిలును మరపించుదేహచ్ఛాయకుఁ గరిదంతానుకరణంబులగు మిట్టపండ్లును మిడిగ్రుడ్లును దేహంబునకు విపరీతలక్షణము నాపాదింప నిల్చుండియున్న కోయలపై దృష్టినిడక పరిభ్రమించుచుఁ దరులఁగాంచక గిరులలెక్కింపక మార్గాయాస పరిశ్రాంతుఁడుగాక మార్గమధ్యంబున దైవానుగ్రహమువలన లభ్యంబులగు ఫలాదులందిని కనఁబడిన కొలఁకుల నీరుఁ ద్రావుచు నిల్చినచోటనిలువక పిచ్చియెత్తినవానివలె నుత్తరాభిముఖుఁడై చనిచని. 112

చ॥ అటఁ జనికాంచె నారదుఁ డ ♦ నంతమునీంద్రసురేశవంద్యమున్
పటుతర ఘోరదుష్కృత వి ♦ భంగము శ్రీహరిపాద పంకజ
స్ఫుటత్రిజగత్పవిత్రము వి ♦ శుద్ధతరంగ సమన్వితంబు ను
ద్భట పరమార్థదాయకము ♦ పావన గాంగఝరీ విలాసమున్. 113

గీ॥ కాంచి తద్వాహినిని జల♦కంబులాడి
త్రోవనడిచిన కష్టంబు ♦ తొలఁగిపోవఁ
దజ్జలంబులఁ గడుపారఁ ♦ ద్రావి ప్రాంత
మునఁ జెలంగెడి యశ్వత్థ ♦ మునకుఁ జేరి. 114

గీ॥ స్వస్థచిత్తుఁడై యన్యభా♦వముల వీడి
స్వాంతమునఁ గృష్ణరూపమున్ ♦ బాదుకొల్పి
విప్రిదత్తమైనట్టి యా ♦ విష్ణుమంత్రి
మును జపింపసాగెనుతన ♦ మనమునందు. 115

గీ॥ ఈ మహాఘోరమైన వ ♦ నాంతరమున
జాహ్నవీతీర సంస్థితా ♦ శ్వత్థవృక్ష
మూలమునను యో గాసన ♦ మునువహించి
గరుడగమన సందర్శనా ♦ కాంక్షియగుచు. 116

గీ॥ వేదదుర్లభమైన యా ♦ విప్రదత్త
మంత్రరాజము నిశ్చల ♦ మానసమున
ధ్యానమొనరించెఁ జిరకాల ♦ మమితభక్తి
నియమితాంగుడై నిశ్చల ♦ నిష్ఠుఁడగుచు. 117

గీ॥ సామవేదోక్తమైసర్వ ♦ శక్తిమంత
మై చెలఁగెడి యిరువదిరెం ♦ డక్షరముల
విష్ణుమంత్రమునాతఁడు ♦ వేయిదివ్య
వర్షములు కడునిష్ఠ జ ♦ పంబొనర్చె. 118

సీ॥ కందమూలములు భ ♦ క్షణచేసి కొన్నాళ్లు
పరమసంతృప్తి జ ♦ పంబుసలిపె
వనఫలంబులనెల్లఁ గొనితెచ్చి కొన్నాళ్ళు
భక్షించి యతడు త ♦ పంబుసలిపె

పర్ణములొక్కన్నాళ్ళు ♦ భక్షించి తదుపరి
నీరమాత్రాహార ♦ నియతినల్పె
అన్నిటిఁ ద్యజియించి ♦ యనిలభక్షణము నొ
నర్చుచు నంతటుకొ ♦ న్నాళ్ళుసలిపె.

గీ॥ వాయుబంధనమున ♦ పెక్కు వత్సరములు
సలిపె నారదుఁడిటుల న ♦ శ్వత్థమూల
మున నిరాహారుఁడై త్యక్త ♦ మోహుఁడగుచుఁ
దపము సలుపఁగ నాతని ♦ ధ్యానదృష్టి. 119

ఆ॥ వె॥ కానుపించె కృష్ణ ♦ కరుణను గోలోక
మపుడు నేత్రపర్వ ♦ మగుచు నెదుట
నారదుండు వేద ♦ సారమౌ శ్రీకృష్ణ
దివ్యమంగళాకృ♦తి నటఁ గాంచె. 120

సీ॥ రత్నకుండల యుగ్మ ♦ రాజిత సుకపోలు
శాంతస్వరూపు వి ♦ శాలవక్షు
బ్రహ్మవిష్ణుశివాది ♦ వందిత చరణాబ్జుఁ
గౌస్తుభాలంకారుఁ ♦ గమలనేత్రు
రాధికాకాంతుఁ బ ♦ రాత్పరు గోవిందు
శ్రితభక్తమందారు ♦ శ్రీవిహారు
చందనచర్చిత ♦ సర్వాంగుని ద్విబాహు
వేదాంతవేద్యుని ♦ విశ్వసాక్షి

గీ॥ నీశ్వరుని ననంతుని జగ ♦ దేకదక్షు
కోటికందర్పలావణ్య ♦ కోమలతర
దేహు సకలలీలాధాము ♦ దీప్యమాను
బర్హిపింఛావచూడుని ♦ బ్రహ్మమయుని
బాలకృష్ణుని గాంచె నా ♦ భక్తవరుఁడు. 121

మ॥ అతిలావణ్య విలాససుందర ప్రభా ♦ వాలంకృతున్ బంధనో
క్షిత సర్వాంగుని తప్తకాంచననిభున్ ♦ గీర్వాణసందోహపూ
జిత పాదాబ్జుని బాలకృష్ణు వరదున్ ♦ శ్రీరాధికానాథునిన్
గుతుకంబారఁగ ధ్యానదృష్టిఁగనియా ♦ కూతి న్తదాకారమున్.

గీ॥ కాంచి విభ్రమాశ్చర్య సం ♦ కలితుఁ డగుచుఁ
బరవశుండయి కనులబా ♦ ష్పములు వ్రాల
శోకభరమునఁ దన్మూర్తిఁ ♦ జూడ లేక
రోదనంబొనర్చును కడు ♦ వేదనమున. 123

ఆ॥ వె॥ ఇటులఁ జేష్టదక్కి ♦ యెలుగెత్తి యేడ్చెడి
నారదునకు గగన ♦ భారతి యొక
వాక్యమును వచించె ♦ పరమభక్తాగ్రణి !
వంతమాని నాదు ♦ పలుకువినుము.  124

ఉ॥ నారద ! నీదుభక్తికి మ ♦ నంబున సంతసమంది నాశుభా
కారము నీదు భావమునఁ ♦ గన్పడఁజేసితి నీభవంబున
న్వేరుగ నాస్వరూపమును ♦ నీవిఁకఁ జూడవు భావిజన్మమం
దారయ బ్రహ్మనందనుఁడ ♦ వై ననుగాంతువు భక్తరత్నమా! 125

కం॥ మానసమున ననుదలఁచుచు
ధ్యానంబొనరించు పరమ ♦ ధన్యుల వాంఛన్
మానకతీర్తును గావున
నోనారద! కానబడితి ♦ నుల్లములోనన్. 126

గీ॥ కాన నీవింక మరియొక ♦ కల్పమందు
బ్రహ్మ దేహభాగమునుండి ♦ బయలువెడలి
దేవమునివై మహాభక్తిఁ ♦ దేజరిల్లి
సర్వ లోకోపకారంబు ♦ సలుపఁగలవు. 127

గీ॥ ఇంకమీఁద నీపిగతి ♦ నీపవిత్ర
మందె నివసించి నిశ్చల ♦ ధ్యాననిష్ఠ
దేహమోహము న్విడనాడి ♦ తీవ్రతపము
సలిపి తనువుఁ ద్యజింపఁగ ♦ వలయుపుత్రి! 128

పరబ్రహ్మమూర్తియైన యా శ్రీకృష్ణపరమాత్మ యిట్లాకాశవాణీ రూపంబునఁ దనయాదేశంబును వచించి నారదునియొక్క భవిష్యత్తును బోధించి యంతర్ధానమైనంత. 129

కం॥ భగవానుఁ డపుడు తనపై
నగుపరచిన కరుణకతఁడు ♦ హర్షాన్వితుఁడై
జగదీశుఁ బాడుచును బ
న్నగశయనుం గూర్చి తపము ♦ నర్చెను భక్తిన్. 130

సీ॥ కొంతకాల మీరీతి ము ♦ కుందుఁగూర్చి
పావనస్వాంతుఁడగుచుఁ ద ♦ పంబొనర్చి
త్యక్తదేహాభిమానుఁడై ♦ తనువుఁదొఱఁగె
కుసుమవృష్టిని దేవత ♦ లుక్కిరియఁ జేయ. 131

ఆశ్వాసాంతము

మాలినీవృత్తము.

శతముఖనుతనామా! ♦ సర్వలోకాభిరామా!
అతులితగుణధామా! ♦ అంజనాపుత్రికామా!
శ్రితజనపరిపాలా! ♦ శిష్టసంత్రాణశీలా!
శతమఖరిపుకాలా! ♦ శాతకుంభాభిచేలా!. 132

గద్య॥ ఇది శ్రీరామచంద్ర వరప్రసాద లబ్ధకవితాభాగధేయ
కేతవరపువంశ పయఃపారావార రాకాసుధాకర
లక్ష్మీనృసింహ గురుపుత్త్ర రామకృష్ణ
నామధేయ ప్రణీతంబైన "భక్త
నారదీయ"మను గద్యపద్యాత్మక
కావ్యమునందుఁ
దృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీరామచంద్రాయ నమః.

# భక్తనారదీయము

## చతుర్థాశ్వాసము

కం॥ శ్రీమ దయోధ్యాపురవర
ధామా ! లోకాభిరామ ! ♦ దానవభీమా !
కామారివినుత ! రవికుల
సోమా ! సద్భక్తవరద ! ♦ సుందరరామా ! 1

వ॥ దేవా ! అవధరింపుము. 2

గీ॥ శౌనకాది మహర్షులు ♦ సూతిఁ గాంచి
నారదుండట్లు వృషలీ కు ♦ మారుఁడగుచుఁ
బుట్టి బ్రాహ్మణానుగ్రహ ♦ మునఁ దపస్వి
యై హరింగాంచి ! మరణించె ♦ నంటివి కద. 3

కం॥ తదుపరివృత్తాంతంబును
ముదమలరఁగఁ దెలుపుమయ్య ♦ బుధజనవినుతా !
సదమలమతి విననెంతుము
సదయాత్మా ! పలుకుమయ్య ♦ స్వాంతం బలరన్. 4

ఆ॥ వె॥ అనుచుఁ బ్రశ్నసేయు ♦ నా శౌనకాదులఁ
గాంచి సంతసమ్ము ♦ గదుర సూతి
సారవంతమైన ♦ నారదుఁ దదుపరి
చరితమును వచింప ♦ సాగెనిటుల, 5

—♦ నారదుఁడు తిరిగి బ్రహ్మకు నందనుఁడై జనించుట ♦—

గీ॥ కల్పములు మూఁడు క్రమముగఁ ♦ గడచినంత
నంగిరస భృగు పంచశి ♦ ఖాది మునికు
మారులంగూడి ముక్తుఁడౌ ♦ నారదుండు
బ్రహ్మ కంఠదేశము నుండి ♦ బయలువెడలె. 6

గీ॥ నరద మనుపేర నొప్పెడి ♦ నలువకంఠ
సీమనుండి జన్మించుట ♦ చే నతండు
నారదుండను నన్వర్థ ♦ నామమంది
లోకపూజ్యుఁడై వెలసె సు ♦ శ్లోకుఁడగుచు 7

వ॥ తదనంతరంబు చేతస్సునుండి ప్రచేతసుఁడును దక్షిణపార్శ్వము
నుండి దక్షుండును ఛాయవలనఁ గర్దముండును నీవిధంబుగ మరీచి,
క్రతువు, అంగిరసుఁడు, పులహుఁడు, పులస్త్యుఁడు, భృగువు,
ఆరుణి, వసిష్ఠుఁడు, అత్రి, రుచి, సనకుఁడు, సనందనుఁడు,
సనత్కుమారుఁడు, సనాతనుఁడు మొదలగు బాలకులు చతురాన
నుని యవయవంబులనుండియు నంతఃకరణ చతుష్టయము
నుండియు బయలువెడలి సమగ్ర వేదవిద్యా పారగులై యుండ 8

గీ॥ సకల వేద వేదాంగ వి ♦ శారదులగు
తన కుమారులఁగాంచి పి ♦ తామహుండు
పరమ సంతోషపూరిత ♦ స్వాంతుఁడగుచు
సృష్టి కార్యక్రమము మొద ♦ లిడఁదలంచె. 9

గీ॥ నారదుని వేద వేదాంగ ♦ పారగతుని
సృష్టికార్యముకొఱకుఁ బ్రే ♦ రేపణంబు
సలుప మదినెంచి దరిఁజేరఁ ♦ బిలిచి వేద
సారవంతమైనట్టి వా ♦ క్సరణి ననియె. 10

గీ॥ వందనీయు లందరిలోనఁ ♦ బరమగురుఁడు
తండ్రియనియును మంత్రవి ♦ ద్యాప్రదాత
లతనికి సమానులగుట వి ♦ ద్యాప్రదుండ
నై జనకుఁడనౌ నాదు వా ♦ క్యముల వినుము. 11

—♦ బ్రహ్మ నారదుని సృష్టికార్యమునకై ప్రోత్సహించుట ♦—

కం॥ జనకాజ్ఞా పాలనమే
తనయుని కర్తవ్యమగుటఁ ♦ దడయక నా యా
జ్ఞను నీవు దారపరిగ్రహ
మును నెఱవేర్పంగవలయు ♦ మునికులతిలకా. 12

చ॥ పితృగురు శాసనంబులను ♦ బ్రీతిమెయి న్శిరమందుఁ దాల్చి స
న్మతి నెఱవేర్చువాఁడె కడు ♦ మాన్యుఁడు శిష్యుఁడు పుత్రకుండు పం
డితుఁ డతిపుణ్యవంతుఁడు వి ♦ నిర్మలుఁ డట్లొనరింపలేనివాఁ
డతి దురితాత్ముఁ డాతని కి♦హంబు పరంబును లేదు చూడఁగన్.

కం॥ గురువాక్యంబులఁ జేసిన
పురుషునకు లభించు సకల ♦ పుణ్యములు ధరన్
వరియింపుమా మదాజ్ఞను
వరవర్ణిని నొకతె నీవు ♦ భార్యామణిగా. 14

గీ॥ ఆశ్రమంబులలో గృహ ♦ స్థాశ్రమంబె
పుణ్యధర్మమూలమ్ము స్త్రీ ♦ పుత్త్రపౌత్త్ర
వర్ధమానమై భాసిల్లు ♦ భవనపంక్తి
యరయ పూర్వతపఃఫలం ♦ బగును కాదె. 15

గీ॥ కామ్య నిత్య నైమిత్తిక ♦ కర్మము లతి
భక్తితో గేస్తానర్చుచుఁ ♦ బావనులగు
దేవతలఁ దన పితరులఁ ♦ దృప్తిఁ జేసి
యైహికాముష్మికంబుల ♦ నందుచుండు. 16

గీ॥ పృథ్వి నెవ్వఁడు తన ధర్మ ♦ విధులనెల్లఁ
బరమనిష్ఠాత్ముఁడై పరి ♦ పాలనంబు
సలుపు నాగృహమేధి య ♦ శస్వి కీర్తి
ధనుఁ డతండె జీవన్ముక్తుఁ ♦ డనఁగఁబరగు. 17

గీ॥ పుణ్యపాప విమర్శన ♦ బుద్ధివీడి
స్వీయ ధర్మాచరణమును ♦ వీడు నెవఁడు
వాఁడు జీవితుఁడైన జీ ♦ వన్మృతునిగ
నెన్నుకొనఁ బడుచుండు టీ ♦ వెఱుఁగవొకొ. 18

ఆ॥ వె॥ కాన నేనొసఁగెడి ♦ యానతిఁ గైకొని
తరుణి నొకతె నిపుడె ♦ ధర్మపత్ని
గా గ్రహించి సృష్టి ♦ కార్యంబునకు నీవు
మొదలిడంగవలయుఁ ♦ బుత్రివర్య !. 19

వ॥ అని పల్కిన యా శతానందుని వాక్యములకు వ్యథితాంతః
కరణుఁడై భీతచేతస్కుండై నారదుండు వినయంబుగదుర
మృదూక్తులఁ దండ్రి కిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. 20

—♦ నారదుఁడు విధివాక్యమునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట ♦—

ఆ॥ వె॥ జనక సుతులమైన ♦ మనకిరువురకు మున్ను
ఘోర వాగ్విరోధ ♦ కారణమున
హాని సంభవించె ♦ నపకీర్తికరమైన
శాపఫలము మనకు ♦ సంభవించె. 21

ఉ॥ నీదగు శాపహేతువున ♦ నే సురయోనికులానఁ బుట్టి యా
మీఁదట శూద్రపట్టినయి ♦ మేనుధరించి ధరన్ జరించితిన్
నాదగు శాపకారణము ♦ నన్ భువనావలిలోన నీవు వా
ణీదయితా ! యపూజ్యత గ ♦ ణించుట విస్మృతిఁజెందినాడవే. 22

గీ॥ నాటి మనపట్టుదలలె యీ ♦ నాటికరయ
నిట్టి ఘోరకష్టములకు ♦ హేతువగుట
తెలియవైతివే! యేటికి ♦ ట్టుల వచింతు
వయ్య యీ పునఃకథనంబు ♦ నబ్జగర్భ! 23

సీ॥ శ్రీకృష్ణ పదయుగ ♦ సేవాధనంబును
దనయున కొసఁగెడి ♦ తండ్రితండ్రి
కృష్ణనామధ్యాన ♦ కీర్తనాదులనెల్లఁ
గరుణతో నేర్పెడి ♦ గురుఁడు గురుఁడు
శ్రీరాధికానాథ ♦ చింతనామృతమును
బంచిపెట్టెడు వాఁడు ♦ బాంధవుండు
వెనువెంటనే యుండి ♦ విష్ణులీలల నెల్ల
విన్పింపఁగలవాఁడె ♦ ప్రియహితుండు

గీ॥ శైశవమునుండి శ్రీహరి ♦ చరణభక్తి
యనెడి దివ్యౌషధమును స్త ♦ న్యమునఁ గలిపి
తనయున కొసంగి కృష్ణపా ♦ వనపదాబ్జ
దాస్యమునఁజేర్పఁగాగల్గు ♦ తల్లి తల్లి. 24

గీ॥ ఆత్మజుని హరిదివ్యపా ♦ దాబ్జభక్తి
యను పథమునుండి తొలఁగించు ♦ జనకుఁ డెట్టి
దుష్కృతంబులకైనఁ గు ♦ తూహలమునఁ
బ్రోత్సహింపఁగలఁడు తన ♦ పుత్త్రునెపుడు. 25

ఆ॥ వె॥ ముక్తికాముఁడైన ♦ పురుషున కిల దార
పరిగ్రహంబు దుఃఖ ♦ కరమెకాని
సుఖముకొఱకు కాదు ♦ సుదతులు నిజభర్త్రు
భక్తిముక్తుల కిల ♦ భంగకరులు. 26

గీ॥ సాధ్వి కులట భోగ్య యనఁగ ♦ జగతిఁ గల్గు
పడఁతుకలు మూఁడు తెఱఁగులు ♦ వారలెన్న
స్వార్థతత్పరలేగాని ♦ భర్తకెపుడు
పరమ పురుషార్థ మీఁజాలు ♦ వారు కారు. 27

గీ॥ ఐహికంబగు సత్కీర్తి ♦ నందఁదలఁచి
సంతతాధర్మ భీతయై ♦ సాధ్వి తనదు
ప్రాణనాథుని సేవింపఁ ♦ బూను గాని
సేవ సలుపదు నిష్కామ ♦ చిత్తయగుచు. 28

చ॥ సలలిత వస్త్రభోగములఁ ♦ జారుమనోహర రత్నభూషలన్
ఫలరస భక్ష్యసంతతుల ♦ వాంఛయొనర్చుచు మోహచిత్తయై
కలిత సురూపసంపదలఁ ♦ గాంతునిఁజేరి యనంగ బాణసం
చలితమనస్కయై రతుల ♦ సంతసమందును భోగ్య సర్వదా. 29

ఆ॥ వె॥ తాను కోరుకొనిన ♦ ధనభోగ విభవము
లెంతవఱకు జీవి ♦ తేశువలన
నందఁగల్గి యుండు ♦ నంతకాలము భోగ్య
ప్రాణనాథుని వశ ♦ వర్తినియగు. 30

కం॥ కులగౌరవ నాశనులై
కలుషిత చారిత్రలగుచుఁ ♦ గపటపు వలపున్
చెలువులయెడఁ బ్రకటించుచుఁ
గులటలు చరియించుచుంద్రు ♦ కువలయమందున్. 31

మ॥ మదనావేశితచిత్తయై పురుషసం ♦ పర్కంబె వాంఛించుచు
న్మదమొప్పారఁగ జారశేఖరుని సం ♦ భోగార్థమై కోరఁగా
మదిలోనెంచుచుఁ బ్రాణనాయకునిఁగా ♦ మన్నించి ప్రార్థించుచున్
మదిరం ద్రావు కవికిరియ స్గులట సం ♦ చారంబుసల్పున్సదా. 32

ఉ॥ జారునిపీ్రతికై మగని ♦ జంపుటకైనను నిశ్చయించు దు
శ్చారిణియైన యాకులట ♦ సంగతిఁగోరి వరించు మర్త్యుఁ డీ
ధారుణి నిష్ఫలంబగు వ్య ♦ థామయ జీవితము న్భరించునో
సారసగర్భ! ధాత్రి న్వ్యభి ♦ చారిణి నెవ్వఁడు విశ్వసించెడిన్. 33

గీ॥ పలుకఁ బడుచుందు రీగతి ♦ వనితలెల్ల
రధమ మధ్యమ యుత్తమ ♦ లను తెఱఁగుల
వారి మదిని గ్రహింప దై ♦ వంబుగాక
విబుధులైనను జాల రీ ♦ పృథ్విలోన. 34

గీ॥ బాకుమొనవంటిమెద శిర ♦ త్పద్మతుల్య
వదన మమృతసమంబులై ♦ మృదుల మధుర
ములగు వాక్ప్రయోగంబులు ♦ వలపులొలుకు
సైగలఁ దెలంగుచుందురు ♦ చానలెపుడు. 35

చ॥ అవినయభూమి దోషముల ♦ కాకర మజ్ఞతకాలయంబు మో
హవిపుల సాహసాన్విత మ ♦ హాకుహరంబు కృతఘ్నతాపురం
బు విషమసంశయంబులకు ♦ మూలమురూపముగొన్న మాయ యీ
భువి రమణీస్వరూప మతి ♦ మోహదమై విలసిల్లు సర్వదా. 36

గీ॥ అతినిగూఢము వారి కా ♦ ర్యక్రమమ్ము
పరమదుర్జ్ఞేయములగు భా ♦ వమ్ములట్టి
కోమలుల హృదయములను ♦ గురు తెఱుంగ
గరళధరుఁడైన శక్తుఁడు ♦ కాఁడు తండ్రి !. 37

గీ॥ తెలివలకుఁ బురుషునికన్న ♦ ద్విగుణమైన
భోజనము నాల్గురెట్లగు ♦ బుద్ధిబలము
కోపగుణము సాహసము ష ♦ డ్గుణము లగయ
కామ మెన్మిదిగుణములు ♦ కలిగియుండు.ర. 38

గీ॥ అట్టి రక్తమాంస మల మూ ♦ త్రాలయమున
సంగొని సదా క్రీడించు ♦ నట్టివారి
కమిత దుఃఖమెకాని సౌ ♦ ఖ్యంబు నాస్తి
నిరత కష్టాకరము కామి ♦ నీరతంబు. 39

గీ॥ రోగ దారిద్ర్య వార్ధక్య ♦ రూపములగు
హేతువులచేతఁ గాంతుఁ డ ♦ నిష్టుఁడైన
లోకనిందకు భయఁపడి ♦ సాకుఁగాని
పడఁతి ప్రేమతోఁ జూడ దా ♦ భర్తనెపుడు. 40

గీ॥ సతుల సంయోగమునను దే ♦ జంబు తొలఁగు
యశము నష్టమౌ పవలు మూ ♦ ట్లాడినయెడ
మాన ధన దేహ పౌరుష ♦ హానికలుగు
నట్టి స్త్రీభోగమువలన ♦ నెట్టిసుఖము ?. 41

గీ॥ సృష్టికర్తవైనట్టి నీ ♦ చిత్తమునకుఁ
దెలియరానట్టి మర్మ ము ♦ లకలవె చూడ
సర్వ మెఱిఁగియు సంసృతి ♦ చక్రమందు
నన్ను బడఁద్రోయఁ జూచెదే ♦ నళినగర్భ. 42

గీ॥ పంచపాది.
స్వర్గవాసికి నరకము ♦ వచ్చినట్లు
అమృతపాయికి విషము ల ♦ భ్యమయినట్లు
చక్రవర్తి భిక్షాటన ♦ సల్పినట్లు
సారతరమగు మోక్షము ♦ న్గోరు నాకు
ఘోర సంసారబంధంబు ♦ కూడనగునె. 43

సీ॥ జ్ఞాన కర్మేంద్రియ ♦ సంఘంబు లనియెడి
వెరపుఁ గల్గించెడి ♦ వృశ్చికములు
విషయంబు లనియెడు ♦ విషసర్ప గణములు
క్రోధకామము లను ♦ క్రూరమృగము

లరయఁగ మమకార ♦ మనఁగ నహంకార
మను భయంకర గజ ♦ గణము లొకట
దురభిమాన వికార ♦ దుర్గుణంబు లనెడు
వనసూకరంబుల ♦ పంక్తి వెలయు

గీ॥ వాంఛ లను సారమేయము ♦ ల్పరిఢవిల్ల
ఘోర కాననతుల్య సం ♦ సారమందు
సుఖమనఁగ నామమాత్రమై ♦ శూన్యమగుట
హరిపదంబులె ♦ గతికాదె ♦ యబ్జగర్భ! 44

గీ॥ అమృతపానముఁజేసి మ ♦ ద్యమును గ్రోలి
నట్లు పాటుందు సంకరుఁ ♦ డైన రీతి
"నేనుగను దిగి గార్దభ ♦ మెక్కినట్లు"
తపసికేటికి? భార్యతోఁ ♦ ద గులుపాటు? 45

సీ॥ భక్తజనకల్ప తరువయి ♦ పఱఁగు నీదు
పదములంటి ప్రార్థించెదఁ ♦ బావనమగు
ముక్తిదంబగు శ్రీకృష్ణ ♦ భక్తినొసఁగి
ధన్యుఁ గావింపఁగాఁ గోరె ♦ ద న్మహాత్మ!. 46

ం॥ అనిపలికి నారదుఁడు తన
జనకునకును మ్రొక్కి తపము ♦ సలుపంగ నను
జ్ఞనుగోరె కృతాంజలియై
తనశిరమును వంచి భక్తి ♦ తత్పరుఁడగుచున్. 47

—♦ చతురాననుని విచారము ♦—

గమనోన్ముఖుఁడై యుండిన
కొమరుని మానింప దుఁగాంచి ♦ కూరిమి వెలయన్
కమలభవుం డాత్మజు వ
లమునకుఁ జేర్చుకొని యధిక ♦ సంతాపమునన్. 48

చ॥ కరములఁ బట్టి గాఢముగఁ ♦ గౌఁగిటఁ జేర్చియు మాటిమాటికిన్
శిరమును ముద్దులాడి తన ♦ చెంత వసింపఁగఁ జేసి పుత్త్రుని
న్గురుతర శోకభారమునఁ ♦ గుందుచు నజ్ఞునిమాడ్కి మోహియై
కరమనురాగ ముప్పతిలఁ ♦ గా నిటువల్కె విచారమగ్నుఁడై. 49

ఆ. వె॥ తండ్రిమాట వినని ♦ తనయులు కడువిచా
రము నొసంగుదురు ధ ♦ రాతలమునఁ
గాన నట్టివారిఁ ♦ గలసియుండుటకన్న
బుద్ధిమాంద్యమొండు ♦ పుడమిలేదు. 50

గీ. నాడు నీవలె సనక స ♦ నందనాది
సుతులు నల్వురు నాడు నా ♦ నతి నెదిర్చి
తపము సల్పఁగఁ జనిన వృ ♦ త్తాంతమెల్ల
విదితమేకద! నీదగు ♦ హృదయమునకు. 51

గీ॥ మీర లీరీతి నాయాజ్ఞ ♦ మీరి సృష్టి
కార్యమును విడనాడి ని ♦ ష్కామబుద్ధి
తపముసలుప నేగిన నింత ♦ విపులకార్య
భార మేనేల వహియింప ♦ వలయు? చెపుమ. 52

ఆ. వె॥ చనుము నీవు తపము ♦ సలుపఁగ గోలోక
మునకుఁబోయి సర్వ ♦ మును మహాత్ముఁ
డైన కృష్ణునెదుట ♦ నంతయు వివరించి
తెలిసికొనెదఁ జేయఁ ♦ గలిగినపని. 53

వ॥ మరీచి, భృగు, క్రతు, రుచిర, కర్దమాది పుత్త్రులందరును
నీమాత్రము తత్త్వవిజ్ఞానులు కాకుండుటంజేసియే దారసంగ్ర
హణంబొనర్చి సంసార ధర్మావలంబులై మదీయ సృష్టిక్రియా
కలాపంబునకుఁ దోడ్పడుచుండిరా? ఏల యీ యనాలోచనము!
చతుర్వర్గఫలప్రదమై పారంపర్యక్రమమై వేదోక్తమైన శుభ
వాక్యము నొకదానిం దెల్పెద నాలింపుము. 45

సీ॥ వేదవిహితమై మునిజనా ♦ మోదితమగు
పరమధర్మాది పురుషార్థ ♦ ఫలమునెల్లఁ
బండితులు తమమదిలోన ♦ వాంఛఁగొందు
రవనిలో "ననుభోక్తవ్య" ♦ మగుటవలన. 55

కం॥ ఆదిని నుపనీతుండై
భూదేవసుతుండు ధర్మ ♦ మూలంబగునా
వేదాధ్యయన మొనర్చి ప్రి
మోదంబున గురుని దృప్తిఁ ♦ బూజింపవలెన్. 56

॥ తదుపరి సత్కులోద్భవను ♦ ధర్మవతి న్సుగుణానురాగసం
పదలఁ జెలంగు సాధ్విని స్వ ♦ భావవిశుద్ధను భర్తృసేవఁబెం
పొదవఁగ సల్పఁగల్గు సతి ♦ నుత్సుకుఁడై సతిగాఁ గ్రహించి తా
సదమలమానసుం డగుచు ♦ శ్రద్ధనుగర్మలఁ జేయుటొప్పగున్. 57

అరయ సత్కులమందుఁ బా ♦ పాత్మురాలు
జననమందుటనఁ గడు న ♦ సంభవంబు
కాదె "పద్మరాగమణుల ♦ గాజురాయి
పుట్టుటెగతిఁ గల్గు"నో ♦ పుత్రి! చెప్పుమ. 58

వె॥ ధరణి నేనెలంత ♦ తండ్రిదోషంబున
దుష్కులమునఁ బుట్టి ♦ దుర్వినీత
యగునో యామె దుష్ట ♦ యై సర్వవిధముల
స్వైరవృత్తిఁ గలిగి ♦ సంచరించు. 59

పతి గుణహీనుఁడైనను స్వ ♦ భావముచే నతిదుష్టుఁడైన నా
పతి కడు సాధ్వియైనఁ దన ♦ స్వామిని గొల్చును దైవబుద్ధితో
పతి సుగుణాఢ్యుఁడై సుజన ♦ వందితుఁడైనను వానిభార్య యా
క్షితిఁ గులటాఖ్య నందునెడ ♦ సేవలొనర్పక తిట్టు సర్వదా. 60

శా॥ సద్వంశంబునఁ బుట్టినట్టి సతి ను ♦ త్సాహప్రయత్నంబులన్
విద్వాంసుండగు సాధుమూర్తి ధగ న ♦ స్నేహంబుఁ గావించి తా
నుద్వాహం బొనరించుకోవలయుఁ బు ♦ త్రోత్పత్తిఁ గావించి పు
ణ్యద్వారంబునఁజేర్పఁగావలయు ని ♦ త్యానందుఁడై పూర్వులన్॥ 61

గీ॥ నీకు వేదాధ్యయనమును ♦ నేర్పియున్న
గురుఁడ నగుట నిన్నిదియె నేఁ ♦ గోరుచుంటిఁ
గావునఁ ద్వితీయ దారసం ♦ గ్రహణ మనెడి
యుక్త గురుదక్షిణ నొసంగు ♦ మో కుమార!. 62

ఆ॥ వె॥ నీదుపూర్వపత్ని ♦ నిర్మలచారిత్ర
మానవతి గుణాఢ్య ♦ మంగళాంగి
శీలవంతురాలు ♦ మాలావతిని నీదు
పత్నిగా గ్రహింప ♦ వలయుఁ బుత్ర!. 63

మ॥ మనువంశోద్భవుఁడైన సృంజయుని ధా ♦ మంబందు జన్మించి యా
వనితారత్నము రత్నమాల యనఁగా ♦ వర్ధిల్లుచున్నమ్మదిన్
నినుఁ బెండ్లాడఁగ నిశ్చయించి తపము ♦ న్దీవ్రంబుగాఁ జేయుచుం
డినవృత్తాంతము జ్ఞానదృక్కులను గం♦టి న్గాన నీవిప్పుడే. 64

గీ॥ నీకొఱకుగా జనించిన ♦ నీరజాక్షి
స్వాత్మపత్నిగ గ్రహియించి ♦ యఖిలధర్మ
నిష్ఠ జరుపుచు సంతాన ♦ నియతిఁగాంచి
నాకుఁ దోడ్పాటుసల్పుట ♦ నీకు శుభము. 65

చ॥ తొలుత గృహస్థధర్మములఁ ♦ దోరపుభక్తి నొనర్చి మీఁదటన్
గలికినిగూడి కానఁజని ♦ కామముఁజంపి జితేంద్రియత్వము
న్గలిగి తపస్వియై హరిని ♦ గానముసల్పుచు బ్రహ్మవేత్తయై
మెలఁగుట ముక్తమార్గము సు♦మీ యని చాటుచునుండె వేదముల్.

గీ॥ ఉర్వి హరిపూజయే వైష్ణ • వోత్తములకుఁ
బరమతపమని నిగమము • ల్పలుకుచుంట
నీవు. గృహమేధివై యిట • నిల్చి భక్తిఁ
గృష్ణపాదార్చనము సల్పు • మిచ్ఛతీరు. 67

కం॥ వెలుపల లోపల నంతట
నళినాక్షునిజూచు మునిగ • ణంబులకేలా
నిలలోఁదపమునొనర్పఁగ
ఫలరూపుఁడు కృష్ణుఁడెదుట • భాసిలుచుండన్, 68

కం॥ హరిబాహ్యాభ్యంతరముల
నరసి కనఁగ శక్తిలేని • యంధునకేలా
ధరలోఁ దపము నొనర్పఁగ
హరిహర తాదాత్మ్యము మది • నమరకయున్న॥ 69

గీ॥ శ్రీరమానాథ పదయుగ • సేవయొకటి
పరమతపమాట వత్స ! మ • ద్వచనమునను
శీఘ్రమే వివాహితుఁడవై • చిత్తమలర
సరసిజాక్షుని భజనంబు • సల్పుమయ్య ॥ 70

గీ॥ పూర్ణచంద్రాస్యతోడ సం • భోగమనఁగ
స్వర్గభోగతుల్యంబని • పల్కుచుంద్రు
కాన గృహివయి సకలసౌ • ఖ్యములఁదేలి
పరమ పురుషార్థఫలమును • బడయుమింక ॥ 71

ఆ॥ వె॥ పరమసాధ్వియైన • భార్య నాథునకెల
సకలసౌఖ్యముల నొ•సంగుఁగాన
ముక్తికాము లెపుడు • ముగుదలవరియింప
నాత్మఁగోరుచుందు • రనవరతము॥ 72

గీ॥ భర్తచేఁ దాను ప్రేమింపఁ ♦ బడునుగాన
భార్య ప్రియురాలగుచునుండుఁ ♦ బతికినెపుడు
సత్సుతులఁగనుటయె ప్రేమ ♦ జనముకలది
యగుట సతికన్న తనయుఁడే ♦ యధికప్రియుఁడు ॥ 73

కం॥ తనయునిబోలిన బంధువు
తనయునికన్నను ప్రియుండు ♦ ధరణిని గలఁడే
తనయా! వినుమా! యాసుతుఁ
గని యీఁగల తన్వియని సతి ♦ గాఁ గొనవలదే? 74

కం॥ సతియే యిహాపరములకును
గతియగుఁ బురుషులకు సకల ♦ కాలములందున్
క్షితిలోనఁ బతివ్రతలగు
సతులకు ముమ్మూర్తులైనఁ ♦ జాలరుతనయా !. 75

కం॥ జనకునిస్వర్గసుఖమునకుఁ
దనయుఁడె కారణుఁడు మరియుఁ ♦ దండ్రిజగానన్
మనమున వాంఛించుచుఁ బు
త్త్రినివలనఁ బరాజయమును ♦ తుష్టినిబొందున్. 76

గీ॥ అట్టి తనయు నీఁజాలు భా♦ర్యనుగ్రహించి
గేస్తువై హరినామసం ♦ కీర్తనంబు
ననయ మొనరించుచునుమదీ ♦ యమగు సృష్టి
కీవు తోడ్పాటుఁగావింప ♦ నెంచుమయ్య. 77

గీ॥ తనయునకు ద్వితీయాశ్రమ ♦ ఘనతనెల్ల
నీవిధంబున బోధింప ♦ హృదయమందు
వ్యాకులంబు జనింప జ్ఞా ♦ నాధికుఁడగు
నారదుఁడు ధాతతో నను ♦ ధీరుఁడగుచు. 78

—♦ నారదుఁడు బ్రహ్మను సమాధాన పరచుట ♦—

మ॥ నిగమార్థంబు లెఱింగియుండియుఁగటా ♦ నీవీ యసన్మార్గమున్
దగునా చూపఁగ నీకుమారకునకు ♦ ధర్మస్వరూపుండవై
జగముల్ సృష్టియొనర్చు తండ్రివి త్వదా ♦ జ్ఞన్మిరుపాపంబిటు
ల్నగతుల్యంబుగ నా శిరాన నిడదే? ♦ న్యాయంబుగాఁదోఁచెనే? 79

మ॥ నళినీప త్త్రి జలంబుభాతిఁ గడుచాం ♦ చల్యంబుతోనెప్పుడు
న్విలసిల్లునద! జీవితంబిలను భా ♦ వింపంగ ముల్లోకము
ల్జలరేఖావళిరీతి మిథ్యగద ని ♦ స్సారంబు సంసార మో
జలజాతోద్భవ! నీవెఱింగియును న ♦ న్నాసింపఁగాఁజూచెదే॥ 80

గీ॥ అతిభయంకరమైన భ ♦ వార్ణవమున
నెవరుతండ్రి యెవ్వా పుత్త్రుఁడో ♦ యెఱుఁగపడదు
ఎవనికర్మమె వానికి ♦ హితసుతగతిఁ
బరగుచుండుట సత్యంబు ♦ ధరణిలోన॥ 81

కం॥ తనధనము గృహమునన్, హిత
జనములు బాంధవగణము శ్మ ♦ శానమువఱకే,
తనసుకృత దుష్కృతంబులు
తనవెంటనె వచ్చుననుట ♦ తథ్యముకాదే॥ 82

గీ॥ తాన శిష్యునిచేత సు ♦ కర్మములను
గోరి చేయించువాఁడె స ♦ ద్గురువరుండు
తనకుమారునిచేత స ♦ త్కార్యములను
బూని చేయించు తండ్రియే ♦ పుణ్యతముడు॥ 83

వ॥ నారదుండిట్లు వినయంబుగదుర నాత్మసంకల్పంబును బితామహు
నకు నివేదించినవాఁడై శాంతవాక్యంబుల నతని నంగీకరింపఁ
జేయు తలంపున విధిచరణద్వయంబునకుఁ బ్రణామంబొనరించి
భక్తితత్పరుఁడై మధురవచనంబుల నిట్లనియె. 84

గీ॥ తండ్రి! కోపగింపకుము నా ♦ తలఁపు నీకుఁ
దెలియఁబల్కితిఁగాని నీ ♦ దివ్యశాస
నమును జవదాటు భావంబు ♦ నాకులేదు
నిశ్చయించితిఁ గర్తవ్య ♦ నిర్ణయమును ॥ 85

గీ॥ కలదు తుదివిన్నపంబొండు ♦ కనకగర్భ!
ఆలకింపుము తొలుతనే ♦ నామహాత్మ్యఁ
డైన నారాయణమహర్షి ♦ యాశ్రమమును
జేరి యాదివ్యమూర్తి ద ♦ ర్శింపఁదలఁతు ॥ 86

ఆ॥ పిదప నతనివలన ♦ విననెంచితిని గొన్ని
విమల ధర్మములను ♦ వీనులలర
తత్కథామృతమును ♦ దనివితీరఁగఁగ్రోలి
చెలియనొర్తుఁబెండ్లి ♦ జేసికొనెద. 87

కం॥ అనిపల్కు నారదునిపై
యనిమిషకోటులు బిరాన ♦ నలరులవాన
న్మనమలరఁగఁ గురిపించిరి
జనకుఁడు పరమేష్ఠి మిపుల ♦ సంతసమందన్. 88

గీ॥ నారదుఁడు వేదవిద్యావి ♦ శారదుండు
బ్రహ్మ వదనపద్మముఁ గాంచి ♦ పలికెనిటులు
హృదయవాంఛితమైన శ్రీ ♦ కృష్ణమంత్ర
ము నుపదేశం బొసంగుమో ♦ యనఘ! నాకు. 89

గీ॥ పరమశుభదంబు తద్గుణ ♦ వర్ణనంబు
మోక్షసామ్రాజ్య సంధాన ♦ మూలకంబు
కృష్ణపావననామసం ♦ కీర్తనంబు
తండ్రి! నాకట్టికృష్ణమం ♦ త్రమునొసఁగుము. 90

కం॥ నారాయణముని బోధా
సారమువిని పిదప నీదు ♦ సంతసమునకై
దారపరిగ్రహణంబును
సారసభవ! చేయువాఁడ ♦ సంశయమేలా? 91

ఆ॥ వె॥ ఎట్టికార్యమైన ♦ హృదయంబు స్వచ్ఛమై
సంశయంబులన్ని ♦ సమసినపుడె
పూర్ణయత్నమూని ♦ పురుషుండు కార్యముల్
జిత్తశుద్ధితోడఁ ♦ జేయఁగలుగు. 92

—♦ బ్రహ్మదేవుఁడు నారదుని కైలాసమునకుఁ బొమ్మనుట ♦—

మత్తకోకిల.
నారదుం డపుడన్న సద్వచ ♦ నంబులన్నిని సంతసం
బారఁగాఁ బరమేష్ఠి పుత్త్రుని ♦ యాస్యము న్బరికించుచున్
సారవంతములైన పల్కులు ♦ స్వాంతముల్లసిలంగ సో
దారుఁడై వచియించె నీగతి ♦ ధర్మపద్ధతిఁ జూపుచున్. 93

ఆ॥ వె॥ తగినభర్త తగిన ♦ ధర్మపత్ని తగిన
గురుఁడు దొరుకుటరిది ♦ ధరణిలోన
పూర్వజన్మసుకృత ♦ పుణ్యమున లభించుఁ
గాని, కోరినంతఁ గలుగఁబోదు॥ 94

ఆ॥ వె॥ కన్న తండ్రికన్నఁ ♦ గాచు విభునికన్న
యతులకన్న భిన్నుఁ ♦ డైనపుణ్య
ధ్యాననిష్ఠు నొకని ♦ యాచార్యునిఁగ నెంచి
పరమమంత్రములను ♦ బడయవలయు॥ 95

చ॥ పరముఁడు ప్రాక్తనుండు సుర ♦ వంద్యుఁడు లోకగురుండు శ్రీమహే
శ్వరుఁడు మహానుభావుఁడు శు ♦ భప్రదుఁ డాఢ్యుఁడు భక్తలోకశం
కరుఁడు గిరీశుఁడే గురుఁడు ♦ కాదగువాఁడనినిశ్చయించి నీ
వరుగుము మంత్రదీక్షఁ గొన ♦ నారజతాచలవాసుచెంతకున్॥ 96

ఆ॥ వె॥ శివుఁడు శివకరుండు ♦ శ్రితపారుజాతంబు
శాంతమూర్తి యచల ♦ జాధవుండు
జ్ఞానులకు గురుండు ♦ శంకరమూర్తి తా
నిచ్చుఁగాక నీక ♦ భీష్టములను॥ 97

ఆ॥ వె॥ శివునివలన మంత్ర ♦ సిద్ధినిబొంది నా
రాయణాశ్రమమున ♦ కరిగి సకల
విషయముల నెఱింగి ♦ వేగమే నాలోక
మునకుఁ జేరరమ్ము ♦ పుత్త్రవర్య! 98

గీ॥ అనిపలికి విధి విరమించె ♦ నంత వాని
వర్యుఁడౌ నారదుఁడు కడు ♦ భక్తితోడఁ
దండ్రి పదయుగమునకు వం ♦ దనమొనర్చి
చనియె శివలోకమునకు ను ♦ త్సాహమొసఁగ. 99

ఆశ్వాసాంతము

సుగంధివృత్తము.

శ్రీమహీసుతా కరాబ్జ ♦ సేవితాంఘ్రిపంకజా!
కామకోటి సుందరాంగ! ♦ కాలకంఠపూజితా!
కామవైరి భీమచాప ♦ ఖండనా! రఘూత్తమా!
రామచంద్ర! శ్రీప్రసన్న ♦ రాఘవా! పరాత్పరా! 100

గద్య॥ ఇది శ్రీరామచంద్ర వరప్రసాద లబ్ధకవితాభాగధేయ
కేతవరపువంశ పయఃపారావార రాకాసుధాకర
శ్రీ లక్ష్మీనృసింహ గురుపుత్త్ర రామకృష్ణ
నామధేయ ప్రణీతంబైన
"భక్త నారదీయ"
మను గద్యపద్యాత్మక
కావ్యమునందుఁ
జతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ సీతావల్లభాయ నమః.

# భక్తనారదీయము

## పంచమాశ్వాసము

కం॥ శ్రీకంఠార్చితరూపా!
శోకాపహా! రత్నహార ♦ శోభితదేహా!
పాకారివినుత పదయుగ!
శ్రీకర! లోకాభిరామ! ♦ శ్రీరఘురామా! 1

వ॥ దేవా! అవధరింపుము. 2

గీ॥ శౌనకాదులతోడ నా ♦ సౌతి భక్త
వర్యుఁడైన నారదుని యా ♦ వలిచరిత్రఁ
బరమసంతోష పూరిత ♦ స్వాంతుఁడగుచుఁ
బలుకఁదొడఁగెను భక్తిభా ♦ వంబుగదుర. 3

### —♦ నారదుండు తండ్రియాజ్ఞచే శ్రీకృష్ణమంత్రోపదేశమునకై శివుని కడ కేగుట ♦—

కం॥ క్షణకాలములో నారద
మునివరుఁ డేగెను బిరాన ♦ భూతేశగృహం
బున కతిమోదాన్వితుఁడై
మనసారఁగఁ గృష్ణ దివ్య ♦ మంత్రము నడుగన్. 4

సీ॥ ధ్రువమండలముకన్న ♦ దూరంబు నూర్ధ్వంబు
రత్నౌఘ నిర్మాణ ♦ రాజితంబు
వివిధమందిర సము ♦ న్వితం మతిపూజ్యంబు
మునియోగిగణపరి ♦ పూరితంబు

గరుడ గంధర్వ కి ♦ న్నర పరికీర్తితా
నంతప్రభావ స ♦ మంచితంబు
మాణిక్య వైడూర్య ♦ మౌక్తికస్థగిత మ
నోహరసౌధసం ♦ దోహయుతము

గీ॥ ప్రమథభూతగణాది వి ♦ భ్రాజితంబు
కల్ప పున్నాగ వట దేవ ♦ కాంచనాది
తరుసమేతంబు కైలాస ♦ గిరివరస్థ
శంకరాగార మపవర్గ ♦ సౌఖ్యదంబు 5

గీ॥ ఆర్తిరోగభయాది సం ♦ హారకమయి
కల్పతరు కామధేను సం ♦ కలితమగుచు
నెన్న భువనత్రయముకన్న ♦ మిన్నయైన
శంభులోకంబుఁజేరి వి ♦ స్మయముఁజెంది ॥ 6

సీ॥ శివుని శాంతు ననంతు ♦ శివదాయకుని భూత
నాథు నక్షరునిఁ బి ♦ నాకహస్తు
సిద్ధేశ్వరుని జంద్ర ♦ శేఖరు నీశాను
భవరోగనాశను ♦ భక్తవరదు
భుజగేంద్రహారాది ♦ భూషితదేహుని
భస్మలిప్తాంగుని ♦ భవరహితుని
సిద్ధయోగాసనా ♦ సీనుని శ్రీకృష్ణ
నామజపంబు నో ♦ సర్చువాని

గీ॥ కాలకాలు మృత్యుంజయు ♦ నీలకంఠు
నచలజాధీశ్వరుగని పుల ♦ కాంకితుండయి
ఫాలమును నేలఁగీలించి ♦ భక్తిమొక్కి
నిటలమున నంజలిని గూర్చి ♦ నిలువనపుడు ॥ 7

సీ॥ ప్రవిమల కాషాయ ♦ వస్త్రయుగ్మావృత
మై కానుపించు దే ♦ హంబువాని
మెఱపు తీగలకన్న ♦ మించి భాసిల్లెడి
జటిలమౌ నెఱి జటా ♦ పటలివాని
ఘనమునీశ్వర రూప ♦ మునఁ జూడవచ్చిన
వనజాక్షుభక్తి రూ ♦ పంబువాని
చంద్రికాతుల్యమై ♦ సాంద్రమై విలసిల్లు
భస్మాంగరాగ లే ♦ పంబువాని

గీ॥ కరయుగంబున వల్లకి ♦ కలుగువాని
నోటఁగృష్ణనామంబును ♦ నుడువువాని
తులసిమాలలుగల యుర ♦ స్థలమువాని
సతతబ్రహ్మవిచారణ ♦ సలుపువాని ॥ 8

ఆ॥ వె॥ వేదవిద్వరిష్టు ♦ విమల గానవినోదుఁ
డాపసేంద్రు నార ♦ దమునివరుని
సాంబశివుఁడు భవుఁడు ♦ సకలలోకగురుండు
శంకరుండు సంత ♦ సమునఁ గాంచి. 9

చ॥ ప్రముదిత మానసుండగుచు ♦ భక్తవరేణ్యుని మానిచంద్రు సం
భ్రమమునఁ గౌఁగలించి తన ♦ పాణి శిరంబుననుంచి చెంత నా
విమలతపోధనాగ్రణిని ♦ వేడుకమీఱ వసింపఁజేసి యా
గమన ప్రయోజనం బడుగఁ ♦ గామవిరోధునిగాంచి నమ్రుఁడై. 10

గీ॥ నిలువఁబడి నమస్కృతిఁజేసి ♦ నీలకంఠు
సదయహృదయాంతరంగుని ♦ మదనదమను
శ్రుతివిహితములౌ శ్రీరుద్ర ♦ సూక్తములను
ప్రస్తుతులఁజేసి వామపా ♦ ర్శ్వమునఁ జేరి, 11

కం॥ హృదయగత వాంఛితంబును
విదితంబొనరించి పల్కె ♦ వృషవాహనుతో
సదయాత్మ ! కృష్ణమంత్రము
ముదమున నాకొసఁగుమయ్య ♦ పూర్ణేందుధరా !. 12

గీ॥ ధ్యాన మాలా కవచయు క్త ♦ మైనకృష్ణ
మంత్రము నుపదేశంబీయు ♦ మా మహేశ !
నీవలన నేఁడు కృష్ణపూ ♦ జావిధాన
మెఱుఁగఁగోరితిఁ దెల్పవే ♦ కరుణతోడ. 13

వ॥ అనివిన్నవింపఁ బరమశివుఁడు సంతుష్టాంతరంగుండై. 14

ఉ॥ నారదు కోర్కెలన్విని పి ♦ నాకధరుండు శిరంబునెత్తి సం
సారలతాలవిత్రమును ♦ శాంతిసుఖాస్పదతత్త్వసారమున్
భూరి మహాతపోబల వి ♦ భూషిత తాపస చింతనీయ వి
స్ఫార త్రివర్ణయుక్తప్రణ ♦ వంబుఁబఠించెను జ్ఞానసాధ్యమున్. 15

—♦ నారదునకు శివుఁడు శ్రీకృష్ణమంత్రము నుపదేశించుట ♦—

వ॥ పరమేశ్వరుఁడారీతిగ నారదునియెదుట నీ వుపాసింపఁగోరిన శ్రీ
కృష్ణుఁడు ప్రణవస్వరూపుఁడే సుమాయని తెలుపుటకోయనఁదిమా
త్రాపరివృతంబును, త్రిమూర్త్యాత్మకంబును, ఆద్యంబును,
యోగీశ్వరధ్యేయుంబునగు నోమ్కారము నుచ్చరించి 16

కం॥ ఇరువదిరెండక్షరముల
హరిమంత్రము నొసఁగెనపుడు ♦ న్యాసయుతముగాఁ
బరమానుగ్రహమున ముని
వరునకు శంకరుఁడు పరమ ♦ వాత్సల్యమునన్ 17

గీ॥ ధ్యానమును కవచమును మం ♦ త్రమును దెల్పి
స్తోత్రపూజావిధులను సం ♦ తుష్టమతిని
బోధనముఁజేసె నావేళ ♦ మునివరునకు
శంకరుఁడు భక్తలోకవ ♦ శంకరుండు ॥ 18

వ॥ పరమేశ్వరుఁడావిధంబున నారదునకు "ఓమ్నమోభగవతే రాసమండలేశ్వరాయ గోపాలకృష్ణాయ స్వాహా" అను శ్రీకృష్ణద్వావింశత్యక్షరమహామంత్రమును బ్రణవయుక్తంబుగ సాంప్రదాయసిద్ధముగ నుపదేశమిూయ 19

ఆ॥ వె॥ భవునివలన మాని ♦ పరమగోప్యములైన
కృష్ణమంత్రనామ ♦ కీర్తనాది
సంగతులనెఱింగి ♦ సంపూర్ణకాముఁడై
వందనములసల్పి ♦ పలికె నిటుల ॥ 20

గీ॥ భక్తియననేమొ? దాని ప్ర ♦ భావమేమొ?
యెట్టివాని నాచార్యుఁగా ♦ నెన్నవలెనొ?
గురువుకడ మంత్రదీక్షను ♦ గొనుటవలనఁ
గలుగులాభంబుఁదెల్పవే? ♦ గరళకంఠ! 21

కం॥ అని తన్నడిగిన నారద
మునివరునకు సాంబశివుఁడు ♦ మోక్షదమగు భ
క్తినిగూర్చిపల్కె జగముల
కును కల్యాణంబుకలుగు ♦ కోరికతోడన్ ॥ 22

—♦ శివుఁడు మునికి భక్తిస్వరూపమును బోధించుట ♦—

గీ॥ మహిని మోక్షేచ్ఛకల మహా ♦ మహులకెల్ల
భక్తిభావనఁబొందుటే ♦ బలకరమగు
సాధనము కాన నెల్లరీ ♦ శ్వరునియందు
జిత్తమును సదా లగ్నంబుఁ ♦ జేయుటొప్పు ॥ 23

గీ॥ స్వస్వరూపానుసంధాన ♦ సాధనంబె
భక్తికనిద్రోవ యనుచును ♦ బల్కుచుంద్రు
ప్రాజ్ఞులట్టినిర్వచనముల్ ♦ శ్రద్ధతోడ
నాలకింపుము మునికు ♦ లాగ్రగణ్య! 24

సీ॥ పూజ్యుల ననురాగ ♦ బుద్ధిఁగాంచుట "భక్తి"
యని నిర్వచించెను ♦ వ్యాసమౌని
హరికథలందు మ ♦ హాసక్తియే "భక్తి"
యని వచించెను గర్గ ♦ మునివరుండు
స్వాత్మస్వరూపమం ♦ దాసక్తియే "భక్తి"
యనుచును శాండిల్య ♦ ముని వచించె
నుత్ప్రీతిగా స్వధ ♦ ర్మములఁ జేయుటె "భక్తి"
యనికృష్ణవిభుఁడు తా ♦ ననియె మున్ను.

గీ॥ వేయియేటికి? యొకమాట ♦ వినఁగదయ్య!
అన్యసంపర్కశూన్యమై ♦ యమలమైన
చిత్తవృత్తితో హరిసేవఁ ♦ జేయుటొక్కటె
ముక్తి సాధనమైన "స ♦ ద్భక్తిధనము." 25

కం॥ హరియం దనన్యమమతయె
పరమప్రేమాస్పదమగు ♦ భక్తియటంచున్
స్థిర నిర్వచనమొనర్చిరి
కరుణామయులైన మౌని ♦ గణములు ధాత్రిన్. 26

—♦ భక్తలక్షణము ♦—

సీ॥ నిగమచోదిత ధర్మ ♦ నిష్ఠాగరిష్ఠుఁడై
కులనియమంబులఁ ♦ గోలుపోక
పెద్దలయెడ శ్రద్ధ ♦ పిన్నలయెడఁ బ్రేమ
పేదలయెడ జాలి ♦ విడువకుండ
అతిథి పూజలయెడ ♦ నలసుఁడు కాకుండ
సర్వసమత్వమున్ ♦ జారనీక
సర్వపదార్థము ♦ ల్సర్వభూతంబులు
దైవరూపములను ♦ తలఁపుకలిగి

గీ॥ కృష్ణలీలావిలాస సం ♦ కీర్తనమునఁ
దన్మయతఁగాంచి సర్వత్రి ♦ దైవబుద్ధి
కలిగి శ్రీకృష్ణదర్శనా ♦ కాంక్షియగుచు
భజన సల్పుచునుండును ♦ భక్తుఁడెపుడు. 27

గీ॥ పాటఁబాడినఁ గృష్ణుని ♦ పాటఁబాడు
నాటలాడిన శ్రీహరి ♦ యాటలాడు
వినినచోఁ గృష్ణకథలనే ♦ వినుచునుండు
నుడివినను కృష్ణనామమే ♦ నుడువుచుండు. 28

సీ॥ స్నాన సంధ్యాద్యను♦ష్ఠానాది కర్మముల్
శౌర్యార్చనేచ్ఛతో ♦ సలుపుచుండు
హరిదివ్యమంత్రి జ ♦ పానందచిత్తుఁడై
తదితరముల మదిఁ ♦ దలఁపఁడెపుడు
పిలున్నయపు డెల్ల ♦ విషయంబులను వీడి
నామసంకీర్తనా♦నందుఁడగును
ప్రాణికోటులనెల్లఁ ♦ బరమేశ్వరస్వరూ
పములంచుఁదలఁచి బా♦ష్పముల విడుచు

గీ॥ కమలలోచన సుందరా♦కారదివ్య
దర్శనాపేక్షఁ జిత్త సం♦తాపమందు
భక్తవర్యుఁడు కృష్ణసే♦వలకుఁజిక్కి
ముక్తినైన వాంఛింపఁడు ♦ పుడమినతఁడు ॥ 29

గీ॥ దేవదేవుని ప్రేమను ♦ భావమందు
వాంఛఁజేసిన భక్తుఁ డీ ♦ వసుధలోన
వివిధ విషయంబులకుఁ గడు ♦ విసిగికొనుచు
హేయములనుచు మదినెంచి ♦ రోయుచుండు ॥ 30

సీ॥ కన్నతండ్రి యటంచు ♦ గౌరవించుచునుండు
గురుమూర్తి యంచును ♦ గరము మోడ్చు
అన్నగారనియెంచి ♦ మన్నించి సేవించు
కులవృద్ధుఁడనుచు సే ♦ వలనుసలుపు
కొమరుఁడటంచును ♦ గూరిమిఁ బోషించుఁ
బాలించురాజని ♦ భయమునందు
ఆత్మబంధువనుచు ♦ నాదరమ్మునఁజూపుఁ
బూజ్యదైవంబని ♦ పూజసల్పు
గీ॥ నివ్విధమ్మున సద్భక్తుఁ ♦ డెల్లగతులఁ
దనకుఁగల సర్వభావంబు ♦ లను రమేశు
పాదపద్మార్చనమున క ♦ ర్పణమొనర్చి
తనదు ప్రేమైకనిధి యని ♦ తలఁచుచుండు ॥ 31

—♦ భక్తియనఁ బరమప్రేమ యని శివుఁడు నిరూపించుట ♦—

కం॥ తనయులు బంధులు జననీ
జనకులు సోదరులు మిత్త్ర ♦ సంఘమును సదా
తనయిష్టదైవమనుచును
మనమునఁ దలపోసి భక్తి ♦ మయుఁడై కొల్చున్. 32

వ॥ దానంజేసియే "భక్తి"యనఁ బరమేశ్వరునియందుఁ గలఁ పరమ ప్రేమ, యని నిశ్చయింప వలయును. ఆప్రేమయే యవిచ్ఛిన్నమైన, సర్వరససర్వభావాతీతమైన, పరబ్రహ్మవిర్భూతయగు దివ్యకళ యనియుఁ బ్రకృతియనియు నానందరూపిణియనియుఁ బేర్కొనఁబడుచున్నది. మరియునాప్రేమ స్థితప్రజ్ఞులగు సాధకుల నాశ్రయించి వారికిఁ బరమేశ్వరైక్యానుసంధానముఁ గల్గించుచున్నది. 33

సీ॥ ప్రాణివర్గముల నీ ♦ శ్వరసన్నిధిని జేర్చు
బలమైన సోపాన ♦ పంక్తి "ప్రేమ"
నరుల చిత్తంబులఁ ♦ బరమేశునిం జేర్చు
ఘనతరమగు రసా♦యనము "ప్రేమ"
ఈశ్వరమాహాత్మ్య ♦ మెల్లఁజూపించు దు
ర్భిణియంత్రమై ధర ♦ వెలయుఁ "బ్రేమ"
సద్భక్తులకు దైవ ♦ సందేశ మిచ్చు దూ
రశ్రవణైకయం♦త్రంబు "ప్రేమ"

గీ॥ దైవ లీలాస్వరూపమై ♦ తనరు "ప్రేమ"
అట్టి ప్రేమమయుఁడు పర♦మాత్ముఁడగుట
జగతిలోఁ "బ్రేమభక్తియే" ♦ సాధకునకు
దైవసాన్నిధ్యమొసఁగుఁద ♦ థ్యంబుసుమ్మి. 34

గీ॥ తనయులను గాంచఁజాలని ♦ తరుణిభవము
దేవతావిగ్రహము లేని ♦ దేవగృహము
భక్తిశూన్యమౌ జన్మంబు ♦ వసుధలోన
వ్యర్థమగుఁగాని సార్థక్య ♦ మంద దెపుడు. 35

గీ॥ ఆస్యమీశ్వరనామస ♦ హస్రపఠన
మాత్రమునఁ బవిత్రంబగు ♦ మానవులకు
తనువు భాగీరథీ స్నాన♦మునను, భవము
దైవభక్తివలన ధన్య♦తనువహించు 36

ఉ॥ వేదపురాణ శాస్త్రముల ♦ విప్రజనంబుల భక్తసంఘమున్
సాదరబుద్ధి గౌరవము ♦ సల్పక నిందనొనర్చు దుష్టుఁడీ
మేదిని గష్టజీవియయి ♦ మిక్కిలి దుఃఖమునంది చచ్చి వి
ష్టాదమొనర్చుచుండును భ♦యంకర రౌరవమందు సర్వదా॥ 37

గీ॥ జగతి నెవ్వఁడు తన మన ♦ స్సామజమును
భక్తిరూపాంకుశంబున ♦ వశముఁ జేసి
కొనఁగఁజాలునో యాతఁ డీ ♦ కువలయమునఁ
బాపరహితుఁడై ముక్తిని ♦ బడయఁగలఁడు ॥ 38

ఆ॥ వె॥ కపిలగోవు, గీత, ♦ గంగ, భక్తవరుండు,
విష్ణుభజన మొకటి ♦ పృథ్వి నైదు
నౌకలగుచు సకల ♦ నరులను సంసార
సాగరమ్మునుండి ♦ సాకుచుండు ॥ 39

ఆ॥ వె॥ భక్త హృదయములను ♦ భగవానుఁ డుండుట
భువిని భక్తులెపుడు ♦ పూజ్యతములు
వారి నిందసేయు ♦ వారలు జారిణీ
పుత్రులై యఘంబుఁ ♦ బొందుచుంద్రు ॥ 40

గీ॥ వసుధ నీశ్వరానుగ్రహ ♦ పాత్రులగుట
భక్తజనములఁ బోలెడి ♦ వారు లేరు
వారలకు సములగువారు ♦ వారె కాక
నన్యులెవ్వరు పోల రీ ♦ యవనిలోన 41

గీ॥ "భక్తి"యననేమొ దానిప్ర ♦ భావమేమొ
భక్తుని గుణంబు లెట్టివో ♦ పల్కియుంటి
నింక నెవ్వాని గురువుగ ♦ నెన్నవలయు
నావిధంబును దెల్పెద ♦ నాలకింపు ॥ 42

—♦ సద్గురు లక్షణము ♦—

చ॥ నిరుపమశాస్త్రవేత్త, గురు ♦ నిష్ఠుఁడు, తత్త్వవిచారభావనా
పరుఁడు, జితస్పృహుండు, జన♦వంద్యుఁడు, వైదికధర్మవేత్తయై
పరఁగెడివాని యోగివరు ♦ బ్రహ్మవిదు న్నిగమార్థకోవిదుఁ
గురువుగనెంచి సాధకుఁడు ♦ కోరివరించి తరించఁగావలెన్. 43

సీ॥ సాంగవేదంబులు ♦ శ్రద్ధాసమేతుండై
యధ్యయనముఁ జేసి ♦ నట్టివాని
శాస్త్రములను జతు ♦ ష్షష్టికళలయందు
మిన్నయై నిపుణుండై ♦ యున్నవాని
వర్ణాశ్రమాచార ♦ పరమధర్మంబులఁ
గడునిష్ఠతోఁ జేయఁ ♦ గలుగువాని
బ్రహ్మవిచారణా ♦ వ్యాసంగమునఁద త్త్వ
విద్వరిష్ఠుండౌచు ♦ వెలయువాని

గీ॥ విజితశత్రుషడ్వర్గుని ♦ విష్ణునామ
చింతనాఽమృతపానమున్ ♦ జేయువాని
నఖిల మాత్మస్వరూపమం ♦ చరయువాని
గురువు గవరించి యాతని ♦ గొలువవలయు. 44

గీ॥ గురుఁడె పరమేష్ఠి, విష్ణువు ♦ గురుఁడె, శివుఁడు
గురువరుఁడే, పరబ్రహ్మంబు ♦ కువలయమున
పుడమిని "నగురోరధికం" బ♦నెడి సుభాషి
తము నెఱుంగవె? నారద! ♦ ధన్యచరిత!. 45

గీ॥ శిష్యకోటులఁ గరుణార్ద్ర ♦ చిత్తుఁడగుచు
జ్ఞానబోధచే నపవర్గ ♦ సౌధమునకుఁ
బంపఁగలవాఁడు సద్గురు ♦ స్వామియగుట
ము క్తికాముఁడు గురుదీక్షఁ ♦ బొందవలయు. 46

—♦ గురుమహిమ, గురుసేవాధిక్యము ♦—

చ॥ గురుపదసేవఁ జేయక ని ♦ గూఢపరార్థ విమర్శనంబులన్
సరగున శాస్త్రచింతనము♦న న్సమకూర్పఁ గనెంచువాఁడిలన్
స్వరముల నభ్యసింపకయె ♦ సభ్యులకు న్దన గానశాస్త్ర వై
ఖరి వినుపింపనెంచి వడి♦గా నరుదెంచిన మూర్ఖుఁబోలెడిన్ ॥ 47

సీ॥ అభిమానవనవహ్ని ♦ యనురాగతరు కుఠా
రము ధాత్రి సద్గురూ ♦ త్తముని సేవ
ఆనందధామ మజ్ఞానలతాలవి
త్రంబగు సద్గురూ ♦ త్తముని సేవ
భవవార్థితరణి దు ♦ ర్భరపాపమత్తేభ
హరియగు నాచార్య ♦ వరుని సేవ
పరమార్థఖని తత్త్వ ♦ వాక్యార్థచంద్రిక
పావన దేశిక ♦ స్వామి సేవ

గీ॥ కామక్రోధాది శత్రుషట్కమునడంచి
మోహకారణ భవబంధ ♦ ముక్తినిగని
యాత్మవిజ్ఞాని యగుటకై ♦ యవనిలోన
సద్గురూపదేశమె తగు ♦ సాధనంబు. 48

ఉ॥ వెన్నెలలేనిరాత్రి, పృథివీపతిగల్గనిరాజధాని, యా
పన్నులఁ గావలేని బలవంతునిశౌర్యము, సూర్యకాంతిసం
పన్నముకాని యాదినము, ♦ పావన సద్గురుమంత్రదీక్షచే
మన్నన నందలేని నరు ♦ మన్గడ, ధాత్రిని వ్యర్థమేకదా. 49

కం॥ గురుశాసనముల భక్తిని
నెఱవేఱుచుశిష్యవరుఁడు ♦ నిత్యశుభములన్
స్థిరతరశాంతిని గాంచుచుఁ
బరమేశుని దయను పరమ ♦ పదవిని బొందున్. 50

గీ॥ ఎవఁడు సద్గురు వాక్తిర ♦ స్కృతినొనర్చి
శాసనోల్లంఘన మొనర్చ ♦ సాహసించు
నాదురాత్ముండు సూర్యచంద్రాదులుండు
వఱకు ఘోరనారకవహ్నిఁ ♦ బొరలుచుండు. 51

గీ॥ వేయుయేటికి ? నొకమాట ♦ వినుము వత్స !
గురునికృపఁ గాంచలేని యా ♦ నరునిభవము
వ్యర్థ మాతఁడొనర్చు ధ♦ర్మాచరణము
సార్థకతఁ జెందదెన్నటి♦కైన నిజము. 52

ఆ॥ వె॥ గురుఁడు సంతసింప ♦ సిరులు లభ్యంబగు
సర్వమంత్రసిద్ధి ♦ జయముకలుగు
గురువు కోపగింప ♦ ఘోరకష్టంబులు
సర్వనాశనంబు ♦ సంభవించు॥ 53

గీ॥ తన యభీష్టదేవతకుఁ గ్రో♦ధము కలిగిన
సద్గురుండు రక్షించును ♦ జగమునందు
గురువు కోపమునకుఁ దాను ♦ గుఱియగునెడఁ
గావఁజాలరు నిర్జర ♦ గణములైన॥ 54

గీ॥ కావున నభీష్టదైవము కన్న ♦ గురుఁడె
వందనీయుఁడు పూజ్యుఁడు ♦ పావనుఁడని
సామవేదమున న్మారి ♦ చాటియుంట
గురుని పాదపద్మంబులఁ ♦ గొల్చుటొప్పు॥ 55

వ॥ అని వచియించిన మహేశ్వరునిగాంచి నారదుం డమందానంద కందళిత హృదయారవిందుఁడై సదాశివునకుఁ బునఃప్రణామంబు లాచరించి మహాదేవా! నీయనుగ్రహమునఁ గృష్ణమంత్రలాభ మేకాక, భక్తితత్త్వమును పరమప్రేమయొక్క స్వరూపంబును ప్రేమభక్తుల యభిన్నభావంబును ప్రేమయందలి యనన్యతయును తల్లక్షణములును సోదాహరణములుగాఁ దెలిసికొనఁగలిగితిని, భక్తిసాధనంబును పరాభక్తి గౌణభక్తుల భేదంబును సత్సాంగత్య మహిమంబును గురుసేవా మాహాత్మ్యంబును మొదలగు గూఢవిషయంబులను నీవలనఁ దెలిసికొనంజాలితిని. సర్వయోగములకును సర్వసాధనములకును సర్వధర్మములకును బ్రధానాచా

ర్యుఁడవగు నినుఁబోలు సద్గురువును సేవించుటవలనఁ గృతార్థుఁ
డనైతిని. ఇంక నిత్యకర్మానుష్ఠానము భక్ష్యాఽభక్ష్య పదార్థ
నిర్ణయము మొదలుగాఁగల విషయములఁగూర్చి యెఱుకపరుపవే
యనవుడు గిరిజాపతి మందస్మితవదనుఁడై యిట్లనియె. 56

—♦ నిత్యకర్మానుష్ఠానాది నియమవివరణము ♦—

ఆ॥ వె॥ జాతివిహితములగు ♦ శ్రౌతాదిసత్కర్మ
విధులఁ జేయవలయు ♦ విప్రవరుఁడు
కానినాఁడు ముక్తి ♦ కలుగకుండుటెగాక
ఘోరనరకవహ్నిఁ ♦ గూలఁగలఁడు. 57

గీ॥ వేగుజామున మేల్కాంచి ♦ విమలమతిని
సద్గురుధ్యానమును దైవ ♦ సంస్మరణముఁ
బూర్తిఁగావించి జలపాత్రముము ధరించి
శౌచకార్యముఁదీర్పఁగఁ ♦ జనఁగవలయు. 58

సీ॥ శాస్త్రోక్తవిధమున ♦ శౌచకార్యమొనర్చి
ముఖ దంత ధావనములు నొనర్చి
వేదచోదితములౌ ♦ విధుల ననుసరించి
నదికేగి స్నానసంధ్యలను జేసి
ధౌతవస్త్రంబుల ♦ ధరియించి యిలుసేరి
బ్రహ్మయజ్ఞాది కార్యములఁజేసి
శ్రౌతాగ్నికార్యము ♦ స్సంపూర్తిఁగావించి
మౌనియై జపమాలఁ ♦ బూని యిష్ట

గీ॥ దైవతోపాసనముఁ జేసి ♦ భావమలర
పంచపూజావిధానము ♦ స్భక్తిఁజేసి
పక్వమైనట్టి మధురాన్న ♦ భక్ష్యములను
స్వామికి నివేదనమొనర్ప ♦ వలయునపుడు. 59

సీ॥ దివ్య పంచ సాలిగ్రామ ♦ తీర్థములను
శంఖమునఁబట్టి శిరమునఁ ♦ జల్లుకొనుచుఁ
దీర్థపానమొనర్చి య♦తిథులతోడఁ
దత్ప్రసాదము న్భుజియింపఁ♦ దగును గేస్తు. 60

గీ॥ తనదు వర్ణాశ్రమాచార ♦ ధర్మములను
వేదశాస్త్ర చోదితములౌ ♦ విధులనెఱిఁగి
యాచరించుచు విష్ణుసే♦వానురక్తిఁ
గల్గియుండవలయు ముక్తి ♦ కాముఁడెపుడు. 61

చ॥ మదమును గామక్రోధముల ♦ మచ్చరము న్దలిగించువాని ని
న్వదలి ప్రశాంతసత్వగుణ ♦ వర్ధకమైన పదార్థమే భుజిం
పఁదగును లేనిచో మనసు ♦ వానరమై విషయాదివాసన
ల్వదలక చంచలంబగుచు ♦ భగ్నమొనర్చును సుస్థిరత్వమున్. 62

గీ॥ కాన సాత్వికాహార భ♦క్షణమొనర్చి
స్నానపానాది నియమవి♦జ్ఞానియగుచు
ననవరతము మనోనిగ్ర♦హంబుకలిగి
సంచరింపఁగ వలయును ♦ సాధకుండు. 63

గీ॥ దేహమే యాత్మ యోధుని ♦ తేరు, దాని
నెల్లపుడు నింద్రియాశ్వంబు ♦ లీడ్చుచుండుఁ
గాన జ్ఞానకర్మేంద్రియ ♦ గణము నెపుడు
లాగియుంచినఁ బెడత్రోవ ♦ నేగకుండు. 64

సీ॥ పథికుఁ డాత్ముండను ♦ వాఁడు దేహంబను
తేరుననుండు, నా ♦ తేరునకును
చక్రము ల్దుష్కర్మ ♦ సత్కర్మ లనునవి,
యశ్వరాజము లింద్రి ♦ యములు, మఱియు
స్వాంతమే యొకపెద్ద ♦ పగ్గమై విలసిల్లు,
బుద్ధి సారథియయి ♦ సిద్ధపడును,
ప్రారబ్ధ కర్మాను♦భవ మను రాజమా

గీ॥ నట్టి పథమునఁ బోయెడి ♦ యాత్మమూర్తి
స్వాంతమను పగ్గము న్లాగి ♦ పట్టియుంచి
బుద్ధిసారథితోడఁ దా ♦ బోధసేయ
నింద్రియాశ్వముల్ క్రమగతి ♦ నేగుచుండు. 65

కం॥ కాన విజితేంద్రియుండై
మానస నిగ్రహముకలిగి ♦ మంత్రజపంబుల్
బూనిక నొనరింపవలయు
లేనియెడల సిద్ధిలేదు ♦ లేశంబైనన్. 66

వ॥ కావున సద్గురునికడ మంత్రోపదేశంబునుబొంది స్వధర్మానుష్ఠాన తత్పరుండై జితేంద్రియుఁడై చిత్తశుద్ధిని సేకరించుకొని మంత్రజపముసలుపవలయును. బాహ్యాభ్యంతరములయం దట్టి సంస్కారములేక మంత్రానుష్ఠానమొనర్ప నెంచువాని క్రియాకలాపమంతయుఁ గేవలము నటన యగుట వ్యర్థమని గ్రహింపుము. 67

సీ॥ వైరాగ్యహీనుని ♦ బ్రహ్మవిచారణ
జ్ఞానహీనుని విమ♦ర్శనవిధంబు
పిఱికివాని బలంబు ♦ విధవయౌవనమును
సదుపయోగములేని ♦ జన్మము శవ
మున కలంకారంబు ♦ పుంశ్చలియొక్క యా
చారంబు పరమచం♦చలునిజపము
పరమేశ్వరుని భజిం♦పని శరీరంబును
భక్తిహీనునిపూజ ♦ వసుధలోన

గీ॥ వైదికాచారహీనుని ♦ వేదపఠన
మఖిలభూతసమత్వభా ♦ వానుభూతి
లేశమెరుగని ధర్మోప ♦ దేశములును
తలఁచిచూడఁగ నివ్వుల వ్య ♦ ర్థములుకావె. 68

—♦ నారదుఁడు సదాశివుని స్తుతించుట ♦—

క॥ అని యిట్లుపదేశం బి
చ్చిన శంకరుఁగాంచి ముదిత ♦ చేతస్కుండై

ముని కరయుగ్మము ఫాలం
బున మోపి నుతించి పల్కె ♦ మోదాత్ముండై. 69

శా॥ దేవా! నీ యుపదేశవాక్యరచనా ♦ దివ్యామృతాస్వాదనా
శ్రీవైపుల్యముచేతఁ బావనతఁగాం♦చె న్నాదుచిత్తంబు నే
భావింతు న్భవదీయబోధల నెద ♦ న్పాపాటవీభాస్కరా!
భావాతీత! గుణత్రయాదిరహితా! ♦ భద్రంకరా! శంకరా! 70

సీ॥ చూచినాఁడను నీదు ♦ శుద్ధస్ఫటికతుల్య
గాత్రము కన్నుల ♦ కఱవు తీఱ
పొందినాఁడను మహో ♦ నందంబుగాఁ గృష్ణ
మంత్రోపదేశము ♦ న్మనసుతీర
వినియుంటి నీదగు ♦ విమలోపదేశము
ల్వీనులవిందుగా ♦ వేడ్కమీఱ
అందినవాఁడ బ్రి ♦ హ్మానందభాగ్యంబు
హృదయంబువిపులసం♦తృప్తినంద

గీ॥ దివ్యతరమైన భక్త్యుప♦దేశ మొసఁగి
విమలమహా ధర్మతత్త్వము ♦ న్వెల్లడించి
నన్ను దరిఁజేర్చినాఁడ వా ♦ పన్నరక్ష!
విశ్వనాథ! జగద్గురూ! ♦ వేదవేద్య!.

గీ॥ భయకరంబైన సంసార ♦ వార్ధి దాట
వలయునన్న నీయుపదేశ ♦ వాక్యసరణి
గొప్పసాధనమగుఁగాదె ♦ గురువరేణ్య!
పరమసుజ్ఞానసంధాన! ♦ పాలనయన! 72

కం॥ వచ్చిన పనియయ్యెను నీ
విచ్చిన భక్త్యుపదేశ ♦ మెంతయుఁదోడై
నిచ్చలునాహృదిఁబాయక
పెచ్చెరవర్ధిల్లుఁగాక ♦ శ్రీగౌరీశా! 73

గీ॥ నాదు కోరికతీరెను ♦ నామనంబు
పరమ ప్రేమపూరితమయ్యె ♦ భక్తవరద !
ఆజ్ఞయిచ్చిన నారాయ♦ణాశ్రమమున
కరిగి దర్శించువాఁడ నే ♦ నామహాత్మ. 74

కం॥ ఈరీతిఁబల్కి యామuni
గౌరీశునివలన నాజ్ఞఁ ♦ గైకొని చనియెన్
నారాయణాశ్రమమునకు
సారతరములైన కృష్ణ ♦ చరితములు వినన్. 75

పంచపాద గీతి॥ చాలకాల మాయాశ్రమ ♦ స్థలి వసించి
బ్రహ్మమర్త్యుఁడైన. హరిచరి♦త్రములనెల్ల
నామహాత్మునివలన దా ♦ నాలకించి
ముదితహృదయుఁడై విధిలోక ♦ మునకుఁజేరి
యమితసంతోష సంభరి ♦ తాత్ముఁడగుచు. 76

కం॥ గిరిజేశుఁడు బోధించిన
పరమప్రేమను స్వధర్మ ♦ భక్తివిధములన్
ధరలో వ్యాప్తమగుటకై
సురముని రచియించె భక్తి ♦ సూత్రము లనఁగా. 77

ఆశ్వాసాంతము

మదనవిలసిత వృత్తము
మునిజనవినుతా ! - ఇనకులతిలకా !
దనుజహార ! విభీ - షణనుతచరణా ॥ 78

గద్య.

ఇది శ్రీరామచంద్ర వరప్రసాద లబ్ధకవితా భాగధేయ కేతవరపువంశ
పయఃపారావార రాకాసుధాకర శ్రీ లక్ష్మీనృసింహ గురుపుత్ర
రామకృష్ణ నామధేయ ప్రణీతంబైన 'భక్తనారదీయ'
మను గద్య పద్యాత్మక కావ్యమునందుఁ
బంచమాశ్వాసము సంపూర్ణము.

శ్రీ రామచంద్రాయ నమః.

# భక్తనారదీయము

## షష్ఠాశ్వాసము

కం॥ శ్రీకళ్యాణగుణాన్విత !
లోకార్చిత ! సకలదైత్య ♦ లోకవిదారా !
కాకుత్స్థవంశభూషణ !
రాకాశశివదన ! రామ ! రాజలలామా !. 1

వ॥ దేవా ! అవధరింపుము. 2

—♦ శౌనకాదులు సూతిని బ్రశ్నించుట ♦—

గీ॥ అఖిలశాస్త్రపురాణేతి♦హాస వేత్త
యైన సూతినిగని శౌన ♦ కాదులెల్ల
రోమహర్షణుభావ ! మహాత్మ ! ♦ ప్రేమతోడఁ
దెల్పితివి నారదమునీంద్ర ♦ దివ్యకథను. 3

కం॥ నారాయణాశ్రమంబున
సారాంశములన్ గ్రహించి ♦ సరగునఁ దండ్రిన్
జేరెనని పల్కియుంటివి
సారయశోద్దామ ! మివుల ♦ సంతసమయ్యెన్. 4

కం॥ హరిగుణ గానామృతమునఁ
బరవశుఁడై లోకహితము ♦ వాంఛించుచు నా
వరముని చేసిన పనులను
కరమనురాగమునఁ దెల్పఁ ♦ గదవే మాకున్. 5

చ॥ అనవిని సౌతియిట్లనియె ♦ సాదరబుద్ధిని వారిఁగాంచియో
మునివరులార! లోకహితమ్ము నమ్మదిఁగోరుచు నారదుండు ధా
త్రిని బొనరించినట్టి కడు ♦ దివ్యతమంబగు కార్యవైఖరిన్
వినుఁడిదె కొంత తెల్పెదను ♦ వీనులఁ గ్రోలుఁడు తత్కథాసుధన్. 6

—♦ ప్రహ్లాద చరిత్ర ♦—

గీ॥ అసురనాథుని సుతుఁడు ప్ర ♦ హ్లాదుఁడవనిఁ
బరమ భాగవతోత్తమ ♦ పదవినంది
పేరుగాంచెఁగ మూల మీ ♦ నారదముని
బోధయే కాదె! యావిధ ♦ మ్మిఁకనువినుండు. 7

సీ॥ సనకాది మునిచతు ♦ ష్టయ మొకనాడు వై
కుంఠమ్ము జేరి ముకుందుఁగాంచ
జనుచుండఁ దద్ద్వార ♦ మున నున్న జయవిజ
యులు వారిఁగాంచి పో ♦ వలదు స్వామి
యాజ్ఞ లేకుండ మే ♦ మన్యుల లోనికిఁ
బంపరా దిదిమాకుఁ ♦ బ్రభునియాజ్ఞ
యని వచియింప వా ♦ రమిత కోపారుణ
నయనులై యా భట ♦ ద్వయముఁగాంచి

ఆ॥ వె॥ పరమ పురుషుఁడైన ♦ హరినాశ్రయించియు
బుద్ధిలేదె! మీకు ♦ మూఢులార!
"కోడెత్రాచుతోడఁ ♦ గూడునా? చెల్గాట"
తాపసు లను మాటఁ ♦ దలఁపవలదె! 8

గీ॥ పదవి యబ్బెనుగా యను ♦ మదముకనుల
కెక్కి నీగతిని వివేక ♦ హీనులగుచు
బ్రహ్మమానససుతులఁ దా ♦ పసుల నిటుల
నడ్డగించిన ఫలమిదే ♦ యందికొనుఁడు. 9

ఆ॥ వె॥ సత్వగుణము వీడి ♦ సాధుల మానుల
హరినిఁ జేరఁగూడ ♦ దనుచుఁబలుకు
మీర లసురులగుచు ♦ మేదినిజన్మింపుఁ
డనుచుఁబలికి వార ♦ లరిగిరంత, 10

—♦ శాపదగ్ధులైన జయవిజయులు శ్రీహరిని శరణుఁజొచ్చుట ♦—

ఆ॥ వె॥ శాపదగ్ధులైన ♦ జయవిజయులుకడు
దుఃఖితాత్ము లగుచుఁ ♦ దోయజాక్షు
చరణయుగ్మమునకు ♦ సాగిలఁబడిమ్రొక్కి
వ్యాకులమ్ము గదుర ♦ పలికి రిటుల. 11

మ॥ అపరాధంబులు లేవు మావలన నో ♦ యబ్జాక్ష! న్యాయంబె యా
కుపితాత్ము ల్పనకాదు లీగతిని మా ♦ కున్శాపమీయంగ నీ
విపదంభోధిని దాఁటు సాధనమహో ♦ విశ్వాత్మ! బోధింపవే
కృపతో శాపవిమోచనంబునకు యు ♦ క్తిందెల్పి కాపాడవే. 12

చ॥ పరమ శుభప్రదంబగు భ ♦ వత్పద సన్నిధిఁ బాసి నిల్వ మా
తరమగునే? రమారమణ! ♦ దైత్యులమై మరణంబుఁగాంచిన
త్వరముగ నిన్నుఁజేరెడి వి♦ధానముఁదెల్పి యనుగ్రహింపు మో
సరసిజనాభ! లేనియెడ ♦ సైపఁగఁజాలము నీవియోగమున్. 13

క॥ అనుచు మొఱఁబెట్టుచుండిన
తనభక్తుల జయవిజయుల ♦ దయఁగని యపు డా
వనరుహదళలోచనుఁ డి
ట్లనె చింతనుదక్కి నాదు ♦ నానతి వినుఁడీ.

ఉ॥ తాపసులన్న వాక్యములు ♦ తప్పవు వాని నతిక్రమించి యా
శాపముఁ ద్రిప్పివేయఁగ న♦శక్యము కావున నాలకింపుఁడీ
నాపలుకొండు మీరసుర ♦ నాయకులై జనియించి చచ్చియే
శ్రీపరిపూర్ణమోక్షఫల ♦ సిద్ధినిగాంచుడు మూఁడుజన్మలన్. 15

వ॥ మీరింకఁ దొలిభవంబున దితికశ్యపులకు హిరణ్యాక్షహిరణ్యకశిపు
లను పేర్లతోఁ గొమరులై జన్మించి, రెండవజన్మంబున రావణ
కుంభకర్ణు లను నామములతోఁ బులస్త్యబ్రహ్మకు మనుమలై
జనించి తదుపరి జన్మంబున శిశుపాలదంతవక్త్రులై పుట్టి
మద్విరోధులై మదీయంబులగు వరాహ, నారసింహ, రఘురామ,
కృష్ణావతారములలో నాచేఁజచ్చి యథారూపములు ధరించి
మత్సాన్నిధ్యముం జేరుదురు. అటుపై మీకింక జన్మములు లేవని
యూరడించి పంపె. 16

— హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జననము —

గీ॥ హరి వచించినవాక్యంబు ♦ లాలకించి
వారు తమ దివ్యతనువుల ♦ వదలి యసుర
మాతయైన యదితికిఁగు♦మారు లైరి
కనకలోచనుండు కనక ♦ కశిపుఁ డనఁగ. 17

ఉ॥ వారలలోఁ గనిష్ఠుఁ డతి ♦ బాహుబలాఢ్యుఁడు హేమనేత్రుఁ డా
వీరుఁడు ధాత్రిఁజుట్టి తన ♦ వీపునఁజేర్చి రసాతలంబున
న్జేరిన సద్దురాత్మకుని ♦ శ్రీరమణుండు వరాహమూర్తియై
పోరి వధించి ధారుణిని ♦ బూర్వపురీతి నొనర్చె నెంతయున్. 18

ఉ॥ భూరియశుండు స్వర్ణకశి ♦ పుండు మహాబలశాలి తమ్ముని
న్నారసలోచనుండు హరి ♦ చంపినవార్త నెఱింగి క్రోధియై
మారమణు న్వధింతునని ♦ మానసమందుఁదలంచి పోయె నా
నీరజగర్భుఁగూర్చి కడు ♦ నిశ్చలమైన తపంబొనర్పఁగా. 19

గీ॥ రాజ్యభారంబు మంత్రిప♦రమ్మొనర్చి
తనదు కులకాంత గర్భిణి ♦ ధర్మశీల
యగు కయాధువు న్లాలించి ♦ యరిగెఁ దపము
సేయ నాతఁడు మందర ♦ శిఖరమునకు. 20

—♦ కయాధువు నింద్రుడు చెఱఁగొని పోవుచుండ నారదుఁడు వదలించుట ♦—

ఉ॥ దానవపత్ని గర్భమును ♦ దాల్చి కెలంకి మహేంద్రుఁ డా సరో
జాననఁబట్టి గర్భగతుఁ ♦ డై చెలువొందుచునున్న దైత్యరా
ట్సూనునిఁ జంపి యాదనుజ ♦ సుందరిఁబంపుదు నంచు నెంచి యా
మానినితోడ నాదివిజ ♦ మార్గమున న్జనుచుండ నొక్కచోన్. 21

చ॥ సురమునియైన నారదుఁడు ♦ చూచి పురందర కార్యవైఖరిన్
సరగున నాతనిన్గదిసి ♦ చల్లగనిట్లనె నోమహేంద్ర ! యీ
పరమపతివ్రతామణిని ♦ బట్టఁగఁ గారణమేమి ? యీగతిన్
జెఱఁగొని పోవుచుంటి వెటఁ♦జేర్చెదవో? తెలియంగఁబల్కుమా. 22

గీ॥ పరమసాధ్విని నబల నీ♦వరుస నకట !
బంధుగణముల కెడఁబాపి ♦ పాపమనక
వెంటఁ గొనిపోవుటనఁగ నీ♦వంటివాఁడు
చేయఁదగినట్టి కార్యమే? ♦ చెప్పుమయ్య! 23

కం॥ పరమ యశోభరితుండవు
సురలకునధిపతివి పరమ ♦ శూరాగ్రణి వీ
వరయఁగఁ ద్రిలోకవిభుఁడవు
పురుహూతా! తగునె? నీకుఁ♦బొలఁతులఁబట్టన్. 24

చ॥ అనివచియించు వాక్యముల ♦ కాసురనాథుఁడు పల్కెనిట్టు లో
మునివర ! యీసతీమణిని ♦ మోహమున న్జెఱఁబట్టలేదు నా
మనము పవిత్ర మైన యొక ♦ మాటవదించెదనాలకింపుఁడీ
వనితకెసంగు గర్భమును ♦ భగ్నముఁ జేయఁదలంచిపట్టితిన్. 25

గీ॥ కనకకశిపుని భార్య యీ ♦ కమలనయన
దానవేశ్వరు తేజ మీ ♦ తరుణిగర్భ
మందు వర్ధిల్లుచుండుట ♦ యనిమిషులకు
సతత భయకరమగుట ని♦జంబుకాదె. 26

గీ॥ కనకకశిపుఁడె కడు లోక ♦ కంటకుఁడయి
సాధుపీడాకరుండన ♦ జగతిఁబరఁగె
నింక వానికుమారకుం ♦ డెంతవాఁడు
కాఁగలండో? యనెడి భీతి ♦ కలఁచె మదిని. 27

గీ॥ సంభవింపఁగనున్న క♦ష్టమున కిపుడె
తగు ప్రతీకారమును జేయ♦నగును గాన
వనితగర్భము న్దునుమాడి ♦ పంపువాఁడ
ననివచింపఁగ శివశివా! ♦ యనుచు మౌని. 28

—♦ నారదుఁడు దేవేంద్రునకు బుద్ధిఁగఱపి కయాధువును వదలించుట ♦—

చ॥ హరిహరి! యెంతమాట విన ♦ నాయెను నేఁటికి నీదునోటఁ? దాం
దరపడి దానవేశ్వరుని ♦ ధర్మకళత్రమును న్సతీమణిన్
జెఱఁగొని యామెగర్భమును ♦ ఛేదమొనర్పఁ దలంచునట్టి దు
శ్చరితుఁడవైతివే! యపయ♦శంబునకు న్దలయొగ్గినాడవే? 29

మ॥ వరచారిత్రుఁడవై సురేశ్వరుఁడవై ♦ ప్రఖ్యాతకార్యుండవై
పరిపాలించుచు లోకజాలముల నా♦పన్నాత్ములన్గాచు నీ
చరితంబందుఁగళంకమేర్పడదె? యీ♦చానన్మహాసాధ్విని
పరిభావంబు నొనర్పనెంచితివొకో ♦ పాపంబటం చెంచకే. 30

గీ॥ భువనరక్షణ సల్పుటో ♦ సవనమందు
హవ్యమును గొననేగుటో ♦ యసురవరులఁ
బాఱదోలుటయో కాక ♦ వనితఁబట్టు
పాపమున్జేయ నీవంటి ♦ వాఁడుతగునె? 31

సీ॥ క్షాత్రవపంక్తిని ♦ సాధింపఁ దగినట్టి
కోపమీసతిపైనఁ ♦ జూపఁదగునె?
సన్మార్గమును ధరఁ ♦ జాటువాఁడవునీవు
కాంతాజనంబుపై ♦ కనలనగునె?

దుర్మార్గుల నడంచు ♦ దోర్బలుండవు నీదు
బలమునీకాంతపై ♦ బంపఁదగునె?
దర్పంబుతోఁ జతుర్దశలోకముల నేలు
సామర్థ్యమింతిపై ♦ చాటఁదగునె?
గీ॥ ఈతరుణి సుస్వభావ యుఁహీనధర్మ
నిరత పరమపతివ్రత ♦ నరుణవదలి
కఠినబుద్ధిని జెఱఁబట్టఁగాఁదలఁచుట
పరమపాతకమౌఁ గాదె ♦ స్వర్గనాథ! 32

గీ॥ గర్భహత్యనొనర్చుటకన్న జగతి
వేరుపాతకమున్నదే? ♦ వీరుల కిది
కడు కళంకహేతువు కాదె ♦ జడునివోలె
ఇట్టి మతిలేని పనిఁజేసి ♦ తేల? చెపుమ. 33

గీ॥ తపము సలుపఁగఁ జనినయా ♦ దనుజవిభుఁడు
బ్రహ్మవలన నభీప్సిత ♦ వరములంది
వచ్చి యీవార్త వినిన నా ♦ వైరివలనఁ
గలుగనున్న విపత్తును ♦ దలఁచినావె? 34

గీ॥ పాకశాసన! వినుమి యీ ♦ పడఁతిచూలు
నీకభేద్యంబు కావున ♦ నెమ్మదిఁగల
పాపసంకల్పము నిపుడె ♦ పాఱఁద్రోలి
సాగుమింక సత్వరముగ ♦ స్వర్గమునకు. 35

కం॥ పురుహూత! నిన్నుమించిన
యరితో బలవద్విరోధ ♦ మార్జించితివీ
వెఱుఁగు మిఁకనైన నీకిది
"కొరవినిగొని తలను గోకు ♦ కొనుటయటంచున్." 36

కం॥ ఈ లలన గర్భమునఁ గల
బాలుఁడు పావనుఁడు పరమ ♦ భక్తుఁడు కరుణా
శీలుఁడు హరిపదసేవా
లోలుఁడు ధార్మికుఁడు వినుత ♦ లోకుఁడు వింటే. 37

చ॥ వినుమొకమాటఁ దెల్పెదను ♦ వీనులవిందుగ నీ కుమారుఁడే
దనుజకులేశుఁడైన తన ♦ తండ్రికి మారకుఁడై జనించు నీ
తని హరినామ చింతనమె ♦ తప్పక ముక్తినొసంగుఁ గాన నీ
వనితనువీడి పొమ్మిఁక శు ♦ భంబు లభించుత నీకు సర్వదా 38

—♦ నారదుఁడు కయాధువుకు భక్తిజ్ఞానములు బోధించుట ♦—

కం॥ మునియాడిన హితవాక్యము
లను విని దేవేంద్రుఁ డపుడు ♦ లావణ్యవతీ
మణియగు దానవపత్నిని
మునిసన్నిధి డించి స్వర్గ♦మున కేగ నొగిన్. 39

ఉ॥ నారదమౌని యా దనుజ ♦ నాథకుటుంబినియౌ కయాధువున్
సారసపత్త్రలోచనను ♦ సాంత్వనవాక్యముల న్[illegible]చు
న్గారవమొప్పఁగా గమన ♦ కష్టముఁ బాప నిజాశ్రమంబునన్
జేరిచి దివ్యబోధల వ♦చింపఁగ నామె ప్రశాంతచిత్తయై. 40

గీ॥ శాంతియుతమైన తాపసా♦శ్రమమునందు
రాక్షసేశ్వరపత్ని వి♦శ్రాంతిఁగొనుచు
సంభవించిన చిత్త వి♦చారమెల్ల
మరచి కొన్నాళ్ళు కడపె నా ♦ మందగమన. 41

చ॥ అనుదిన మాకయాధువున ♦ కామునినాథుఁడు పావనుండు పా
వనమగు జ్ఞానవైఖరిని ♦ బంకజలోచనుభక్తిమార్గమున్
మనమున కెక్కునట్లు శ్రవ♦ణస్మరణాది విధంబులం బ్రబో
ధన మొనరించుచుండె హరి♦తత్త్వము తేటపడంగ నామెకున్. 42

వ॥ మనస్సునకు శాంతికల్గుట కొకదినమున నామెతో నిట్లనియె. 43

గీ॥ శ్రద్ధతో వినుమమ్మ సం♦సారమనెడి
వృక్షమున రెండుఫలములు ♦ వెలయుచుండు
నవియె సుఖదుఃఖములు దాని♦నాశ్రయించు
వార లా రెండుఫలములఁ ♦ బడయుచుండ్రు. 44

గీ॥ అరయ దేహమ్మునకెగాని ♦ యాఫలాను
భవము జీవాత్మనకు నసం♦భవము దేహ
భిన్నమై యాత్మతత్త్వంబు ♦ వెలయుచుంట
తనువికారంబు లెన్నఁ డా♦త్మకును లేవు. 45

గీ॥ నిత్యుఁ డక్షయుఁ డాత్ముండు ♦ నిర్మలుండు
స్వప్రకాశుండు, దేహ మ ♦ శాశ్వతంబు
మాంస మూత్ర మలాదిస♦మన్వితంబు
కాన ధీమంతు లాత్మవి♦జ్ఞానులగుచు. 46

గీ॥ స్వీయ పరకీయ భేదంబు ♦ విడిచి సర్వ
మీశ్వరాత్మక మని మది♦నెంచుచుండ్రు
అతివ ! వేయేల ? తత్త్వజ్ఞు♦లైనవారు
వదలుచుందురు తమ తను♦భ్రాంతి నిలను. 47

గీ॥ భువిని నిర్ద్వంద్వభావంబుఁ ♦ బొందినయెడ
జయ పరాజయ సుఖ దుఃఖ ♦ జనితమైన
చింతకలుగదు. వారల ♦ చిత్తమెపుడు
పరమశాంతికి నిలయమై ♦ పఱఁగుచుండు. 48

వ॥ తనుధారులకు దేహతాదాత్మ్యమున్నంతవఱకు జయ పరాజయ శీతోష్ణ సుఖదుఃఖాది భావములన్నియు ననుభూతము లగుచుండును. ఏనాఁడు "దేహి నేను దేహభిన్నుఁడనగు ప్రత్యగాత్మ"నను నిశ్చయముకలిగి యాత్మానుభవజ్ఞాన సంపన్నుఁ

డగునో యాక్షణమునఁ బైనుడివిన ద్వంద్వములనుండి ముక్తుఁడగును. కాన నీవు నట్టి జ్ఞానము నలవరచుకొనినచో చిత్తము వ్యాకులశూన్యమై శాంతినిలయమగును. ప్రాణికోటు లనుభవించు సుఖదుఃఖాద్యనుభవము లన్నియుఁ బ్రాపంచకసంబంధవాసనావిశేష జన్యాజ్ఞానయుక్త మనోవేదనాన్వితము లనియే తలంచి వీనికి దూరముగ నుండవలయును. సచ్చిదానందమూర్తియైన నిరుపాధిక పరబ్రహ్మయే ప్రత్యగాత్మయై మాయావికారమైన దేహధారణమువలన జీవనామమునుధరించి సమస్తగుణములను దనయం దారోపించుకొని వ్యవహరించుచున్నాఁడు. అంతియేకాని జీవేశ్వరుల కెంతమాత్రము భేదములేదు. అట్టి జీవబ్రహ్మైక్యానుసంధానమే నిర్వికల్పానందమునకు మూలము.

కావునఁ గుమారీ! బ్రహ్మానంద బోధకమైన యీ దివ్యోపదేశమును నీహృదయమున ధారణమొనర్పఁ దలంతువేని తొలుత లక్ష్యసిద్ధి కావలయును. అయ్యది పరాభక్తి సాధనమునఁగాని లభ్యముకాదు. జ్ఞానియై కృతార్థుఁడు కాఁదలఁచినవాఁడు నిశ్చలభక్తినే యుపాసించవలయును. అందువలన నీవును భక్త్యుపాసనమొనరింపుము. అయ్యది సగుణ నిర్గుణము లని రెండు విధములు. పరబ్రహ్మమూర్తియొక్క సగుణ స్వరూపమైన శ్రీహరియొక్క కల్యాణగుణ దివ్యలీలామయ రూపమును హృదయమం దనుసంధానమొనర్చి నిష్కామవృత్తితో శ్రవణ కీర్తనాది సాధనములతో సేవించుచుండిన నమ్మహాత్ముని యనుగ్రహము లభించును. దానివలన లక్ష్యసిద్ధియు నద్వైతజ్ఞానమును గలుగును. 'ఈశ్వరానుగ్రహముననఁగాని యద్వైతసిద్ధి కలుగ' దనునార్యోక్తిని దెలిసికొనుము. నేటినుండియు జనార్దన చరణయుగళ సరసీరుహ మరందపాన పరవశవై నిత్యానంద సుఖానుభవము నందుము. మోక్షసౌధము నెక్కుటకుఁ బ్రథమసోపానము కర్మ. ద్వితీయ మీశ్వరీయ విజ్ఞానము. తృతీయ మనన్యభక్తి. సాధ్య

సాధనస్వరూపిణి యగు నాపరాభక్తియే నిత్యముక్తిఫలదాయిని యగుట నాహరిభక్తి నుపాసించుచుఁ బరమాత్మతత్త్వజ్ఞానము నార్జించి కృతార్థురాల వగుము. నా యుపదేశము ననుసరించితి వేని నీవు తప్పక జీవన్ముక్తిని జేరఁగలవు.

అని యాదేవమునీంద్రుఁడు ప్రతిదిన మామెకుఁ గరుణార్ద్రహృదయుఁడై 49

శా॥ ఆ దైత్యేశుని కాంత శావిధిని ధన్యాత్ముండు మానీంద్రుఁ డా
మోదం బొప్పఁగ బోధసేయు నెడ నాబోధాంశ సారంబు నా
స్వాదింపన్నొడఁగె న్సతీవిమల గర్భస్థుండు పుత్త్రోత్తముం
డా దివ్యస్థితి స్వాత్మనెంచి ముని బ్రహ్మానందము న్పొందుచున్. 50

శా॥ ఔరా! యెంతవిచిత్రసంఘటన మాహా!! యెంతయాశ్చర్య!!! మీ
నారీగర్భములోఁ జెలంగు సుతుఁడే న్నవిష్ణుసద్భక్తిలోఁ
బారంబందెడి లక్షణంబులిపుడే భాసిల్లె మేలామె వ
హ్వారే! కాఁగల కార్యమీఁగతి ఫలింపన్ లోకకల్యాణమా. 51

గీ॥ విశదమాయె నీగర్భస్థ శిశువె జగతిఁ
బరమపురుషుఁడౌ హరికి సద్భక్తుఁడగుచు
జనకునకు ముక్తినీయంగఁ జాలుననుట
దైవసంకల్ప మతివిచిత్రంబుగాదె. 52

గీ॥ అనుచుఁదలపోసి నారదుఁ డహరహంబు
పరమపదసాధనంబగు భక్తితత్త్వ
మార్గమంతయు ధర్మసమ్మతముగాఁగ
బోధనముసల్పుచుండె నా ముదిత కతఁడు 53

కం॥ స్మరణము, కీర్తన, శ్రవణము,
చరణములకు సేవ, పూజ, సఖ్యము, దాస్యం,
బరయఁగ నాత్మనివేదన,
హరివందన, మనెడి సాధనాదులు దెలిపెన్. 54

గీ॥ కొంతకాలంబు జరిగిన • యంత మాని
కనకకశిపుఁడు బ్రహ్మచేఁ • గాంక్షితముల
నంది తనపురిఁజేరుట • నాత్మనెఱిఁగి
పయనమయ్యెను దనుజేశ • పత్నితోడ. 55

గీ॥ దానవేంద్రుని పురిఁజేరి • మాని సతిని
పతిసమీపమునకుఁ జేర్చి • గతవిధమును
సంగ్రహంబుగఁ దెల్పియా•సారసాక్షు
హరినిబాడుచుఁ దనత్రోవ • నరిగె నతఁడు. 56

—• హిరణ్యకశిపుఁడు స్వర్గముపై దండెత్తుట •—

కం॥ తనసతిని శచీశుఁడు చెఱఁ
గొనిపోయిన వార్తనెంచి • కోపాత్ముండై
తన సైన్యమ్మునుగొని చని
యనిమిషలోకమును జుట్టి • యనిఁజేసె నొగిన్. 57

గీ॥ సాగఁదోలెను నిర్జర • సైన్యములను
పట్టిబంధించె నచ్చర • పడఁతుకలను
బలిమిని గ్రహించె త్రైలోక్య • వైభవమును
బ్రహ్మ యొసఁగిన వరముల • బలమువలన. 58

వ॥ అనంతరము దిక్పాలకులను బంధించి సురలోకసామ్రాజ్యము నాక్రమించినవాఁడై తనసోదరునిఁ జంపిన హరినివధింప సంకల్పించి దానవవీరులం బిలిచి యిట్లనియె.

సీ॥ యజ్ఞశాలలకేగి • యవనీసురులు చేయు
జన్నంబులకుఁ గీడు • సలుపవలయు
మాంసఖండంబుల • మద్యఘటంబుల
శాలలలో విడఁ • జల్లవలయు

స్వర్లోకమునఁ గల ♦ సకలదేవతలను
వెతల నుంచుటకుఁగా ♦ వెడలవలయు
కంటఁబడిన సురా♦గారంబులను రూపు
మాపి సత్వరముగ ♦ మరలవలయు

గీ॥ దేవతావిప్రు లున్నట్టి ♦ దిక్కులందు
సవనములఁ దపములఁ జేయు ♦ స్థలములందు
హరి వసించును గాన మీ ♦ రచటకేగి
వాని నాశన మొనరింప ♦ వలయు నిపుడె. 59

క॥ హరినెయ్యెడ నుతియింతురో
హరినెయ్యెడఁ గొలుచుచుండ్రొ ♦ యాయాస్థలముల్
వెరవుగ మెలకువ కలిగియె
యరయుచు బాధింపవలయు ♦ నతిరభసమునన్. 60

గీ॥ అనుచుఁ దనసైనికుల కెల్ల ♦ నాజ్ఞనొసగి
నిజపురంబున నెలఁతతో ♦ నిఖిలవైభ
వములఁ దేలియాడుచునుండఁ ♦ బడఁతికపుడు
సన్నిహితమయ్యెఁ బ్రసవించు ♦ సమయ మంత 61

చ॥ కొమరునిఁ గాంచె నా కుసుమ ♦ కోమలి మారసమానసుందరున్
విమలుని శాంతమూర్తిని వి♦వేకసమన్వితు దాంతు సర్వభూ
తముల సమానబుద్ధి నెదఁ ♦ దాలుచువాని గుణాలవాలు శ్రీ
రమణపదాబ్జగాన మను ♦ రక్తిని సల్పఁగలట్టిపుత్త్రునిన్. 62

గీ॥ తనను గనవచ్చువారి కం♦దరకు సంత
సమ్ము నీఁజాలియుండుట ♦ జనకుఁ డపుడు
తనయు నామంబు ప్రహ్లాదుఁ♦డని లిఖించె
బందుగులు కడు సంతోష ♦ మందుచుండ 63

గీ॥ తల్లి గర్భమునందున్న • తరుణమందు
బ్రహ్మనందనుఁడైన నా•రదునివలన
భక్తి తత్త్వోపదేశము • న్బడయుకతన
శైశవంబాది విష్ణు సం•స్మరణమబ్బె. 64

వ॥ అవ్విధంబునఁ బ్రహ్లాదుండు శైశవముదాఁటి క్రమక్రమముగ నెన్మిది
వత్సరముల ప్రాయమువాఁడై. 65

ఉ॥ పాడెడి వేళ స్నేహితుల • వాక్యములన్వినుచుండు వేళఁ దా
నాడుచునున్న బంధువుల • నందరిని న్గని పల్కువేళల
న్గూడు భుజించుకాలమునఁ • గూడ రమేశ్వర దివ్యనామముల్
బాడునుగాని కాలమును • వ్యర్థముఁ జేయఁడదెట్టి పుణ్యమో. 66

గీ॥ సారసాక్షునకును గర్భ•శత్రువైన
కనకకశిపుండు తనసుతుఁ • డనుదినంబు
సలుపు హరిభక్తిఁ దిలకించి • కులవిరుద్ధ
మగుటచే సహింపఁగలేక • ననియె నిటుల. 67

— హిరణ్యకశిపుండు హరిభక్తుఁడగు ప్రహ్లా ంచుట —

మ॥ తనయా! నావచియించుమాటవినుమా! • దైత్యాన్వయారాతియా
వనజాక్షు న్దలపోయ నెంచకుము నీ•భావంబున న్బుత్ర ! నీ
పినతండ్రి న్వధియించె వానికొఱ క•న్వేపించుచున్నాఁడ నా
యనుజు న్జంపిన వైరమార్పుకొన నో•యన్నా! హరి న్వీడుమా. 68

వ॥ అనియిట్లు పెక్కుతెఱంగులఁ దనయునకు బోధించిన న
బ్బాలుండు తాను గర్భస్థుఁడై యున్నకాలముననే నారదప్రబోధి
తుండైన కారణమున జనకున కెదురాడి హరిధ్యానంబొనర్పు
చుండ దైత్యవిభుండు సహింపఁజాలక సుతుని పెక్కుగతుల
శిక్షించియు బాధించియుఁ బ్రాణాంతకములగు దండనములకుఁ
బాల్పడఁజేసియును వానిచిత్తమును మరల్పఁజాలక సభామధ్య
మునకుఁ బ్రహ్లాదుంబిలిపించి యిట్లుప్రశ్నించెను. 69

కం॥ హరిహరియని యరచెద వా
హరియెచ్చటనుండెఁ ? జూడఁగ♦నగుపడఁడేలా ?
హరియింతు వానిజాడల
నెఱిఁగింపుము పోయివాని ♦ నిపుడె వధింతున్. 70

మ॥ అనుచు న్బల్కిన తండ్రిమాటవిని ప్ర♦హ్లాదుండ నెంతే నమ్రుఁడై
జనకా ! శ్రీహరి సర్వవస్తుగతుఁడై ♦ సర్వాత్మభావంబునన్
గనవచ్చున్ భువి నెల్లచోటులను ని♦క్కంబిద్ది నీవెందుఁ గో
రిన నందే విలసిల్లుచుండుహరి తం♦డ్రీ ! కాంచఁగాలేవొకో ? 71

గీ॥ అనివచించిన సుతునివా♦క్యములను విని
ఔర ! యీసభాస్తంభ మ♦ధ్యమున నిపుడె
హరినిఁ జూపుమా యన్నఁ బ్ర♦హ్లాదుఁడేల
సంశయింతువు ? శౌరియి♦చ్చటనె కలఁడు. 72

వ॥ సర్వాంతర్యామియైన శ్రీహరి యీసభాస్తంభ మధ్యమున నేలకానరాకుండును? చూచుశక్తి కలదేని చూడుమా! యను తనయుని పల్కునువిని దానవేంద్రుండు పండ్లుపటపటకొఱుకుచుఁ జేత గదాదండమునుధరించి నేలకురికి,

మ॥ గద కేలన్గొని దానవేశ్వరుఁడు హుం♦కారంబుల న్బల్కుచున్
"మద మాతంగము పద్మనాళమును ద్రెం♦పంబోవురీతి"న్సభా
సదు లాశ్చర్యమునందిచూడఁగ సభా♦స్తంభంబును న్మోదఁగా
సదయుండౌహరి భక్తవాక్యపరిర♦క్షాదక్షుఁడై యత్తరిన్. 74

—♦ హరి నృసింహరూపమున హిరణ్యకశిపుని వధించుట ♦—

చ॥ నరహరియై భయంకర ని♦నాదము నింగినిముట్ట లోకభీ
కరముగ దానవేశుని న♦ఖంబులఁజీరి తదీయరక్త మ
త్తరి సభనున్న దానవులు ♦ దద్దరిల న్వెదచల్లి ప్రేవు లం
దరు కనఁ దాల్చెకంఠమున ♦ దాసజనావనుఁడై జగంబునన్, 75

గీ॥ కనకశిపుని నృహరి యీ♦గతి వధించి
భక్తుఁడైన ప్రహ్లాదుని ♦ వాంఛితముల
నొసఁగి తాఁ దిరోహితుఁడయ్యె ♦ "సర్వేని"హరి
దాసులకు నసాధ్యమగు కృ♦త్యంబు కలదె?" 76

గీ॥ అరయఁ బ్రహ్లాదుఁడటుల శ్రీ♦హరిపదాబ్జ
గానరతుఁడయి హరిభక్త ♦ గణమునందు
నగ్రగణ్యుఁడగుటకు మ♦హాత్ముఁడైన
నారదునిబోధయే కార♦ణంబు కాదె. 77

గీ॥ బ్రహ్మనందనుఁడైన నా♦రదునివలన
భక్తవర్యులై శాశ్వతి ♦ ముక్తిఁగన్న
వారిలో ధ్రువుఁడను రాట్కు♦మారుఁడొకఁడు
వినుఁడి వచియింతు నాతని ♦ ఘనచరితము. 78

—♦ ధ్రువోపాఖ్యానము ♦—

సీ॥ ధరణీశుఁ డొక్కఁ డు♦త్తానపాదుండు ధ
ర్మాత్ముండు విమలుండు ♦ మాన్యతముఁడు
వానికి నిర్వురు ♦ భార్యలుకలరు సు
నీతియు సురుచి నా ♦ నెగడువారు
వారిలోన సునీతి ♦ పట్టమహిషి సాధ్వి
పతిపదార్చనరత ♦ వరచరిత్ర
ఆ పుణ్యవతి కొక్క♦డాత్మజుండు ధ్రువుం డ
నెడువాఁడు సద్గుణా ♦ న్వితుఁడు హితుఁడు
ఆ॥ వె॥ సుందరాంగియైన ♦ సురుచికొక్కతనూజుఁ
డుత్తముఁ డను పేర ♦ నొప్పుచుండు
నిటుల నా క్షితీశుఁ ♦ డిర్వురు భార్యలు
పుత్త్రియుగము వెలయ ♦ భూమి నేలు. 79

సీ॥ పరమలావణ్యవతి చిన్న ♦ భార్య సురుచి
పై నతిశయిల్లు మోహా వి♦భ్రాంతివలన
పట్టమహిషి సునీతిని ♦ వదలి పుత్త్రి
సహితముగ నంతిపురినుండి ♦ సాగనంపె. 80

గీ॥ పట్టణంబున కావల ♦ భవనమొకటి
దారసుతులకై కట్టించి ♦ వారినందు
నిలిపె "స్త్రీరూప లావణ్య ♦ జలధి మునిఁగి
వెలికి వచ్చినవార లీ ♦ పృథ్విఁగలరె?". 81

కం॥ తనపతి బహిష్కరింపఁగఁ
దనయుని వదనారవింద ♦ దర్శనమున నా
జనని విచారమును మరచి
దినముల వెడలించుచుండె ♦ దీనాననయై. 82

వ॥ ధ్రువకుమారుండు తల్లిచేఁ బెనుపఁబడి దశవత్సరప్రాయుండై జననివలన జనకుని వృత్తాంతమును దెలిసికొని తదవలోకన కుతూహలుండై. 83

—♦ ధ్రువుండు తండ్రినిఁజూడఁ గొల్వునకువచ్చుట ♦—

చ॥ జనకుని గాంచఁగోరి ర♦భసంబునఁ గొల్వున కేగి యుత్తము
న్దన యొడిలోనఁ జేర్చుకొని ♦ తద్దయు ముద్దిడుచున్న తండ్రిని
న్గని దరిఁజేరి యంకమునఁ ♦ గాలిడ మాఱుటతల్లి యత్తలం
బున కరుదెంచి యాధ్రువుని ♦ ముందుకుఁద్రోసి వచించెఁ నీగతిన్.

ఉ॥ అందని మ్రానుపండ్ల కిటు ♦ లఱ్ఱును సాచఁ దలంచెదేల?" యో
మందమతీ! సునీతికిఁ గు♦మారుఁడ వౌటయె కారణంబుగా
నందుకొనంగలేవు జన♦కాంకము కావఁ దపంబొనర్చి నీ
వందుము మత్సుతత్వమును ♦ యత్నము సిద్ధియగున్ కుమారకా!.

గీ॥ శ్రీధ్రువుమేపోయి వనిఁజేరి ♦ శ్రీరమేశుఁ
దలఁచి తపమునుజేసి మద్గర్భమందు
జననమందినఁ దండ్రియుఁ ♦ త్సంగభాగ్య
మబ్బునన విని ధ్రువుఁడతి ♦ వ్యాకులుఁడయి. 86

కం॥ జనకుని యౌదాసీన్యం
బును మాఱటతల్లి క్రౌర్య ♦ మునుగని ధ్రువుఁ డా
త్మను గడుదురపిల్లుచుఁ దన
జనని సునీతి నివసించు ♦ సదనముఁ జేరెన్. 87

గీ॥ సవతితల్లి మూలంబున ♦ సంభవమగు
పరిభవము చిత్తమునుగాల్పఁ ♦ బరమశోక
భరము సైపఁగ లేక యా ♦ బాలకుండు
జనని యొడిఁజేరి విలపింప ♦ సాగె నపుడు. 88

కం॥ విలపించు తనూజునిఁ గర
ములఁ గౌఁగిటఁజేర్చి శిరము ♦ మూర్కొని తనయా!
కలఁతం జెందఁగ నేటికి?
పలుకుము కారణమటన్న ♦ బాలకుఁ డనియెన్. 89

చ॥ జనకుని కొల్వుకూటమున ♦ సంభవమైన పరాభవంబును
జ్జననికిఁదెల్ప నాసుతు వి ♦ చారముతోఁ దరిఁజేర్చి పల్కె నో
తనయ! నిజంబు నీసవతి ♦ తల్లి వచించినమాట "మందభా
గ్యన కెటులబ్బుఁ దండ్రియొడి" ♦ యూరటఁజెందుమిఁకన్గుమారకా!

—♦ సవతితల్లి చేఁబరాభవింపఁబడి విలపించు ధ్రువునిఁ దల్లి యూరడించుట ♦—

గీ॥ పరమనిర్భాగ్యనగు నాదు ♦ పట్టివైన
కారణంబునఁ దండ్రియం ♦ కమునఁజేరు
భాగ్యమును గోలుపోతివి ♦ "వసుధను దుర
దృష్టవంతులఁ గాచువా ♦ రెవ్వరు? తండ్రి!." 91

సీ॥ రార నాసుకుమార ! ♦ రారా ! యనుచుఁబిల్చి
కౌఁగిటఁగదియించు ♦ గారవంబు
వాత్సల్యమున హేమ♦పాత్రిలోఁ దనప్రక్కఁ
గుడువఁగఁజేసెడు ♦ గొప్పతనము
రార ! తండ్రి!యని ♦ రత్నాభరణములఁ
జేతులార ధరింపఁ ♦ జేయు ముద్దు
నిండోలగంబున ♦ నిన్నొడిలోఁ జేర్చి
చాలఁగఁబ్రేమించు ♦ లాలనంబు

గీ॥ తండ్రివలనఁ దీరకపోయెఁ ♦ దనయ ! నీకు
భువనమోహినియైన నీ♦సవతితల్లి
యందుఁగలప్రేమ, నాపట్ల♦నతిశయిల్లు
కోపమే నీదు దురవస్థ♦కును కతంబు. 92

చ॥ వలపులభార్యయౌ సురుచి ♦ పక్షముఁబూని సుతుండవైన ని
న్నలఁపక పల్కరింపక స♦దస్యులుచూడఁ బరాభవించెఁగా !
పలికెద నొక్కయుక్తి నిదె ♦ భావమునన్దలపోసి యాగతిన్
సలిపిన నీదువాంఛితము ♦ సత్వరమే సమకూరుఁ బుత్త్రకా!. 93

గీ॥ పతిపరిత్యక్తనైన నా♦పట్టి వగుచు
జనన మందుటవలన నీ♦జనకునంతి
కమ్మునుండి బహిష్కర♦ణమ్మునంది
నాఁడ వోపుత్త్రరత్నమా ! ♦ నేఁడు నీవు. 94

గీ॥ కాన జనకు నాశ్లేష సౌ♦ఖ్యంబు నీవు
కోరియున్న నే నాడు సూ♦క్తుల గ్రహించి
యటుల నొనరించితేని నీ♦యభిమతంబు
సఫలమగుఁ గాన నారీతి ♦ సలుపుమయ్య! 95

శా॥ ఏకాంతస్థలవాసివై స్థిరుఁడవై యిందీవరశ్యామునిన్
శ్రీకాంతాహృదయాధినాథు నెదలోఁ జింతించుచున్ భక్తి నా
లోకారాధ్యునిఁ గొల్తువేని కమలాలోలుండు సంతృప్తుఁడై
నీకాంక్ష ల్నెఱవేర్చునం చెఱుఁగుమా నీచిత్తమం దాత్మజా!. 96

గీ॥ ఇదియె తగుమార్గ మిల నీయభీప్సితంబు
తీరుటకుఁ గానఁ బుత్త్ర! యా శ్రీరమేశు
కరుణఁ బడయ యత్నింప సత్వరము తపము
సేయఁబొమ్ము మాధవుఁడు రక్షించు నిన్ను. 97

చ॥ జననివచించు సూక్తుల విచారణఁ జేయుచు నట్లొనర్పఁగా
మనమున నెంచి యా ధ్రువకుమారుఁడు తల్లికిన్ మ్రొక్కి యామె దీ
వనల గడించి కానకుఁ దపంబొనరింపఁ బ్రయాణమయ్యె నా
యనఘుఁడు బాలకుండు మది నాత్మపరాభవము న్దలంచుచున్.

చ॥ చనిచని కాంచె నాధ్రువుఁడు సాల రసాల కపిత్థ దేవకాం
చన పిచుమంద వంశ వట చందన భూరుహ సంయుతంబు, భీ
షణ మృగరావసంకులము, సారసపూరి సరోయుతంబు, పా
వన మునివాటికా గణ విభాసితమైన వనాంతరస్థలిన్. 99

కం॥ ఒక్కరుఁ, డదరక బెదరక
యెక్కుడు పయనములఁ గడచి మృగసంకులమై
మిక్కిలి భయమును గొల్పెడి
యక్కాననం జేరి నిశ్చితాత్ముండగుచున్. 100

—: తపముఁ జేయ వనమునఁ జేరిన ధ్రువునకు నారదుఁడు కర్తవ్యము నుపదేశించుట :—

గీ॥ అచటఁ గల దీర్ఘశాఖా సమావృతమగు
వట తరుచ్ఛాయఁ గూర్చుండి భక్తవరదుఁ
డైన హరిఁ గూర్చి తపముఁ జేయఁగ దలంచు
చుండ నేతెంచె నాయెడ కొక్కమౌని. 101

చ॥ మునివరుఁగాంచి బాలకుఁడు ♦ మోదముతోడ స్వకీయమస్తకం
బును బదయుగ్మమం దునిచి ♦ మ్రొక్కి కరంబులుమోడ్చి యిట్లు ప
ల్కెను దమ రెవ్వరీగతి న♦కించనుఁడ న్ననుగావ నెంచి నా
మనమునఁగల్గు చింతలను ♦ మాన్పఁగవచ్చిన దేవరాజవా? 102

గీ॥ అనుచుఁ దన్నుఁ బ్రశ్నించు నా♦యర్భకుఁగని
మందహాసం బొనర్చుచు ♦ వహాని యనియె
రాజనందన ! నేను నా♦రదుఁడను సుకు
మారబాలుఁడ వీ వఁ ♦ జేర నేల? 103

చ॥ కడుఁ బసివాఁడ వీవిటులఁ ♦ గానన భూమికిఁజేర నేల ? యో
బుడుత! పథంబు దుర్గమము ♦ మోమున వన్నె తొలంగెఁ, బాదము
ల్తొడఁబడుచుండె నీవిటులఁ ♦ దల్లినిఁ జం(డినివీడి యొంటి నీ
యడవిని జేరినాఁడవిది ♦ యద్భుతమౌఁగద బాలకోత్తమా !. 104

గీ॥ నీదు ముఖవైఖరిని గమ♦నించి చూడ
నొక పుడమిఱేని పట్టివై ♦ యుందువనెడి
తలఁపుగలిగెను నీదు వృ♦త్తాంతమెల్ల
నాకు దాచక నెఱిగింపు♦మా ! కుమార !. 105

వ॥ అని ప్రశ్నించు నారదునకు ధ్రువుండు పునఃపునః ప్రణామంబు
లాచరించి భక్తిపూర్వకముగ నిట్లనె.

గీ॥ ధారుణీశ్వరుఁడైన యు♦త్తానపాదు
తనయుఁడను ధ్రువుఁడను పేరఁ ♦ దనరువాఁడ
సవతితల్లి మూలకముగ ♦ సంభవమగు
పరిభవమె కారణంబు నా♦పయనమునకు. 107

కం॥ జనకుఁడు నిండోలగమునఁ
దనయుని ననుఁ బరిభవింపఁ ♦ దల్లియె నన్నీ
వనిలో హరిఁగూర్చితపం
బును సల్ప ననుజ్ఞనొసఁగె ♦ మునికులనాథా !. 108

గీ॥ రాజపుత్త్రుఁడ నగుచుఁ బ♦రాభవమున
కవనిఁ బ్రతిసేయకుంట దు♦ర్యశము మఱియు
క్షత్త్రియకులంబునకుఁ గళం♦కంబు కాదె?
సూర్యవంశ గౌరవమైనఁ ♦ జూడవలదె? 109

వ॥ అనిపల్కుచుఁ దండ్రికొలువుకూటమున జరిగిన యావద్వృత్తాం
తమును దల్లియొసంగిన యాదేశమును వివరింప నారదుఁడు
బాలకుని హృదయస్థైర్యంబునకును జిత్తశుద్ధికిని క్షాత్త్రోచితమైన
పట్టుదలకును మదిలో సంతసించి, యిట్లనియె. 110

ఉ॥ బాలుఁడవైన నీవిటులఁ ♦ బట్టుదలన్వహియింపఁ బాడియే?
చాలవు నీవు కానలఁ బ్ర♦శాంతతపోనియతి న్వహింపఁగాఁ
జాలు పురంబుఁజేరుము వి♦చారముఁదక్కు వృథాప్రయాస నీ
లీల భరింపనేల? మర♦లింపుము పూన్కిని రాజపుత్త్రకా!, 111

గీ॥ బాలకుండ వీ శైశవ ♦ ప్రాయమందు
నాటపాటల విహరించు♦నట్టి నీకుఁ
దగునె? యవమానజనిత చిం♦తాభరంబు
కన విచిత్రముకాదె? జ♦గానఁబుత్త్ర!, 112

గీ॥ తల్లిదండ్రులుపల్కు క్రో♦ధవచనముల
కిటుల నిలువీడి ప్రతిసేయ ♦ నెంచునట్టి
తనయు లెటనైన నుందురే? ♦ ధరణిలోన
బాలకులకేల? నవమాన ♦ వాక్యసరణి. 113

కం॥ అను ముని వాక్యముల న్విని
మనమున రోసంబెసంగ ♦ మౌనీంద్రునితో
జననాథపుత్త్రుఁడనె నో
యనఘా! క్షాత్త్రస్వభావ ♦ మతిచిత్రంబా. 114

కం॥ పుట్టితి రాజకులంబునఁ
బట్టినప్రతినను ద్యజింప ♦ భావ్యమె నాకి
ప్పట్టున? నగరే ననుఁగని?
పట్టుదలన్విడువ తూత్రి ♦ భావంబగునే?. 115

చ॥ జనని వచించినట్టి విధి ♦ స్వాంతమునందిడి యట్లొనర్పఁగా
మనమున నిశ్చయించితిని ♦ మారుతలంపులు లేవు నాకు ని
ర్జనమగు నీయరణ్యమున ♦ శౌరినిగూర్చి తపంబొనర్చి యా
యనఘు కృపావిశేషమున ♦ నందెద నాఘనకామ్యభాగ్యమున్ 116

గీ॥ నామనోధైర్యమును దిప్ప♦ కో మహాత్మ!
హరి యనుగ్రహపాత్రుఁడ ♦ నగుటకుఁ దగు
సాధనములఁ దెల్పుము నీవె ♦ శరణమిటను
సదయ! సద్గుణసాంద్ర! నా♦రదమునీంద్ర! 117

వ॥ మహానుభావుఁడగు స్వాయంభువమనువుయొక్క పౌత్రుఁడనగు నాకుఁ బూనినవ్రానిక్కఁ బరిత్యజించుట తగనిపని యని తామె యుంగరా? సాపత్న్యమాతృతిరస్కృతి మదీయ హృదయభేద మొనర్చుటంజేసి చిత్తశాంతి లభింపకున్నది. నన్ను విరక్తునిగాఁ జేయక కర్తవ్యవిముఖునిఁగావింపక యనన్యాధిష్ఠితంబైన పదవి నందఁదలఁచిన నాకు మార్గదర్శకుఁడవై కర్తవ్యము నుపదేశింపు మని పాదములఁబడిన 118

గీ॥ పౌరుషోక్తులవచియించు ♦ బాలుఁగాంచి
కరములనుజేర్చి కౌఁగిటఁ ♦ గదియఁదీసి
పలికె సంతసమయ్యె నీ♦పట్టుదలకు
లచ్చిమగని కరుణ నీకు ♦ లభ్యమగును. 119

గీ॥ నీమనోనిశ్చయము మెఱుఁగ ♦ నేవచించి
యుంటి నీరీతి నిదె ధ్యాన ♦ యుక్తుఁడవయి
యాలకింపుము తెలిపెద ♦ హరినిఁగూర్చి
తపముసల్పు విధాన బో ♦ ధను కుమార ! 120

—♦ నారదుఁడు ధ్రువునకు తపోవిధిని బోధించుట ♦—

వ॥ కుమారా ! ధర్మార్థకామమోక్షములను పురుషార్థ చతుష్టయ
ప్రాప్తికి హరిభక్తియే ప్రధానసాధనము. నీవిప్పుడు యమునా
తీరమునఁగల మధువనంబున కేగి స్నాతుండవై శ్రీమన్నారాయణ
నమస్కారపూర్వకముగ యమ, నియమాదులు నలవరచు
కొనితపంబును ప్రారంభింపుము. నీవు బాలుండవు. నిగమాధ్య
యనాది కర్మానర్హుండవు. కాన నీకుఁదగినట్లు నేనుపదేశంబు
నొసంగు మంత్రంబును,కుశాజినకృతంబులైన యాసనంబుల నాసీ
నుఁడవై చంచలత్వంబును మనోమాలిన్యంబును నశింపఁజేసి
స్థిరచిత్తంబున జపించుచు. 121

సీ॥ ఆశ్రిత భక్తజ♦నాధారుఁ డమలుండు
సురుచిరరూపుండు ♦ సుందరుండు
కమలాశ్రయంబైన ♦కమనీయ వక్షంబు
కలవాఁడు సకలమం♦గళకరుండు
కరుణాపయోనిధి ♦ పరమార్థసంధాత
ప్రణుతార్తిహరుఁడు లా♦వణ్యమూర్తి
కమనీయ వనమాలి ♦ కాధరుఁ డభయప్ర
దాత సర్వాభీష్ట ♦ దాయకుండు

గీ॥ అనుపమానందమూర్తి పీ♦తాంబరుండు
యోగిజన చిత్తధాముండు ♦ భోగిశయనుఁ
డఖలభూతాంతరాత్ముండు ♦ శ్యామలుఁడగు
హరిని మదినిల్పి తపము సే♦యంగవలయు. 122

వ॥ నాయొసంగెడి ద్వాదశాక్షరకలితంబగు వాసుదేవ మంత్రంబును జపించుచు దారు మృచ్ఛిలాదిరూపములలో నేదైననొకదాని యందు సర్వేశ్వరుని యాకారమును ధారణఁజేసి పూజించు చుండుము. అట్లొనర్చినయెడల నా దేవాదిదేవుండు నీకభిమతార్థంబు లిచ్చును. తపమొనర్చుకాలమున సంభవించుచుండెడి తాత్కాలి కాంతరాయములకు మనస్సును జలింపనీయక దృఢపఱచుకొనుము. నీకోర్కె నెఱవేరును. అనిపల్కి వాసుదేవ మంత్రమును ప్రణవరహితముగ నుపదేశించి వెండియు నిట్లనియె. 123

గీ॥ నేను తెలిపిన విషయము • లెన్నిమనమున
ధారణమొనర్చి వైళంబ • తపమొనర్ప
విమల యమునాతటంబున • వెలయుచున్న
మధువనముఁజేరుము ధ్రువకు • మార ! ఇపుడె. 124

గీ॥ అనుచుబోధించి యాతని • ననిపి శీఘ్ర
గతిని నుత్తానపాదుని • కడకుఁబోయి
యానృపునిచేతఁ బూజితుం • డై సుఖాస
నముననుండి యిట్లనె జన • నాథుఁగాంచి. 125

ఉ. వన్నెఁ దొఱంగియుండెను భ • వన్ముఖబింబము పార్థివేంద్ర ! నీ
కున్న విచారకారణము • నోడక తెల్పుమటన్న వెంటనే
యన్నరనాథుఁడిట్లనియె • హా ! మునినాయక ! ఏమనందు నా
కన్న వివేకహీనుఁడిలఁ • గల్గునె? ఘోరకిరాతుఁడక్కటా ! 126

గీ॥ అంతికంబున కరుదెంచి • యంకతలముఁ
జేరఁగోరినయట్టి నా • చిన్నితనయు
సురుచి మాటలువిని దయా • శూన్యుఁడనయి
వెడలనడచితి నాయట్టి • వెడఁగుకలఁడె?. 127

చ॥ జనకుఁడనైన నావలన ♦ సంభవమైన తిరస్కృతి నమ్మనం
బునఁదలపోసి కానలకుఁ ♦ బోయె సుతుండని విన్నవాఁడ నో
మునివర ! క్రూరసత్వగణ ♦ ము న్గని నాసుతుఁ డెంతజంకెనో
యని తలపోయుచుంటిని "స్వ♦యంకృత కర్మఫలంబి దేకదా. 128

కం॥ ఈవిధముగ దురపిల్లెడి
భూవిభు వదనమును గాంచి ♦ మునియిట్లనె నీ
వీవిధమునఁ జింతిలకుము
మావరుఁడే కాచు నీ కు♦మారుని వనిలో. 129

చ॥ వరగుణధాముఁ డాధ్యుఁడతి ♦ పావనుఁడైన భవత్కుమారుఁ డా
సరసిజనాభునిం దలఁచి ♦ చాలఁ దపంబొనరించి శ్రీరమా
వరుని యనుగ్రహంబున శు♦భప్రదదివ్యపదాధికారియై
వరములనంది రాఁగలఁడు ♦ వ్యాకులము న్విడు మింక భూవరా! 130

గీ॥ వంశదీపకుఁడైన నీ♦బాలకుండు
పరమ భక్తావతంసుఁడై ♦ సురలకైన
నందఁజాలనిస్థానంబు ♦ నందఁగలఁడు
చింతవిడువుము ♦ పోయివ♦చ్చెద నృపాల !. 131

వ॥ నారదుఁడీగతిని నుత్తానపాదునకు ధ్రువుని భవిష్యద్వృత్తాంతం
బెఱింగించి తనత్రోవనేగె. అటబాలుఁడగు ధ్రువుండు నారద
బోధను స్మరించుచుఁ హరింబాడుచు యమునాతీరస్థమగు మధు
వనంబుఁజేరి. 132

మ॥ యమునాతోయములందుఁ గ్రుంకులిడి యా♦హ్లాదంబుసంధిల్ల నా
విమలస్వాంతుఁడు ధీరచిత్తుఁడు వనో♦ర్వి న్బిల్వమూలంబునం
దు మహానందములో వసించి పరమా♦త్మండైన శ్రీవిష్ణురూ
పముఁ జిత్తంబున నిల్పి సుస్థిరమతిన్ ♦ బద్మాసనాసీనుఁడై. 133

గీ॥ తపముఁజేయ మొదలిడె నా♦ధన్యతముఁడు
పరిభవాగ్నికిఁ దోడు సా♦పత్న్యమాతృ
వాక్శరమ్ము లింధనమ్ము లై♦ భావమునకు
దౌత్రిరోషాభివృద్ధిని ♦ గలుగఁజేయ. 184

గీ॥ ఆదిఁ గందమూలాదుల ♦ నాహరించి
పిదప పర్ణాంబుభక్షుఁడై ♦ తదుపరి విమ
లానిలాశనుఁడై నిరా♦హారియగుచు
ఘోరతపమాచరించెఁగు♦మారుఁడపుడు. 185

—♦ ధ్రువునకు శ్రీహరి సాక్షాత్కరించుట ♦—

ఉ॥ ఆతఁడు సేయు ఘోరతప ♦ మాత్మఁ దృప్తినిడన్ గృపాబ్ధియౌ
మాతరుణీమనోధవుఁడు ♦ మంగళమూర్తి సరోజనేత్రుఁడా
భూతలనాథ నందనుని ♦ ముంగలనిల్చి వచించె నోకుమా
రా! తపమింకనిల్పుము వ♦రంబులఁగోరు మిదే యొసంగెదన్. 186

గీ॥ అనివచించినయాహరి ♦ యాకృతిఁగని
పరమవిభ్రమసంతోష ♦ భరితుఁడగుచు
మాట తడబడఁబాదయు♦గ్మమున వ్రాలి
వేడి కన్నీటిబాష్పము ♦ ల్విడువఁదొడఁగె. 187

వ॥ భగవానుఁడైన నారాయణుని దర్శనంబువలన బ్రహ్మానందపర వశుఁడై పలుకలేక కన్నీరుగార్చు బాలభక్తునిగాంచి శ్రీహరి తన శంఖముచే నతని కంఠకపోలప్రదేశంబులు స్పృశించినంత మాత్రమున ధ్రువుఁడు సకలవిద్యావిశారదుఁడై యాధ్యాత్మిక జ్ఞానసంపన్నుఁడై భక్తినిష్ఠుఁడై యంజలిఘటించి వేదార్థసమ్మతంబులగు వాక్యములతో హరి నిట్లు ప్రస్తుతించె. 188

—♦ ధ్రువుని హరి స్తవము ♦—

సీ॥ దేవ! నీవేకాకృ♦తి నెల్లుచును భవ
నామయాఖ్యమైన యా♦త్మీయశక్తి
చేత విశ్వంబును ♦ సృష్టించి తత్పదా
ర్థాంతరంబులఁ జేరి ♦ సంతతంబు
ధాతువులందున్న ♦ జాతవేదునిరీతి
నానాగతుల భాస♦మానుఁడవయి
విశ్వభిన్నుఁడవయ్యు ♦ విశ్వాత్మకుండవై
విశ్వరూపుఁడవౌచు ♦ వెలుఁగుచుండి

గీ॥ కార్యములకుఁ గారణుఁడవై ♦ కర్తవగుచు
నిఖిలశక్తియుతుండవై ♦ నెగడునట్టి
యాదినారాయణాఖ్యుండ ♦ వైన నిన్ను
నభినుతించెద సర్వలో♦కైకనాథ!. 139

మ॥ అరవిందానన! త్వత్పదాబ్జయుగళ♦ధ్యానానురక్తిన్భవ
చ్చరితాకర్ణన భాగ్యమున్గని సదా ♦ సంతృప్తులై నిర్జరుల్
పరమానందమునంది నివ్వదలి పోవ♦న్జాలరే! శ్రీరమే
శ్వర! యీమానవులెంతవారు నినునెం♦చ న్దీనచింతామణీ! 140

మ॥ పరమానందకరంబులై తనరు నో ♦ పద్మాక్ష! నీ సత్కథల్
సుర విద్యాధర సిద్ధ సాధ్య విబుధ ♦ స్తోమంబు వాంఛించు నీ
కరుణాపూరిత దృక్ప్రసారము సదా ♦ కాంక్షించుచున్నాఁడ శ్రీ
పరమేశా! భవనాశకా! గరుడగా! ♦ పద్మాలయానాయకా! 141

మ॥ పరుల న్వేడఁగఁబోను నెమ్మదిని నీ♦పైనుంచి త్వన్నామము
న్పరమార్థంబని యెంచి పాడెదను శ్రీ♦వత్సాంక! నారాయణా!
తరమే! నీదుమహాప్రభావగుణము ♦ న్దాత్రిన్దలంప న్భవ
చ్చరణాబ్జంబుల నమ్మినాఁడ భువనే♦శా! దీనచింతామణీ! 142

మ॥ ఒకదీపంబె ప్రదేశభేదముల నెంతో పెక్కురూపంబులై
యకలంకస్థితిఁ గాంతినిచ్చుగతి నో యబ్జాక్ష ! నీ రూప మీ
సకలాజాండమునందు భిన్నగతి దృశ్యంబై విరాజిల్లుచున్
బ్రకటంబౌఁగద పాపసంహరణ ! దేవా ! దీనచింతామణీ !. 143

ద ం డ క ము

శ్రీ దేవదేవా ! కృపాపూర్ణభావా ! పరబ్రహ్మరూపా ! హరీ ! సచ్చిదానందమూర్తీ ! జగత్పోష ! నారాయణా ! సర్వశక్త్యాత్మకా ! దీనచింతామణీ ! సర్వలోకావనా ! దివ్యతేజోమయా ! భక్తమందార ! వైకుంఠవాసా ! రమాసుందరీ మానసాంతర్విహారా ! గుణాతీత ! కళ్యాణమూర్తీ ! మహాయోగిహృద్ధ్యానగమ్యా ! శుభాంగా ! సమస్తంబు నీవే యటంచు న్మదిన్నమ్మియున్నట్టి భక్తుండ నో లోకపాలా ! భుజంగేంద్రశాయీ ! ప్రభూ ! అల్ల క్షీరాబ్ధిని న్ద్రచ్చువేళ న్సుధ న్ద్రావ దైత్యావళు ల్గోర నా మోహినీరూపముందాల్చి దేవాలి కందించవా ? యాసుధ న్నీవు వేదంబులంగొంచు వారాశినిం జేరియున్నట్టి దైత్యున్ హయగ్రీవుని న్మీనరూపుండవై చంపఁగాలేదె? కూర్మంబవై మందరం బెత్తఁగాలేదె ? క్రోడంబవై యాహిరణ్యాక్షు మర్దింపలేదే? నృసింహాంబవై భక్తప్రహ్లాదు రక్షింపఁగాలేదె? శ్రీవామనాకార ! శ్రీరేణుకానందనా ! రామచంద్రా ! యశోదాసుతా ! బౌద్ధకల్క్యాదిరూపా ! శుభాకార! లోకాళికి న్నేతవై త్రాతవై యున్న నీశక్తిని న్సన్నుతింజేయ నే నెంతవాఁడ? భవత్పాద దాసానుదాసుండ నజ్ఞుండ బాలుండ నో దివ్యరూపా ! రమానాథ ! యోభక్తమందార ! విష్ణూ ! నమస్తే నమస్తే నమస్తే నమః. 144

కం॥ అనియిటు నుతినొనరుచు భ
క్తునిరాజకుమారుఁగాంచి తోయజనేత్రుం
డనె నోరాజాత్మజ ! నీ
మనమునఁగలవాంఛితంబు మా కెఱుకపడెన్. 145

వ॥ నీవుకోరిన సర్వోన్నతపదవి యేరికినందరానిదైనను నీయందలి కృపఁజేసి యిచ్చుచుంటిని. అదెద్దియంటేని వినుము. గ్రహ నక్షత్రగణ మండితంబైన జ్యోతిశ్చక్రంబునంగల మండలము లన్నిటికంటె మహోన్నతంబై ప్రళయకాలంబునకైన నశింపక శాశ్వతప్రకాశవంతంబైన ధ్రువక్షితి యను పదమును నీకిచ్చు చుంటిని. నేఁటికిరువదియారువేల వర్షంబులు గతించినపిదప నీకా పదవిలభించును. అంతవనుక నీవురాజ్యంబుఁబాలించుచు మఱిప్రి తిగ ననేకక్రతువుల నాచరించి సర్వసుఖములనందుము. అంత్య కాలమున నన్నుస్మరించుచు సర్వలోక సంస్తూయమానంబును పునరావృత్తిరహితంబును సప్తర్షిమండలోన్నతంబునునగు పదవి నంది కృతార్థుండవయ్యెదవని వరంబిచ్చి నారాయణుం డంతర్ధా నుండయ్యె. 146

—♦ ధ్రువుఁడు హరివలన వరములంది పురమునకు వచ్చుట ♦—

కం॥ తదనంతరంబు ధ్రువుఁడతి
ముదమునఁ దనపురముఁజేరఁ ♦ బోవఁగ జనకుం
డెదురై కడుసంతోషము
గదురగఁ దోడ్కొని సునీతి ♦ కడకేగె వడిన్. 147

గీ॥ తల్లిదండ్రుల పాదపద్మముల కెఱఁగి
మాఱుతల్లి సురుచి చరణారవింద
ములకు వందనఁజేసి యా ♦ పుణ్యమూర్తి
సోదరునిపైనఁ దనప్రేమఁ ♦ జూపె ధ్రువుఁడు. 148

కం॥ ముద్దులు కొమరుఁడు ధ్రువుఁ డల
పెద్దల యాశీస్సులంది ♦ పిన్నలఁబ్రేమన్
ముద్దుఁగొని గౌరవించెను
అద్దిర! యని పొగడ సుజను ♦ లానందమునన్. 149

గీ॥ అంత నుత్తానపాదుండు ♦ సంతసమున
జ్యేష్ఠపుత్త్రుని రాజ్యాభి♦షిక్తుఁ జేసి
పరమసంతృప్తుఁడై తపో♦వనముఁ జేరె
శాంతియుత జీవితంబును ♦ జరుపనెంచి. 150

గీ॥ తనప్రజావళి ముదమంద ♦ ధర్మసరణిఁ
జాలకాలము ధ్రువుఁడు రా♦జ్యమ్ము నేలి
ధరణినిన్వీడి శ్రీహరి ♦ కరుణవలన
నచలపదవిని జేరె నా ♦ యనఘుఁడంత. 151

గీ॥ కాన మునులార ! ధ్రువుఁడట్లు ♦ కమలనయను
భక్తుఁడై దివ్యపదవిని ♦ బడయుట కల
నారదోపదేశముకాదె.♦ కారణంబు ?
అట్టి పరమోపకారి యీ♦యవనిఁ గలఁడె ? 152

కం॥ వినిపించెద మరియొకకథ
మునులార ! మృకండమౌని ♦ పుత్త్రుండగు స
జ్జననుతు మార్కండేయుని
ఘనచరితము నారదముని ♦ కార్యఫలంబున్. 153

—♦ మార్కండేయోపాఖ్యానము ♦—

చ॥ మునివరుఁ డొక్కరుండు కడు ♦ పూజ్యతముండు మృకండనాముఁడుం
డనఘుఁడు పుణ్యమూర్తి కలఁ♦డాతని భార్య పతివ్రతాశిరో
మణి లలనావతంసము ర♦మాసమ భర్తృపదార్చనంబె కో
రును దనమానసంబున మ♦రుద్వతినామమున న్జెలంగుచున్. 154

గీ॥ ఆతఁడొకదినమునఁ గమ♦లాసనసభఁ
గాంచఁగ నిరుపమోత్సాహ ♦ కలితుఁడగుచుఁ
బోవఁ దద్ద్వారపాలకు ♦ లమ్మునివరేణ్యుఁ
గాంచి సంతానహీనుని♦గా నెఱింగి. 155

పూర్వజన్మార్జిత • పుణ్యము న్దెలియఁగఁ
దగుసాధనంబు నీ•దర్శనంబు
పరమేశ్వరకరుణా • పాత్రులగుట కిలఁ
దగుసాధనంబు నీ•దర్శనంబు

గీ॥ వసుధలోన నీదర్శన • భాగ్య మఖిల
నరుల జన్మత్రితయపుఁ బు•ణ్యములఁ దెలిపి
ధన్యులనుజేయుఁగాదె యో•తాపసేంద్ర!
ప్రకట సద్గుణసాంద్ర! నా•రదమునీంద్ర! 16

గీ॥ అఖిలశాస్త్ర పురాణేతి•హాసములకు
నీవె కారణుఁడవు కావె? • నీదుశక్తి
సాధురక్షణ దుష్టశి•క్షణముఁ దోఁప
విమల భక్తాన్వయాధార! • విధికుమార! 167

గీ॥ పలువిధంబులఁ దన్నిటు • ప్రస్తుతించు
పుణ్య జాయాపతులఁ గాంచి • మునివచించె
పూని దంపతులార! మీ•మదిఁ గలంచు
వెతనశించుటకొక మంచి • వెరవుకలదు. 168

—• నారదుఁడు మునిదంపతులకుఁ దపముఁ జేయుమని బోధించుట• —

వ॥ అదెట్టిదో వచించెదను సావధానముగ నాలింపుఁడు. 169

కం॥ శర్వుని యనుగ్రహంబున
సర్వాభీష్టములుతీరు • సంశయమేలా!
సర్వేశ్వరుఁడగుమన్మథ
గర్వహాననుఁ గూర్చి తపముఁ • గావింపుఁ డొగిన్. 170

చ॥ వెలయుఁగదా మహేశునకుఁ • బ్రీతికరంబగువారణాశి మీ
తలచటకేగి గంగను క•రమ్మనురక్తిని స్నానమంది ని
శ్చలమతి విశ్వనాథపద • సారసముల్భజియించి మాధవా
దుల వినుతించి కానఁజని • తోరపుభక్తిఁ దపంబొనర్పుఁడీ. 171

కం॥ కరుణామయుఁడగు విశ్వే
శ్వరుఁడు భవద్వాంఛలెల్ల ♦ సమకూర్చు మునీ
శ్వరదంపతులారా! మీ
రరుగుఁడిఁక న్దపమొనర్ప ♦ నటవీస్థలికిన్. 172

గీ॥ అని ప్రబోధించి నారదుఁ ♦ డరిగె నంత
నామృకండుఁడు వైశంబ ♦ భామతోడ
శుభముహూర్తంబునఁ బరమే♦శునిఁదలఁచుచు
వారణాసీపురమునకుఁ ♦ బయనమయ్యె. 173

కం॥ కొలదిదినంబులకును వా
రలు కాశీనగర పరిస ♦ రమునకుఁజని ముం
గలను బ్రవహించు గంగా
జలఘోషము విని యతఁడు ♦ సతితో ననియెన్, 174

చ॥ హరిచరణాబ్జ సంజనిత ♦ నోట మదీయ జలానఁగ్రుంకిన
న్గురుతర పాతకంబులను ♦ గూల్చెద రండని పల్కెనాఁ గ బం
ధురమలయానిలోచ్చలిత ♦ తుంగతరంగజముంగళార్భటిన్
వరసురనిమ్నగాజనిత ♦ పావనఘోషము నాలకింపుమీ. 175

గీ॥ అనివచించుచు నుత్సాహ ♦ మతిశయిల్ల
ధర్మపత్నితో జాహ్నవీ ♦ తటముఁజేరి
కరయుగంబును జోడించి ♦ గంగనిటులఁ
బ్రార్థనముఁజేసి రత్యంత ♦ భక్తిగదుర. 176

మ॥ అమితామోదము నీదుదర్శనము న♦వ్యానందసంధాయకం
బు మహీ న్నీజలపానశక్తి సురసం♦పూజ్యా! సదాపుణ్యలో
కముల న్జేర్తువు నీదుభక్తుల నహో ♦ గంగాభవానీ! మహ
త్తమమాఁగాదె భవత్ప్రభావమిలమా♦తా! విష్ణుపాదోద్భవీ!. 177

మ॥ వ్రతము ల్దేవగురూత్తమాగ్రిజుల సేవ ల్పుణ్యదానంబుల
న్సతతంబున్నెఱవేర్చియు న్జగతిలో ♦ సాధింపఁగాలేని శా
శ్వతముక్తి న్భవదీయపుణ్యసలిల ♦ స్నానంబున న్గాంచి రో
నతభక్తాన్వయపోషణీ! సురధునీ! ♦ నానాజనోత్తారిణీ! 178

గీ॥ ఇటులు నుతియించి వారలు ♦ తృప్తిదీర
సంతసంబున జాహ్నవీ ♦ జలములందు
స్నానమొంది యనుష్ఠాన ♦ సరణిఁదీర్చి
విశ్వనాథుని దర్శింప ♦ వెడలిరపుడు. 179

వ॥ సత్వరగమనంబున విశ్వేశ్వరాలయంబుఁజేరి యమ్మహాదేవుని జ్యోతిర్మయలింగస్వరూపు నిట్లుధ్యానించిరి. 180

సీ॥ వేదాంతవేద్యాయ ♦ నాదానుమోదాయ
మంత్రాత్మకాయ నమశ్శివాయ
కళ్యాణరూపాయ ♦ గౌరీసనాథాయ
మునివినుతాయ నమో హరాయ
భక్తకామితదాయ ♦ పాపసంహారాయ
మోహనాశాయ నమో భవాయ
దేవాదిదేవాయ ♦ పావనాయ శివాయ
సచ్చిదానందాయ ♦ శంకరాయ

గీ॥ నీలకంఠాయ నిత్యాయ ♦ నిర్గుణాయ
లోకపాలాది వినుతాయ ♦ శ్రీకరాయ
శాంతరూపాయ ధ్యేయాయ ♦ స్మరహరాయ
ఈశ్వరాయ నమోఽస్తు తే ♦ హితకరాయ. 181

గీ॥ పెద్దయుంబ్రొద్దు విశ్వేశు ♦ వినుతిఁజేసి
శ్రీవిశాలాక్షిఁ గొనియాడి ♦ చిత్తమలర
నన్నపూర్ణామహాదేవి ♦ యడుగులకును
మ్రొక్కిరా పుణ్యదంపతుల్ ♦ ముదమెసంగ. 182

వ॥ తదనంతరం బా మృకండుఁడు భార్యాద్వితీయుఁడై కాలభైరవ
దండపాణి డుంఠిగణేశాది దేవతలమందిరములకేగి వారలకు నమ
స్కృతులు గావించి నిత్యయాత్రా పంచగంగాయాత్రల నొనర్చి
కాశీపురంబును నిర్గమించి యచటికిఁ గొలఁదిక్రోసులదూరంబునఁ
గల వనంబున వటతరుచ్ఛాయను పర్ణకుటీరంబు నిర్మించుకొనిన
వాఁడై 183

చ॥ నిగుపమభక్తి నీశ్వరుని ♦ నిల్పిమనంబున దేవబృంద మ
బ్బురపడఁ గందమూలఫల ♦ భోజనుఁడై యనిలాదుఁడై భయం
కర పవనాతపంబుల వి♦ఘాతములెన్నక సుస్థిరాత్ముఁడై
పురహరుఁగూర్చి ఘోరతప♦ము న్సలిపె న్మునివర్యుఁ డావనిన్. 184

—♦ తపముఁజేయు మృకండునకు శివుఁడు ప్రత్యక్షమగుట ♦—

ఉ॥ ఆతఁడుసేయు ఘోరతప ♦ మాత్మకుఁ దృప్తినిడ న్మహేశుఁడా
శీతనగాత్మజాధవుఁడు ♦ శ్రీరజతాచలవాసుఁ డెంతయో
ప్రీతిని నందివాహుఁడయి ♦ తృప్తియొసంగ భవానివెంటరాఁ
నా తరుణేందుమౌళి గర♦ళాదుఁడు దర్శనమిచ్చి యిట్లనెన్. 185

గీ॥ చాలుచాలు మృకండ! నిన్ ♦ బోలువార
లీజగంబునలేరు సం♦తృప్తి నొసఁగె
నిశ్చలంబైన నీ తపో♦నిష్ఠ మాకు
నుర్వి నీ వంటి సద్భక్తు ♦ లుండ రరయ. 186

గీ॥ నీ మనంబునఁగల కోర్కె ♦ యేమొ తెలియఁ
బలుకు మొసఁగెద నీదగు ♦ వాంఛితమును
పరమభక్తి నన్గొల్చు మ♦ద్భక్తవరుల
వాంఛఁ దీర్చుటయే నాదు ♦ ప్రతినగాదె? 187

చ॥ అనవిని యా మహాముని ర♦యంబున నా నగజాధినాథు మూ
ర్తిని గని మ్రొక్కి పెద్దగ ను♦తించి కరంబులుమోడ్చి యిట్లనెన్
దినకర తేజు మానికుల ♦ దీపకు సద్గుణగణ్యు మాన్యుఁడౌ
తనయు నొసంగుమా! గిరిసు♦తాధవ యంచు వచించునానితో. 188

గీ॥ అచలజాపతిపల్కె నీ ♦ వడిగినట్టి
వాంఛితము నిత్తుఁగాని నా ♦ పలుకు వినుము
పరమసుగుణాఢ్యు షోడశా♦బ్దముల వాని
నైన దుర్గుణుఁ జిరజీవి ♦ నైన "నిత్తు". 189

ఆ॥ వె॥ తెలుపు మిప్పుడనిన ♦ దేవ! దుష్టుండైన
తనయుఁడేల? నాకు ♦ ధర్మనిరతు
సుగుణవంతుఁడైన ♦ సుకుమారు నొసఁగు మ
ల్పాయువుగల కొమరుఁ ♦ డైననేమి? 190

గీ॥ నావుఁడట్లుగాక యనుచు ♦ నాగధరుఁడు
పలుకఁగ మరుద్వతీ దేవి ♦ పార్వతీ ము
ఖారవిందముఁ గాంచి పా♦దాబ్జములకు
వందనమొనర్చి యిట్లని ♦ ప్రస్తుతించె. 191

శా॥ శ్రీసంధానములై మహామహిమచే ♦ జేగీయమానంబులై
దాసశ్రేణి కభీష్టదాయకములై ♦ త్రైలోక్య పూజ్యంబులై
వాసింగన్న భవత్పదంబుల నెద ♦ న్వర్ణించెద న్భక్తితో
నోసంతాపనివారిణీ! భగవతీ! ♦ యోతల్లి! దుర్గాంబికా! 192

ఉ॥ నీదుతలంపుచేత జన♦నీ! భువనావలి బుట్టి త్వత్కృపా
మేదురదృక్పరంపరల ♦ మించి మహోన్నతిఁగాంచిసర్వదా
నీదువిలాసవైఖరిని ♦ నీమహిమాదులఁ జాటుచుండె నో
వేదమయీ! భవత్కృతికి ♦ వేరుజనించునె? సర్వమంగళా! 193

ఉ॥ ఓపరమేశ్వరీ! పరమ ♦ యోగిహృదంతరవాసి! నీ! భవ
త్ప్రాపునుగోరుభక్తులఁ గృ♦పన్గనుమా మముఁబుత్రమృత్యుసం
తాపదవానలంబునను ♦ దగ్ధముఁజేయఁ దలంపకమ్మ! గౌ
రీ! పరదేవి! మాయెడలఁ ♦ బ్రీతివహింపవె! శంభుగేహినీ! 194

గీ॥ చేతికిచ్చిమెఫలము భు♦జింపనీక
లాగికొనురీతిఁ బుత్రఫ ♦ లంబొసంగి
తత్ఫలానుభవము వేళ ♦ దయనుపేడి
యమితదుఃఖాబ్ధిఁ ద్రోయఁగ ♦ న్యాయమగునె? 195

గీ॥ కష్టములలోనఁ బుత్రశో♦కంబె గొప్ప
కష్టతరమాట దాని నే♦గతి సహింతు?
గర్భశోకము రాకుండఁ ♦ గరుణఁగనుమా
భక్తజనకల్పవల్లి! శి♦వామతల్లి. 196

వ॥ ఇట్లు పదంబులఁబడి దురపిల్లు మరుద్వతి నమ్మించుకొండపట్టి
కరమ్ముల లేవనెత్తి యిట్లనియె. 197

గీ॥ తెలివ! దేవరహస్యంబుఁ ♦ దెలుపరాదు
నీదు పరమపాతివ్రత్య ♦ నిష్ఠయొకటి
సకలశుభముల నొసఁగఁగఁ ♦ జాలుఁగాన
నీకు శుభమగునని పల్కె ♦ లోకమాత. 198

కం॥ ఆముని దంపతు లడిగిన
కామితము నొసంగి గరళ♦కంఠుఁడు గిరిజా
రామామణితోఁ సితగిరి
ధామమ్మున కరిగె మాని ♦ దంపతులంతన్. 199

—♦ మార్కండేయుని జననము ♦—

గీ॥ ఆశ్రమముఁజేరి శాంతి కా♦ర్యములఁ దీర్చి
ధర్మబద్ధులై దాంపత్య ♦ ధర్మసరణిఁ
గడుముదంబునఁ గాలము ♦ నడుపుచుండ
నీశుకరుణచే నెలతప్పె ♦ నింతికపుడు. 200

కం॥ నవమాసమ్ములు కడచి ప
దవమాసము జరుగుచుండఁ ♦ దనయునిఁ గనె నా
యువిద శివానుగ్రహమున
"శివతేజమె పుడమిలోన ♦ శిశువయ్యె" ననఁగ. 201

కం॥ ఆముని వాటికఁ గల ముని
కామినులందరును సూతి♦కాగృహమునకున్
సామోదహృదయులై చని
కామారి వరప్రసాదుఁ ♦ గాంచిరి ప్రేమన్. 202

కం॥ దినములు పదిగడువఁగ నా
ముని తన తనయునకు నామ♦మునువ్రాసె ముదం
బున మార్కండేయుఁ డనుచు
మనసారఁగ దీవనములు ♦ మాన్యులొసంగన్. 203

గీ॥ బాలచంద్రుఁడువోలె నా ♦ బాలకుండు
తల్లిదండ్రుల కానంద ♦ దాయకుఁడయి
యాశ్రమస్థిత సర్వజ♦నావలు లతి
సంతసంబంద దాఁటెను ♦ శైశవమును. 204

గీ॥ పంచమాబ్దంబురాఁగ న♦బ్బాలకునకు
చౌలముఁ బూర్తిఁగావించి ♦ సరసఁ జేర్చి
'ఓమ్నమశ్శివాయ' యనుచు ♦ నుచ్చరింపఁ
జేసి వ్రాయించె నక్ష రా♦భ్యాస విధిని. 205

వ॥ బాల్యము కడచుచున్నకొలఁది సద్గుణవంతుఁడైన యాబాలుఁడు. 206

—♦ మార్కండేయుని విద్యాభ్యాసము ♦—

చ॥ గురుకులమందు బాలకుఁడు ♦ కోర్కెమెయి న్సకలాగమంబులన్
నిరుపమ భక్తిమై చదివి ♦ నేర్పుగడించుచు శేషకాలము
న్బరశివ నామకీర్తనలఁ ♦ బాడుచుఁ దన్మహిమాదిగాథలన్
దరచుగ నాలకించుచు ము♦దంబునఁ బుచ్చుచునుండుఁ గాలమున్.

క॥ తనయు జీవితపరిమితిఁ ♦ దలఁచి తల్లి
దండ్రు లాతని మునుల పా♦దయుగములకుఁ
మ్రొక్కఁజేయఁ "చిరంజీవ ♦ పుత్త్ర!" యనుచు
వారు దీవనలిత్తు రా♦బాలకునకు, 208

గీ॥ బాలకున కష్టమాబ్దంబు ♦ వచ్చినంత
నుపనయనమొనరించి బ్ర♦హ్మోపదేశ
మొసఁగె జనకుండు పిదప వే♦దోపదేష్ట
యైన యాచార్యుసన్నిధి ♦ నప్పగించె. 209

వ॥ గురువులసన్నిధి నమ్మార్కండేయుఁడు వేద వేదాంగ శాస్త్రాదు
లధ్యయనమును జేయుచుండఁ బదుమూఁడు వత్సరంబుల ప్రాయము
నిండుటగమనించి మృకండ మరుద్వతులు వాని యాయుఃపరి
మితిని దలంచినవారై పెల్లుగ దుఃఖించుచుండ. 210

ఉ॥ వారిమనోగతంబయిన ♦ వ్యాకులపాటును గుర్తెఱింగియా
నారద దేవమౌని కరు♦ణాళుఁడు వారలయార్తిఁదీర్పఁదాఁ
జేరె మహాతపోధను వ♦సిష్ఠమునీంద్రునియాశ్రమంబు గౌ
రీరమణీమనోహరునిఁ ♦ బ్రీతినిఁ బాడుచుఁగౌతుకంబునన్. 211

గీ॥ చేరి యామహామునిని దర్శించినంత
నావసిష్ఠుండు నారదు నమితభక్తి
తోడఁ ద్వరగతి నెదురేగి తోడితెచ్చి
పూజలను కడుభక్తితో ముని యొనర్చె. 212

గీ॥ సముచితాలాప సంభాషణములతోడఁ
గొంతకాలంబు కడచినయంత నార
దుండు బ్రహ్మర్షిచంద్రుని తోడఁబల్కె
నొక్కసంగతి యుత్సాహ యుక్తుఁ డగుచు. 213

కం॥ అనఘ! మృకండమహాముని
తనయుని విద్యావిభూషు ధర్మచరిత్రున్
జననుతు మార్కండేయుం
డను బాలకునిఁ గనంగ నరుగుచునుంటిన్. 214

ఉ॥ ఏమనిపల్కుదు న్మునికులేశ్వర యాతనిదివ్యవృత్తమున్
భూమిని నట్టిబాలకు నపూర్వగుణాఢ్యుని వంశదీపకు
న్గామసమానసుందరుని గానము గానముసల్పుసర్వదా
హైమవతీమనోహరమహత్త్వము నెంచుచు మానసంబునన్. 215

సీ॥ తెల్లవారఁగ లేచి తల్లిదండ్రులపాద
పద్మంబులకుఁ జేయు వందనంబు
పరమభక్తియొసంగఁ గరముఖఁ దట్టుచు
గానమొనర్చు శంకరునిమహిమ
శ్రద్ధాసమేతుఁడై శాంతచిత్తంబునఁ
జేయును బెద్దల సేవ నెపుడు
స్నానసంధ్యాద్యనుష్ఠానముల్దీర్చి స
కాలంబునకు వహ్ని కార్యవిధిని

గీ॥ భక్తితోనెఱవేర్చ నా♦సక్తుఁడగుచు
శంకరవరప్రసాద సం♦జనితుఁడైన
యీకుమారు సుగుణసమూ♦హముల నెన్న
నవనిశక్యమె? నాకు బ్ర♦హ్మర్షిచంద్ర!. 216

గీ॥ వినుము మునినాథ! నాదొక ♦ మనవికలదు
అతిరయంబున నావెంట ♦ నామృకండు
నాశ్రమంబున కరుదెంచి ♦ యీ కుమారు
వందనముఁగొని దీవింప♦వలయు నిపుడె. 217

వ॥ శ్రమయని తలంపక నా యీ ప్రార్థనమును మన్నింపవలయునని వేఁడు నారదునిమాటలఁ ద్రోసివేయఁజాలక వసిష్ఠుఁ డాతనితోఁ బయనమై మృకండు నాశ్రమముఁజేర నమ్ముని భార్యయగు మరుద్వతింగూడి వసిష్ఠ నారదుల కెదురేగి యర్ఘ్యపాద్యాదు లిచ్చి యుచితాసనంబులఁ గూర్చుండఁబెట్టి వసిష్ఠునిఁ బెక్కు గతుల వినుతించి. 218

గీ॥ బ్రహ్మతేజో విరాజిత! ♦ వందనంబు
వందితాఖిల సురగణ! ♦ వందనమని
పదములకు మ్రొక్క నా ముని ♦ ప్రవరుఁడపుడు
పరమవాత్సల్య మునను దీ♦వన లొసంగె. 219

కం॥ మునినాథుని పాదంబులఁ
దనయుని బడవేయ మాని ♦ తల్లజుఁ డాశా
ఋనిఁగని సంభ్రమము మదిని
పెనఁగొనఁగ వసిష్ఠుఁ డమిత ♦ విస్మితుఁడగుచున్. 220

—♦ వసిష్ఠమహాముని మార్కండేయుని దీవించుట ♦—

సీ॥ ప్రతిసిమేషంబును ♦ బరమేశ్వరధ్యాన
పరవశత్వంబునఁ ♦ దిరుగువాని
సకలపదార్థ సం♦చయమందుఁ బరశివు
స్వీక్షించి కన్నీరు ♦ విడుచువాని

పంచాక్షరీమంత్ర • పఠనంబుననె సదా
లగ్నచిత్తుఁ డయిమె • లంగువాని
సర్వకాలములందు • సర్వేశ్వరధ్యాన
సంకీర్తనాదులు • సలుపువాని

గీ॥ దైవతములంచుఁ బితరులఁ • దలఁచి మూఁడు
కాలములఁ గొల్చువాని బ్ర•కాశమాను
సకల సుగుణాలవాలుఁ బ్ర•జ్ఞాసమేతుఁ
గని వసిష్ఠుండు దీవించెఁ • గరుణతోడ. 221

ఉ॥ శ్రీకరుఁ డాదిదేవుఁడు వి•శేష విలాసగుణాభిరాముఁ డా
ర్యాకమలాననా హృదయ • రంజనుఁ డంగజవైరి నిత్యశో
భాకరుఁ డాత్మమూర్తి గిరి • జార్ధశరీరు ననుగ్రహంబునన్
నీకు లభించు భద్రములు • నిల్చును ధారుణి దీర్ఘజీవివై. 222

మ॥ అని దీవింపఁగ నారదుండనియె నో•యయ్యా! మహేశుండు తా
నని నీబాలుఁడు ఘోరశాబ్దములవాఁ • డంచు న్వరంబిచ్చె వే
శీను దద్భిన్నముకాదె నీదునుడువు • ల్బ్రహ్మర్షివర్యా! వసి
ష్ఠుని వాగ్జాలమసత్యమైన భువన•స్తోమంబు కంపింపదే? 223

ఉ॥ నారదుఁడన్నయట్టి వచ•నంబులఁ జింతితుఁడై వసిష్ఠుఁ డా
కారముఁగొన్న విగ్రహము • కైవడి నిశ్చలుఁడై తలంచె ని
ట్లూరక తెచ్చుకొంటి నెటు•లోగద యాడినమాటనిల్చు టా
ర్యారమణుం డొసంగిన, ని•యామకముజ్జవదాఁట శక్యమా? 224

గీ॥ ఏమి కర్తవ్యమో తోచ•దిపుడు నాకు
నారదా! యన్న నాతండు • నగుచుఁ బల్కె
నింత యల్పవిషయమున • కిటుల వంతఁ
జెందఁగా నేలనయ్య? వ•సిష్ఠమౌని! 225

గీ॥ పరమపావనుండవగు నీ♦వాక్యమెపుడు
సార్థకమెగాని యేరీతి ♦ వ్యర్థమగును ?
కలదు తోంచిన వెరవొండు ♦ పలుకుచుంటి
దాని నాలింపు మదియొక♦ర్తవ్యమిపుడు. 226

క॥ మనమీబాలునిఁగొనియా
వనరుహాభవుపదయుగమునఁ ♦ బడవేయుటయే
ఘనకర్తవ్యము తదుపరి
కనఁగలమటుపై నిజరుగు ♦ కార్యంబేమో. 227

వ॥ అనిపల్కి వసిష్ఠునంగీకరింపఁజేసినవాఁడై తల్లిదండ్రుల యనుమతి పై మార్కండేయుని వెంటఁగొని మువ్వురును సత్యలోకముం జేరి చతుర్ముఖసభాస్థలంబునకేగి తన్మధ్యమున వామభాగాసీన యైన పలుకులచెలువయొనర్చు వీణాగానమునకుఁ దలయూచు చున్న తమ్మిచూలింగాంచి సమీపించి నమోవాకంబులు సమ ర్పించి వెంటనున్న మార్కండేయుని వందనంబొనరింపుమను టయు నాయర్భకుండు పరమేష్ఠిపాదద్వయమునకు సాష్టాంగ ప్రణామంబులాచరించి ముకుళిత కరాంజలియై యిట్లు ప్రస్తుతించె. 228

సీ॥ భువననిర్మాణ సం♦భూతయశోన్విత
పరమస్వరూపాయ ♦ పావనాయ
పరమపూత స్వయం ♦ భాసమానాగమ
శబ్దిత సుముఖాయ ♦ శాంతిదాయ
మధురసంగీత స♦మ్యక్స్నాహితీకుచ
నవ్యభాషాసతీ ♦ నాయకాయ
నిజకృపారక్షిత ♦ నిఖిలభక్తగణాయ
లోకపాలనుతాయ ♦ శ్రీకరాయ

గీ॥ నిరతవేదాంత మార్గసం♦చరణపరమ
నిర్మలతపోధనాన్విత ♦ నిఖిలదివ్య
మానిజనన కారణభూత ♦ మానసాయ
వందితాయ నమోస్తు తే ♦ భవ్యగేయ! 229

సీ॥ అని నుతించుచు ధాతపా♦దాబ్జములకు
వందనముసల్పి యంజలి ♦ బద్ధుఁడగుచు
నిలువఁబడియున్న మునిబాలు ♦ నలువ కాంచి
సంభ్రమాశ్చర్య పూరిత ♦ స్వాంతుఁడగుచు. 230

—♦ బ్రహ్మదేవుఁడు మార్కండేయుని దీవించుట ♦—

చ॥ వికసితపద్మలోచను వి♦వేక సమన్వితు లోకసన్నుతున్
సకలగుణాభిరాముని బ్ర♦శ స్తచరితు మృకండపుత్త్రుఁ గాం
చి కరము బాలకో త్త ముని♦శీర్షము పైనిడి పల్కె నిట్టుల
ర్భక! శశిమౌళి నీ కొసఁగు ♦ భద్రచిరాయు రుదారసంపదల్. 231

గీ॥ అల యుమాశంకరానుగ్ర♦హమునుబొంది
వసుధలోఁ జిరంజీవివై ♦ పరశివపద
భక్తమణివై మహర్షివై ♦ బ్రదుకుమయ్య
భావిబాలుర కాదర్శ ♦ భావుఁడవయి. 232

కం॥ వాణీపతి దీవనలను
మౌనీశ్వరు లాలకించి ♦ మందస్మితులై
యా నలువఁగాంచి యని రీ
శానుం డీబాలు ఖోడ ♦ శాబ్దుండనియెన్. 233

కం॥ ప్రాయము పదునారబ్దము
లే యని శంకరుఁడు నిర్ణ ♦ యించెను మును దం
డ్రి ! యేతెఱఁగున నీ నుడి
యీ యవసరమునను జరుగు ♦ నించుక చెపుమా. 234

ఉ॥ నావుడు ధాత యిట్లనియె ♦ నా పలుకెన్నఁడు రిత్తకాదు గౌ
రీవరు పాలికేగి వివరించి సమస్తము నాజ్ఞనందెదన్
నా వచనంబు సెల్ల ముని ♦ నాయకులార ! భయంబు వీడుఁడీ
భావజవైరి భక్తగణ ♦ పాలుఁడు నా నుడు లాలకింపఁడే. 235

గీ॥ మీర లీబాలుఁగొని గౌతమీతటస్థ
తాపసాశ్రమమునఁ జేర్చి ♦ పాపహరణుఁ
డైన పరమేశతత్త్వమున్ ♦ ధ్యానవిధిని
దెలియఁబలుకుఁడు తదుపరి ♦ కలఁడు శివుఁడు. 236

కం॥ అని యానతిచ్చి చతురా
ననుఁడు మునీశ్వరులఁ బంపె ♦ నారదుఁడు వసి
ష్ఠునివీడ్కొని మార్కండే
యునితో గమ్యస్థలంబు ♦ నొయ్యనఁ జేరెన్. 237

—♦ నారదుఁడు మార్కండేయునకు శివభక్తి బోధించుట ♦—

గీ॥ విమలమగునొక తాపసా ♦ శ్రమమునందు
బాలుఁగూర్చుండఁబెట్టి యీ ♦ లీలవాని
వత్స ! సావధానుండవై ♦ పరమశివుని
భక్తి బోధింతు వినుమని ♦ పల్కెనపుడు. 238

వ॥ కుమారా ! శ్రద్ధతో నాలకింపుము. కుమారాత్మీయుండును సచ్చిదానందమూర్తియు సకలలోకశుభప్రదాతయు మృత్యుంజయుండగు పరమేశ్వరుని మించిన దైవము వేరొండు లేఁడు. పరాత్పరుండును నాదిమధ్యాంతశూన్యుం డగు నమ్మహానుభావుం బరిశుద్ధహృదయముతో సేవించినవారి కెందును కొదువలు లేవు. సకలాపన్నివారకుఁడైన యాపరశివుని లింగరూపంబునఁ బ్రతిష్ఠించి యందా యుమాపతి నావాహనంబొనర్చి ధ్యానాదిషోడశోపచారంబులఁ ద్రికాలములయందును బూజ సల్పుచు నచంచలమనస్కుండవై ధ్యాననిష్ఠుండవై తపంబొనర్చితివేని నీకు

సర్వారిష్టంబులును దొలఁగిపోవును. అమ్మహానుభావుని మహిమ లవాఙ్మానసగోచరంబులు. 239

సీ॥ సంసార బంధము ♦ ల్సడలునే ? గౌరీశ
చరణాబ్జముల సేవ ♦ సలుపకున్న
దురిత సంఘంబులు ♦ తొలఁగునే ? భక్తితో
శ్రీ శివార్చనమును ♦ జేయకున్న
అఖిల కల్యాణము ♦ లబ్బునే ? కైలాస
వాస సంకీర్తన♦ ల్పాడకున్న
శాశ్వత దివ్యమో♦క్షఫలంబు దొరకునే ?
దేవాది దేవుఁ జిం♦తింపకున్న

గీ॥ పుడమి లౌకిక విషయ వి♦మోచనంబు
నందివాహను సచ్చిదా♦నంద మయుని
స్వస్వరూపానుసంధాన ♦ భాగ్యగరిమ
కలుగునే ? చంద్రశేఖరు ♦ కరుణలేక. 240

సీ॥ శ్రీకంఠ పాదరా♦జీవపూజయె కాదె
హస్తముల్కల్గిన ♦ యట్టి ఫలము
సాంబసదాశివ ♦ సంకీర్తనంబె జి
హ్వాగ్రము లభియించి♦నట్టి ఫలము
గౌరీశ్వరాలయ ♦ గమనం బొనర్చుటే
పాదయుగంబున్న ♦ వరఫలంబు
పరమేశు దివ్యరూ♦పమును దర్శించుటే
కన్నులున్నందుకు ♦ ఘనఫలమ్ము

గీ॥ నిరత పరమేశ్వరధ్యాన ♦ నిష్ఠకలిగి
ప్రణవ పంచాక్షరీమంత్ర ♦ పఠనమందుఁ
దత్పరతఁగాంచి నిశ్చల ♦ తపముఁజేయు
టొకటె జన్మకు ఫలితార్థ ♦ ముర్విలోన. 241

ఆ॥ వె॥ ఇటులు నారదముని ♦ యిందుధరుని భక్తి
తత్త్వమును వచించి ♦ తపముఁ జేయఁ
జాలఁ బ్రోత్సహించి ♦ శైవపంచాక్షరీ
దివ్యమంత్రము నుప♦దేశ మొసఁగె. 242

వ॥ నారదుండు మార్కండేయున కవ్విధంబునఁ దపముఁ జేయు విధానముఁ దెల్పి పంచాక్షరీమంత్రోపదేశంబు నొనర్చి యమున కీవార్త నెఱింగింపఁ బరేతలోకంబున కేగె. ఇట మార్కండేయ కుమారుండును నారదుం డుపదేశించిన శ్రీ శివపంచాక్షరీ మహామంత్రమును భక్తిశ్రద్ధలతోఁ బురశ్చరణంబొనర్చుచు నొక్క శివలింగంబును నిర్మించుకొని యభిముఖుఁడై షోడశోపచార విధులఁ బూజించుచు నహోరాత్రములు చంద్రశేఖర దివ్యనామ భజనానందమగ్నుఁడై యన్యంబు మరచి తపము సల్పుచుండ. 243

గీ॥ వరుసనీరీతిఁ బదునారు ♦ వత్సరములు
పూర్తియగుటయు నారదు ♦ ముఖమునుండి
సకలవృత్తాంత మెఱిఁగిన ♦ శమనుఁ డపుడె
పయనమయ్యె బాలకుని జీ♦వములఁ గొనఁగ. 244

—♦ యముఁడు మార్కండేయుని జీవమును గ్రహింపవచ్చుట ♦—

వ॥ మార్కండేయుని ప్రాణవాయువును బంధింపఁదలంచి పాశహస్తుఁడై మహిషవాహనారూఢుండై యాపరేతనాయకుఁడు 245

చ॥ చనిచని కాంచె నాయముఁడు ♦ శంభుపదాంబుజ లగ్నచిత్తునిన్
జనసుతసచ్చరిత్రుని ప్రశాంతగుణాఢ్యుని లోకవందితు
న్మనసిజసుందరాంగుని నుమాధవపావన దివ్యనామకీ
ర్తనమునఁ జిత్తమున్నిలిపి ♦ తన్మయుఁడైన మృకండపుత్త్రునిన్. 246

గీ॥ కాంచి విభ్రమస్వాంతుఁడై ♦ గరళకంఠు
పూజలో మగ్నుఁడైన యా ♦ మునికుమారు
దివ్యసుందరాకృతిఁ గాంచి ♦ తృప్తుఁడగుచు
నిటుల వర్ణింపఁదొడఁగె నా ♦ వటుని యముఁడు. 247

సీ॥ శివభక్తి బోధింపఁ ♦ జిత్తమందుఁ దలంచి
పుట్టిన పార్వతీ ♦ పుత్త్రి యనఁగ
శుద్ధసాత్త్విక గుణ♦స్ఫూర్తిని గైకొని
జన్మించిన హరితే♦జంబనంగ
ఆకృతిధరియించి ♦ యవతరించినయట్టి
మా సుతుండైన మ♦న్మథుఁ డనంగ
సకలజనాహ్లాద ♦ జనకుఁడై జగమున
జననమందిన యట్టి ♦ శశియనంగ

గీ॥ విమలగుణములనెల్లను ♦ గమలగర్భుఁ
డొక్క-చోటికిఁ జేర్చితా ♦ నోర్పుతోడ
బాలరూపంబుగాఁజేసి ♦ పంపెననఁగ
వెలయుచున్నాఁడు చూడ నీ ♦ విప్రసుతుఁడు. 248

గీ॥ ఐననేమాయె నా విధి ♦ నరయవలదె?
యీతఁడెట్టివాఁడైన నా ♦ కేమిచింత ?
చెల్లె నీతని కాలంబు ♦ జీవములను
పాశములఁబట్టి బంధింప ♦ వలయు నిపుడె. 249

మ॥ అని యీరీతిఁదలంచి కాలుఁడు మహా♦హంకారియై పాశమున్
గొని శంకారహితాత్ముఁడై తపమునన్ ♦ గూర్చున్న యా బాలకు
న్గని పల్కె-న్మునిబాలకా ! వినుము నీ ♦ కాలంబు సంపూర్ణమా
యెను నీ జీవముల న్గ్రహింప నిదె నే ♦ నేతెంచితి న్గాలుఁడన్. 250

గీ॥ యముఁడుపల్కి-నవాక్యము ♦ నాలకించి
కడు భయాకులుఁడగుచు మృకండసుతుఁడు
హామహాదేవ ! మృత్యుంజయా ! యటంచు
కరములనుజాచి లింగము ♦ న్గౌఁగలించి. 251

కం॥ హర! శంకర! సర్వేశా!
కరుణామయ! భుజగభూష! ♦ గౌరీనాథా!
శరణార్థిని నన్గావుము
పరమేశ్వర! యనియతండు ♦ ప్రార్థనఁజేసెన్. 252

శా॥ కాలుండప్పుడు కాలపాశమున మా♦ర్కండేయు లింగంబుతోఁ
గూలంద్రోసి తదీయజీవముల వేఁ♦గొంపోవఁగా నెంచి తా
కేలన్పాశముఁదీసి చేతులఁబినా♦కి న్బట్టియున్నట్టి యా
బాలుండైన మృకండపుత్త్రుమెడపై ♦ వైచెన్ మహోద్రేకుఁడై. 253

—♦ లింగములోనుండి శివుఁడు ప్రత్యక్షమై యముని శిక్షించుట ♦—

వ॥ అయ్యవసరంబున భక్తావనతత్పరుండగు శంకరుఁడును 254

గీ॥ కన్నుగానక యధికార ♦ గర్వియగుచు
బలిమిమై తన్ను తనభక్తుఁ ♦ బట్టఁదలఁచి
పాశమునుదగల్చిన సమ♦వర్తిఁగాంచి
భువనభీకర ప్రళయోగ్ర ♦ మూర్తియగుచు. 255

ఉ॥ పొంగినక్రోధవేగమున శి♦వుండొనరించిన గర్జనంబునన్
నింగిప్రతిధ్వనింపఁగఁదిర♦ణేత్రుఁడు హుంకృతిసల్పుచు న్మహా
లింగమునందుఁ గన్పడి ని♦లింపులు గుంపులుగూడి చూడఁగా
నంగజవైరి శూలమున ♦ నాయముని న్బడవైచె భూమిపై. 256

గీ॥ భవుని భక్తవాత్సల్యభా♦వమునకపుడు
సురవరులు కురిపించిరి ♦ విరులవాన
దేవదుందుభుల్ మ్రోసెను ♦ దివిజులెల్ల
"జయమహాదేవ" యనిపల్క ♦ సాగిరంత. 257

గీ॥ అటుల సాక్షాత్కరించిన ♦ యభవుఁగాంచి
భక్తరత్నమైన మృకండ ♦ బాలకుండు
పరవశుండయి కనుల బా♦ష్పములుగ్రమ్మ
నడుగుఁ దమ్ములవ్రాలి యి♦ట్లని నుతించె. 258

చ॥ శరణు మహేశ ! భక్తజన ♦ సన్నుతదివ్యపదారవింద ! శం
కర ! కరుణాలవాల ! యురగ♦రాజవిభూషణ ! పార్వతీశ్వరా !
శరణు పవిత్రపాదయుగ ! ♦ చంద్రకళాన్వీత ! వేదవేద్య ! నీ
చరణయుగంబు నమ్మితిమి ♦ సాధుజనప్రియ ! లోకపావనా !. 268

శా॥ దేవా ! సర్వజగన్నియామకమహా ♦ దీక్షాసమేతుండవై
శ్రీవాణీశపురందరాది సురసం♦సేవ్యుండవై యొప్పు నిన్
భావింపన్నముబోంట్లకున్నర మె? వి♦శ్వవ్యాప్త ! భక్తాళికిన్
నీవే మోక్షఫలంబిడన్దగుదు వో ♦ నిత్యానుకంపానిధీ !. 269

గీ॥ విధియు మునివరు లీరీతి ♦ వినుతి సేయఁ
దృప్తుఁడై తనకు నమస్క♦రించు యమునిఁ
గరుణతోఁ జూచి భక్తమృ♦కండ సుతునిఁ
బ్రేమతోఁ జేరఁబిల్చి దీ♦వించె నిటుల. 270

—: శివుఁడు మార్కండేయుని దీవించుట :—

గీ॥ తరణి చంద్రాదు లున్నంత ♦ వఱకు షోడ
శాబ్దజీవితుఁడవగుచు ♦ నవనిలోన
బ్రహ్మకల్పపర్యంతము ♦ బ్రదుకుమయ్య !
తపసివై బాలకులకు నా♦దర్శుఁడవయి. 271

కం॥ తల్లులు ధాత్రి న్దమతమ
పిల్లలతల నీరుపోయు ♦ వేళల నీపే
రుల్లసమున వచియింపుచుఁ
జల్లఁగ దీవించుచుందురు ♦ స్వాంతం బలరన్. 272

గీ॥ అనుచు వరమిచ్చి శంకరుఁ ♦ డరిగెనంత
బ్రహ్మయు వసిష్ఠుఁడును ముని ♦ బాలకునకు
దీవనలొసంగి చనిరి సం♦తృప్తితోడఁ
గాంతను సుతుని గొని యా మృ♦కండుఁ డరిగె. 273

గీ॥ నారదుం డీవిధమున నొ♦నర్చియున్న
కార్యము లనంతములు వాని ♦ గణనసేయఁ
జాలరు నరునిజీవిత ♦ కాలమైన
నమ్మహాత్మునిలీల ల♦త్యద్భుతములు. 742

గీ॥ అఖిలమానవ నిత్యసౌ♦ఖ్యమును గోరి
పార్వతీశుండు తెలిపిన ♦ పరమ భక్తి
తత్త్వమంతయు నా నార♦ద మునివరుఁడు
వ్రాసి యొసఁగెను భక్తిసూ♦త్రంబు లనఁగ. 275

కం॥ ఎనుబది నాలుగు సూత్రము
లను నారదమౌని భక్తి ♦ లక్షణ మెల్లన్
మనమునకు బోధపడు రీ
తిని రచియించెను బుధులకుఁ ♦ దృప్తియొసంగన్. 276

ఉ॥ నారదభక్తిసూత్రములు ♦ నారదమౌని కథావిధానమున్
గోరి పఠించువారలకు ♦ గోభువనేశుఁడు రాధికామన
స్సారస భాస్కరుండు జల♦జాయతనేత్రుఁడు కృష్ణదేవ మీ
ధారుణి భక్తియోగమునఁ♦దన్పుచు ముక్తులఁజేయు సర్వదా. 278

ఆశ్వాసాంతము.

మాలినీవృత్తము

మునిజననుతనామా! ♦ భూమిజాచిత్తకామా!
దనుజగణవిరామా! ♦ తాపసోద్ధార! రామా!
వనజరుచిరనేత్రా! ♦ వాయుజస్తోత్రపాత్రా!
మనసిజసమగాత్రా! ♦ మాన్యసుగ్రీవమిత్రా!. 278

భాస్కర విలసితవృత్తము.

సారసదళసమలోచన ! రామా ! ♦ సాధుజనవినుత ! రవికులసోమా !

మారహరసఖ ! జగన్నుతనామా ! ♦ మానిజనహృదయ నిరుప
ధామా !

ఘోరదనుజహర ! రాజలలామా ! ♦ కోమలతరపదయుగ ! రఘు
రామా !

నారదనుత ! దశకంఠవిరామా ! ♦ నందితురగనుత ! దశరథరామా !

— ♦మ ం గ ళ ము ♦—

కం. మంగళమిదె కొను రామా !
మంగళ మో జానకీశ ! ♦ మంగళనామా !
మంగళము దశరథాత్మజ !
మంగళమిదియే గ్రహింపు ♦ మా ! రఘురామా! ॥

గద్య॥

ఇది శ్రీరామచంద్రవర ప్రసాద లబ్ధకవితా భాగధేయ కేతవరపు
వంశపయఃపారావార రాకాసుధాకర కాశ్యపసగోత్రోద్భవ
శ్రీలక్ష్మీనరసింహ గురుపుత్త్ర రామకృష్ణ నామ
ధేయప్రణీతంబైన "భక్తనారదీయ" మను
గద్య పద్యాత్మక కావ్యమునందు
షష్ఠాశ్వాసము (సర్గము)
సంపూర్ణము.

" హరిః ఓమ్ తత్సత్ "

# తప్పొప్పుల పట్టిక

## తొలిపలుకు మొదలు 24 వ పేజీవరకు

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 11 | శాసితం | శాసనం |
| 12 | 2 | పంచననాది | పంచాననాది |
| ,, | 24 | చారుదక్షః | చారువక్షాః |
| 14 | 4 | రామకృష్ణ ♦ సుకవి | రామ ♦ కృష్ణ సుకవి |
| 18 | 11 | పాత్త్రిమై<br>పాత్త్రిమగు | పాత్రిమై<br>పాత్రిమగు |
| ,, | 25 | పాత్త్రులైరి | పాత్రులైరి |
| 19 | 1 | మిత్త్రి | మిత్రి |
| ,, | 3 | నిశ్వనాథ | విశ్వనాథ |
| 24 (ర) | 15 | లేమి నీ | లేమి యీ |

## విషయసూచికలో

| | | | |
|---|---|---|---|
| 1 | 5 | షష్యంత | షష్ఠ్యంత |
| 3 | 6 | యాఙ్ఞచే | యాఙ్ఞచే |
| 4 | 16 | శిపుడు | శివుడు |

## కావ్యారంభమునుండి

| | | | |
|---|---|---|---|
| 6 | 16 | లీల్వాష | లీలాస్వ |
| 7 | 1 | వఃబ్రా | వఃబ్రాన |
| ,, | 19 | మునితి | మునివి |
| 8 | 12 | తాకృతిన్ ॥ | తాకృతికిన్ ॥ |
| 9 | 14 | గండకీ | గండక |
| 12 | 4 | దెలుత | దొలుత |
| ,, | ,, | బేమ | బ్రేమ |
| 16 | 24 | కిటకం | కీటకం |
| 20 | 8 | దుష్పథ | దుష్పథ |

| | | | |
|---|---|---|---|
| 24 | 24 | చెయ | చేయు |
| 26 | 18 | తాఖల | తాఖిల |
| 27 | 24 | చుండ్రు | చుంద్రు |
| 33 | 24 | ప్రాప్తింవ | ప్రాప్తింప |
| 35 | 3 | వచింవుచు | వచింపుచు |
| 42 | 11 | తెజ | తేజ |
| 64 | 15 | పుత్రికున | పుత్త్రికున |
| 67 | 15 | జనములు | జలములు |
| 75 | 14 | విబుథ | విబుధ |
| 77 | 2 | తేజోయు | తేజోయు |
| 82 | 2 | సర్వధా | సర్వదా |
| 83 | 13 | శతపత్త్రి | శతపత్రి |
| ,, | 17 | చుంచిత | చుంబిత |
| ,, | 20 | దంతర్గమై | దంతర్గతమై |
| 84 | 3 | ముఖంము | ముఖంబు |
| ,, | 9 | గృహాంత | గుహాంత |
| 85 | 2 | నడిచిన | నడచిన |
| 86 | 2 | తినల్పె | తిసల్పె |
| 88 | 1 | శ్రీకృష | శ్రీకృష్ణ |
| 91 | 11 | పుత్రికుం | పుత్త్రికుం |
| 99 | 23 | గుణాడ్యు | గుణాఢ్యు |
| 103 | 6 | పత్త్రి | పత్రి |
| 106 | 1 | పారుజాతం | పారిజాతం |
| 114 | 15 | మిత్త్రి | మిత్రి |
| 118 | 18 | వేఱుచు | వేర్చుచు |
| 128 | 7 | మత్సానిధ్య | మత్సాన్నిధ్య |
| ,, | 12 | యదితికి | యా దితికి |
| 132 | 15 | పత్త్రి | పత్రి |
| 137 | 10 | చుండ్రా | చుంద్రా |

| | | | |
|---|---|---|---|
| 137 | 19 | దాలుచు | దాల్చిన |
| 151 | 3 | లింధనమ్ముకై | లింఘనముకై |
| 152 | 2 | న్వ్యాల్లుచును | న్వ్యాలుచును |
| 153 | 25 | నొసరుచు: | సలిపెడి |
| 160 | 7 | స్నానమొందియును | స్నాతులగుచు నను |
| 162 | 21 | బుట్టి | పుట్టి |
| 163 | 1,2 | వాసి! సీ! భవత్ప్రా పునఃగోరు | వాసినీ! జగ- ద్వ్యాపిని! నీదు |
| 168 | 15 | శను దద్భ | శను తద్భ |
| 170 | 23 | మును దం | మును తం |
| 173 | 9 | పురశ్చ | పునశ్చ |
| 177 | 2 | గర్వాంధు | గర్వాంధు |
| ,, | 4 | యూడుట | యుండుట |
| 179 | 19 | జాయతనేత్రుఁడు | జాతదళాక్షుఁడు |
| 180 | 3 | నిరుప | నిరుపము |

సరా:— ఇవిగాక గంధర్వశబ్దము చాలచోట్ల 'గంధర్వ' అని ముద్రింపబడెను. దీనిని పాఠకులు సవరించుకొనఁ బ్రార్థితులు. కొన్ని చోట్ల అరసున్నలు అనవసరముగ నున్నవి. ఉండవలసినచోట్ల లేవు. శకటరేఫల ప్రమాదములుకూడ నున్నవి. వానిని ద్వితీయ ముద్రణమున సవరించుకొనగలనని విన్నవించుకొనుచుంటిని.

20 వ పేజీలో ముద్రింపఁబడిన పేర్లలో 5 వ పేరు డాక్టరు యస్. యస్. యాజులుగారు అనుటకు బదులు పొరపాటున పి. వి. యాజులుగారు అని ముద్రింపఁబడినది. పాఠకులు సవరించుకొనఁ బ్రార్థితులు.



ప్రథమ ముద్రణము 1000 ప్రతులు

ఇట్లు విధేయుఁడు,

గ్రంథకర్త.

# సుధాలహరి

'నారదభక్తిసూత్రము'లకు తెలుఁగు వ్యాఖ్యానము ఇచ్చుచున్నది.

ప్రేమ భక్తితత్త్వమును గురించి దేవమునీంద్రుఁడగు నారదుఁడు రచించిన భక్తి సూత్రములకు విపులమైన తెలుఁగు వ్యాఖ్యానము. సకలజన ముక్తిదాయకము. అందరును పఠింపఁదగినది. సకల జాతీయ ధర్మములును భక్తిసాధనములే యని సిద్ధాంతీకరింపఁబడిన మోక్ష గ్రంథము. ఇందులో 1 ప్రేమభక్తి స్వరూపము, 2 ప్రేమయందలి అనన్యత, 3 ప్రేమభక్తి లక్షణము, 4 ప్రేమభక్తి ఫలదాయకము, 5 తత్సాధనములు సత్సంగ మహిమ, 6 దుస్సాంగత్యమువలన కలుగు బాధ, 7 మాయనుండి యెవరుతరింతురు, 8 ప్రేమభక్తి, గౌణభక్తికిఁ గల భేదము, 9 భక్తియందలి సౌలభ్యమాహాత్మ్యములు, 10 భక్తి సాధనములు వాని యంతరాయములు, 11 ప్రేమభక్తుల మహిమ, 12 వాద వివాద రూప విఘ్నము, 13 భక్తికి ప్రధాన సహాయము, 14 భక్తియొక్క ఫలము దాని సర్వ శ్రేష్ఠత॥

అను 14 ప్రకరణములు, 84 సూత్రములుగల మహోత్కృష్ట గ్రంథము, త్వరలో వెలువడును.

విజయవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షర శాలయందు ముద్రింపబడియె.